# శ్రీ వివేకానంద లేఖావళి

రెండవ భాగము



శ్రీ రామకృష్ణ మఠము
మైలాపూరు :: మద్రాసు-4

17,224

# శ్రీ వివేకానంద లేఖావళి

(రెండవ భాగము)

అనువాదకుడు :

శ్రీ చిరంతనానందస్వామి



శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4

# విజ్ఞప్తి

వివేకానంద లేఖావళి వివేకానంద హృదయ దర్పణము :

భారత దేశభక్తుల కేకాక, భారతవర్ష పునర్నిర్మాణకర్తల కెల్లరకును మార్గదర్శిని; భారతీయులు దేశభక్తిరహితులై స్వధర్మచ్యుతులై, పాశ్చాత్యనాగరికతా వ్యామోహితులై యుండ, భారతీయ వైజ్ఞానిక వియత్తలమున మెఱసిన విద్యుల్లేఖావళి.

Letters of Swami Vivekananda అను గ్రంథమునకు మా యనువాదమగు దీనిని రెండు భాగములుగాఁ బ్రకటించియున్నాము. సాధ్యమైనంతవఱకు వెల తగ్గించి జనుల కందుపాటులో నుండునట్లు చేయు తలంపున, మూలమునఁ జదువరుల కంతగా ప్రయోజనకరముకాని కొన్ని లేఖలను, అట్టి భాగములను విడిచినను, ముఖ్యమగువాని నన్నిటిని వెలువరించియున్నాము. ఆయా వివరములు గ్రంథాంతమునఁ దెలుపఁబడినవి.

ఎంతటి కార్యనిమగ్నులై యున్నను, ఎట్లో తీఱిక చేసికొని యీ లేఖావళికి పీఠిక వ్రాసిన డాక్టర్, సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారికి శ్రీ రామకృష్ణ భగవానుఁడు చిరాయు రారోగ్యములను, పరిపూర్ణ భక్తి జ్ఞానములను బ్రసాదించి వారిచే నితోధిక దేశభాషా సేవలను జేయించుఁగాక!

తూర్పుగోదావరిజిల్లా, రాజోలు తాలూకా, జనిపి రెడ్డివారిపాలెము వాస్తవ్యులు, కీర్తిశేషులు శ్రీ కంచెర్ల మంగమ్మ-వేంకటస్వామిగార్ల జ్ఞాపకార్థము వారి కుమాళ్లు ఈ పుస్తకప్రకటనకై ప్రథమముద్రణావసరమున నూట డెబ్బదియైదు రూపాయల ధనసాహాయ్య మొనర్చి వెల తగ్గించుటకు మాకుఁ దోడ్పడియున్నారు. శ్రీరామకృష్ణ భగవానుఁడు వారిని వారి కుటుంబమును అనుగ్రహించుఁగాక!

శ్రీ రామకృష్ణమఠము
మైలాపూరు, చెన్నపురి
మార్చి, 1947.

చిరంతనానందస్వామి

# పీఠిక

చిరంతనానందస్వాములవా రాంధ్రవాఙ్మయమున నిదివఱలోనే మంచిపేరును బ్రసిద్ధినిఁ గన్న మహనీయులు. గద్యరచనయం దాధునికులలో నద్వితీయులు. నన్నయ్యను చిన్నయ్యను జ్ఞప్తికిఁ దెచ్చువారు. వీరి శైలి మనోహరము; అమృతము. శైలికంటెను ముఖ్యమైనది వీరు నివేదించు విషయములు. వీరు వ్రాయునది వినోదార్థము కాదు, క్రీడగా కాదు; గొప్ప మనస్సుతో, నిండుహృదయముతో జనుల యొక్క ఐహికాముష్మిక వినియోగార్థము. ఇట్టి గొప్పవిషయములను ఇంత రసవంతముగా వ్రాయుట చాలా దుస్తరమైన పని. దానిని నెఱవేర్పఁజాలిన కొలఁది సంఖ్య గొప్పవారిలోఁ బూర్వాశ్రమమున (బ్రహ్మచర్యాశ్రమమున) మాధవచైతన్యులనియు, సన్న్యాసానంతరము చిరంతనానందస్వామి యనియుఁ బేరువడసిన యీ గ్రంథకర్తగా రొకరు.

కొన్నిసంవత్సరముల క్రిందట వీరితో సల్లాపసౌఖ్యము ననుభవించుచు, వివేకానందస్వాములవారి లేఖలను తెనిఁగించి యాంధ్రలోకమునకు వికాసము కల్పింపుఁడని సూచించితిని. నా సూచన యధికప్రసంగమని నాకుఁ దెలియకపోలేదు. నా యాతురత ఆ జిహ్వాచాపల్యమునకుఁ బాల్పడఁజేసినది. తమ మనోరథమును గర్తవ్యమును ఆ దిక్కుననే ప్రసరించి యుండుటచేత అనాయాసముగ నంగీ

కరించిరి. ఆ సంభావన నిమిత్తమాత్రము, హేతువు వారి మనోరథము.

వేయిన్ని తొంబన్నూట యెనిమిదవ సంవత్సరమున ననఁగా ముప్పదియేండ్ల క్రిందట వివేకానందుల లేఖలను గుఱించి మైసూరు పట్టణములోఁ బ్రసంగించితిని, ఆ సభకు వచ్చినవారి మాటలనుబట్టి యీ కాలమునకు వానికిఁ దగినంత ప్రాచుర్యము వచ్చి యుండలేదని తోఁచినది, ఇప్పటికిని వచ్చియున్నదో లేదో విచార్యము. వివేకానందుల రాజయోగాది తత్త్వగ్రంథములకును, ప్రసంగములకును లభించినంత వ్యాప్తి వారి లేఖలకు రాలేదు కాఁబోలు.

ఇది యెంతయు శోచనీయము. భారతదేశములోఁ బ్రతియింటను ఉండవలసిన పుస్తకములలో నిది యొకటి, బాలికా బాలకులెల్లరును శ్రద్ధతో పదే పదే చదువవలసిన పుస్తకములలో నిది యొకటి. నేను చిన్ననాఁడే దీనిని జదివితిని. నా యల్పజీవితమును కొంతకుం గొంత బహుశః తాత్కాలికముగా మేలునకుఁ దెచ్చుటకై పనికివచ్చిన గ్రంథములలో నిదియు, శ్రీరామకృష్ణ పరమహంసగారి దివ్యచరిత్రమును, ఉపదేశములును ముఖ్యములు.

ఈ లేఖలలోని విశేషము లెవ్వి? ఇవి అప్పు డప్పు డనేక ప్రదేశములనుండి వ్రాయఁబడినవి. వివేకానందులు హిందూతత్త్వ ప్రచారార్థము 'అమెరికా' ఖండమునకు యాత్రసలుపునపుడు 'జపాన్' మొదలైన మధ్య దేశములను

దర్శించిరి. అచ్చటి స్థితిగతులను గమనించిరి. 'అమెరికా' లోఁ జేరినపిదప ఆదేశముయొక్క ఔన్నత్యమును, అచ్చటి స్త్రీపురుషుల విద్యాదిగుణసంపత్తిని జూచి యద్భుతముతో సహా ఆమోదమును బొందిరి. అట్టి తరుణములలో హిందూ జనుల స్థితిగతులకును, ఆ యభివృద్ధిఁ జెందిన దేశముల స్థితి గతులకును ఉండు వ్యత్యాసములు గ్రుడ్డివానికైనఁ గన్నులఁ గట్టినట్లు స్ఫురింపకపోవు. ఇఁక దివ్యదృష్టిఁ గలిగిన వివేకా నందుల సంగతిఁ జెప్పవలయునా! చూచినది చూచినట్లు వ్రాసిరి, తట్టినవి తట్టినట్లు తెలిపిరి; ఎప్పుడెప్పు డేయే విషయములు గోచరించెనో, యేయే యోజనలు ప్రభవిల్లెనో వానిని వేఁడివేఁడిగా నివేదించిరి. అట్లనుటచే నివి శాశ్వత త్వములేని తాత్కాలికములైన సంచలన సంజనిత బుద్బుద ములనుట యేమాత్రము కాదు. వివేకానందునివంటి దివ్య దృష్టి, దీర్ఘదర్శిత్వముఁ గల యఖండ జ్ఞానులయందు లౌకిక ములకు, సనాతనములకు భేదము అట్టె యుండదు. అవకాశ మప్పటిది కావచ్చును! సిద్ధాంతమెప్పటిదియు.

ఈ లేఖలకు నుత్తేజకమైన కారణము వివేకానందుల దేశభక్తియు, దైవభక్తియు. 'దైవం పురుష రూపేణ.' దేవుని యందు నిజమైన భక్తిఁగలిగినవాఁడు మానవకోటియందుఁ బ్రేమఁజూపకపోఁడు. మఱియు భగవంతుని కృపావిశేష ముచేఁ దాను ఉద్దేశించిన ప్రయోజనములన్నియుఁ దప్పక నెఱవేఱునను విశ్వాసమును వహించినవాఁడగును. జయము సిద్ధమని నమ్మినవాఁడు కార్యములయం దుత్సాహమును

చూపును. ఈ లేఖలయందు దైవభక్తి, మానవరక్తి, కార్యాసక్తి—ఇవి నిరంతర సంయోగముఁ దాల్చి జీవితాంధకారమును దొలఁగింపఁజేయు జ్యోతిగ నుండుట స్పష్టము.

మానవులయందలి ప్రేమ ముఖ్యముగాను సహజముగాను ప్రభవించి, ప్రవహించు రంగము తన దేశము, తనజాతి. భారతీయులపై స్వాములవారి కుండు ప్రేమావేశము ఇంతింతనరానిది; కులభేదములు, మతభేదములు మొదలగు వైషమ్యములచే నేమాత్రము దూషితము, పరిమితము కానిది; ఐనను జాలితోఁ గూడికొన్నది. ఈ జాలి, శోకము, ఎందులకనిన మన హీనస్థితినిగూర్చి. హిందువుల తత్త్వశాస్త్రములు, ధర్మోపదేశములు భావాంబరమున ఉచ్ఛ్రాయము నధిష్ఠించియుండు నఖండతేజస్సులు. మఱి, వారి శీలము, దినదిన వర్తనము, జీవితము వ్యక్తులనుబట్టి గణించినను సరే; సమష్టి సాంఘికముగా లెక్కించినను సరే; చాలహీనము, దౌర్బల్యపూరితము; ఐకమత్యము లేదు, పరస్పర విశ్వాసము తక్కువ. సత్యము విశ్వాసమున కాలవాలము. ఒకరియందొకరికి నమ్మకము లేదన్న, వీనిమాటయందు వానికి, వాని మాటయందు వీనికి నమ్మకము లేదనుట. అనఁగా, వీఁడసత్యపరుఁడని వాఁడు, వాఁడసత్యపరుఁడని వీఁడు శంకించుట. సత్యము సామాన్యముగాఁ బ్రవర్తిల్లెనేని సంఘమున నిట్టి సంశయము ఉండదు. దానిసంఘటనము విఘటనము కానేరదు. హిందువులలో విద్యతక్కువ; చాదస్తము లెక్కువ

క్షాత్రము లేదు; బానిసల భావములు తలఁచు. కావున నిక్కమైన సాత్త్వికమును అరిది. అతిశయముగ భయము, క్షామము పట్టినవారలు. కోటానుగోట్ల జనులకు ఆనాఁడు ఒక్కపూటయైనఁ గడుపు నిండ కూడు దొరకుట కష్టము.

ఏమిరా! ఐహికమునుగూర్చి యింత తెలిసిన వారు వర్తనమున నింత నీచస్థితికి రానేల? పరలోకమునకు సమీపసులగుటవలననా, ఈ లోకమునకు దూరులైరి? ఐహికాముష్మికములు పరస్పర విధ్వంసకములా, యన్యోన్యాశ్రయములు కావా? ఒక్కభగవంతుఁడే కదా యీ రెంటికిని గారణభూతుఁడు? ఒక్క బుగ్గనుండియు నొకవంక పాలు, నొకవంక విషముఁ బ్రవహించునా? హిందువులలో విచ్ఛిన్నమైన జీవితమును బునస్సంధాన మొనరించి యేకాగ్రముగఁ బరివర్తించునట్లు చేయుట సాధ్యముకాదా? అట్టి పురోవృద్ధి మార్గము లెవ్వి? ఇత్యాది గంభీరములైన భావములతో నిండి భారతీయులకును—అందుఁ బ్రధానముగా హిందువులకును—అమూల్యములైన వితర్కములతోను ఉపదేశములతోను నిండియున్న దీ లేఖాకృతి.

వ్యక్తికి సంఘమునకు, మతమునకుఁ బ్రకృత్యాది శాస్త్రములకు, ఇహమునకుఁ బరమునకుఁ, త్యాగమునకు నార్థికాభ్యుదయమునకు, శాంతమునకు క్షాత్రమునకు, విమర్శనదృష్టితోఁ జూచినయెడలఁ బరస్పర వైరుధ్యము లేదనియు, నవి నిత్యమును నిరంతరమునైన సంయోగమును మనయందుఁ దాల్చినవే కాని, మన జీవితము పరిష్కృతము,

పరిపక్వము, పరిపూర్ణము కానేరదనుట యీ లేఖల యమోఘమైన సిద్ధాంతము.

కావుననే కదా మన భారతీయులలో నాబాలగోపాల మెల్లరును జదివి యనుష్ఠానమునకుఁ దెచ్చుకొనవలసిన మహత్తర గ్రంథములలో నిది యొక్కటి యని మొట్ట మొదటనే నేను సాహసించి నివేదించియుండుట ! ఈ కర్తవ్య మాంధ్రులలో సులభముగ నెఱవేఱఁ జేయఁబడు టకునై చిరంతనానందస్వాములు తెనుఁగున నాకర్షకశైలి యందు దీనిని రచించి మనకెల్లరకు పంపసీయుదురైరి. వారి కృషికి వారు కోరు ఫలమొక్కటియే. మనయొక్క శీలాభివృద్ధి, మనదేశముయొక్క పురోవృద్ధి. వీనికై వలసిన ప్రయత్నములను త్రికరణశుద్ధిగఁ జేసి, వారి ఋణమును దీర్చి, వారికి మనకృతజ్ఞతను దెలిపి ధన్యులమగుదముగాక యని నా ప్రార్థన.

పద్మప్రభాస,<br>
ఉదగారు,<br>
9-2-'46.

కట్టమంచి రామలింగారెడ్డి



శ్రీ వివేకానందస్వామి

(చికాగోనగరమున విశ్వమతమహాసభయందు)

ఓమ్

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# శ్రీ వివేకానంద లేఖావళి

## (రెండవ భాగము)

1 1894.

ప్రాణాధిక ——...సరియే కాని నాయనా, భారతదేశమున ధర్మమేమైన నింకను మిగిలియున్నదనియా నీ యభిప్రాయము! జ్ఞానయోగము, రాజయోగము, భక్తియోగము——ఇవన్నియుఁ బలాయనమైనవి——ఇఁక నస్పృశ్యత యొకటియే, 'నన్ను ముట్టుకొనకుము!' అను యోగ మొక్కటియే నిలిచియున్నది. 'ప్రపంచమంతయు నశుద్ధము, నే నొక్కఁడనే శుద్ధుఁడను!' పరిశుద్ధ బ్రహ్మజ్ఞానము! శ్రీరామరక్ష! ఈ రోజులలో బ్రహ్మ మంతరంగమునఁగాని, కైలాసమునఁగాని, వైకుంఠమునఁగాని, సకలజీవకోటిలోఁగాని లేదు —— మఱి యెచటనున్నదనిన, వంటకుండలో. "త్రిభువన ముపకార శ్రేణిభిః ప్రీయమాణః"—తమ యుపకార పరంపరలచే ముల్లోకముల నానందింపఁజేయుట పూర్వము మహాపురుషలక్షణముగాఁ జెప్పఁబడుచుండెడిది —— ఇప్పుడో యనిన, "నే నొక్కఁడనే శుద్ధుఁడను, జగమంతయు నశుద్ధము——పోయి ధనము గైకొనివచ్చి నా పాదసన్నిధిని సమర్పింపుము" అనునది మహాపురుషలక్షణము... ఇచటి నా ప్రచారమును జాలించి యింటికి మఱలుమని వ్రాయు ధీమంతునకు "ఈ దేశమే నా యిల్లు —— హిందూదేశమున

నేమున్నది?'' అని చెప్పుము. ధర్మము నాచరించువా రెవరు? విద్య నాదరించువా రెవ్వరు?

ఇంటికి మఱలుటయా!! ఇల్లెక్కడ? ముక్తినిగాని, భక్తినిగాని నేను లక్షింపను, దానికంటె ''వసన్తవల్లోకహితం చరన్తః'' యనునట్లు (నిరాడంబరముగా) వసంతము వలె లోకహిత మొనరించుచు, లక్షపర్యాయములైనను నరకమునకైనను సరియే, వెడలుటయే నా యభీష్టము, నా ధర్మము. అలసుల, కఠినహృదయుల, క్రూరుల, స్వార్థపరుల —— జోలి నాకేల? ఎవఁ డదృష్టవంతుఁడో వాఁడే యీ మహాకార్యమునఁ దోడ్పడుఁగాక.

...అచటివా రందఱును నాకుఁ బ్రేమపాత్రులే— ఈ విషయమును వారందఱకును దెలుపుము. అందఱి తోడ్పాటును నాకుఁ గావలసియున్నది. ధనమువలనఁగాని, పేరువలనఁగాని, ప్రతిష్ఠవలనఁగాని, పాండిత్యవలనఁగాని లాభము లేదు. కష్టసహస్రములను బట్టాపంచలు చేయఁజాలునది శీలము, సత్స్వభావము. ఈ సంగతి మఱవకుఁడు...—
సదా మీ స్నేహపాత్రుఁడు, వివేకానందుఁడు.

2

చికాగో, 3-1-1895.

ప్రియవర—ప్రేమ—విశ్వాస—కృతజ్ఞతాపూర్ణహృదయుఁడనై మీకు వ్రాయుటకై కలము చేపట్టితిని. స్థిరబుద్ధియు స్థిరభావములును గల వ్యక్తులను లోకమున నే నింతవఱకే కొలఁదిమందినో చూచినాను.—అట్టివారిలో మీ రొకరని

చెప్పవలసియున్నది. ఆచరణశక్తియే కాక, యత్యద్భుత సమ్మేళన మొందియున్న జ్ఞానమును స్వానుభూతియు మీ వశమైయున్నవి. మఱియు మీరు నిష్కపటహృదయులు, కావున, నా యభిప్రాయములను గొన్నిటిని మీకు విప్పి చెప్పెదను.

భారతదేశమున మన యుద్యమము చక్కఁగా నంకురించినది, దానిని మనము సంరక్షించుటయే కాక, విశేషశక్తిసామర్థ్యములతో వికాసము నొందింపవలసి యున్నది. ఇదే తరుణము, ఇది దాఁటిన, మఱియొకతరుణము దొరకదు. పరిస్థితులను బాగుగాఁ బరిశీలించినపిమ్మట నాకిట్లు తోఁచుచున్నది. చెన్నపట్టణమున మొట్టమొదటఁ దత్త్వకళాశాలను స్థాపించుట మంచిది; తరువాతఁ గ్రమముగాఁ దదాశయములను నవకాశమును విస్తరింపవచ్చును; వేదములందును వివిధమైన భాష్యములందును వీనితోఁబాటు ప్రపంచమందలి యితరమతధర్మములందును విద్యార్థులకుఁ గూలంకషమైన విద్య గఱపవలయును, మఱియు నీకళాశాలనుండి యాంగ్లమునందును దేశీయభాషయందును నొక పత్రికను నడపవలయును.

ఇది కేవలము మొదటి మెట్టు; అల్పారంభములే మహాకార్యములై పరిణమించును గదా. ప్రాచీన నవీన జీవనదృక్పథములను రెంటిని గణుతించుటచేఁ జెన్ననగర మిపుడు మహత్తరమైన మధ్యేమార్గము నవలంబించుచున్నది.

గుణదోషములను బరిశీలించి సమాజమును బునర్నిర్మాణము చేయవలసియున్నదనుటలో విద్యాధికులతో నేను బూర్తిగా నేకీభవింతును. కాని దీనికి మార్గము? సంస్కర్తల విధ్వంసకమార్గములు నిష్ఫలములైనవి. నా మార్గమిది. గతకాలమున మనము చేసినపని దోషభూయిష్ఠము కాదు, ఎన్నఁటికిని కాదు. మన సంఘము చెడ్డది కాదు. మంచిదే, ఇంకను మంచిది కావలయునని మాత్రమే నేను జెప్పెదను. భ్రమనుండి సత్యమును, చెడుగునుండి మంచిని గ్రహింపవలయుననుట కాదు, కాని సత్యమునుండి—శ్రేయమునుండి—అధికతర శ్రేయమును బరమశ్రేయమును బొందవలసియున్నది. నా దేశీయులకు నేను జెప్పెడిదిది: "ఇంతవఱకు మీరు చేసినది చక్కఁగనే యున్నది; మఱింత చక్కని పనిచేయుటకుఁ దరుణమిది." ఉదాహరణమునకు వర్ణవ్యవస్థ నెత్తుకొందము. వర్ణమనఁగా జాతి, సృష్టివిషయమున మొదటఁ దోఁచు భావమిదియే. సృష్టియనఁగా విచిత్రత — అనఁగా జాతి. "ఏకమగు నే ననేకమగుచున్నాను."* సృష్టికిఁ బూర్వ మేకత్వ మనునది యుండవలయును. భిన్నత్వమే—వైచిత్ర్యమే—సృష్టి. వైచిత్ర్యము నశించినచో సృష్టియే నశించును. ఏజాతియైనను సజీవమై, వీర్యవంతమైయున్నంతవఱకు వైచిత్ర్యమును వెలువరించుచుండవలయును. వైచిత్ర్యమును వెలువఱుచుట మానినంతనే జాతియు నశించును. వ్యక్తి తన స్వభావమును—

* "ఏక ఏవ అగ్ర ఆసీత్, సో౽మన్యత బహుస్యాం ప్రజాయేయ ఇతి."—శ్రుతి.

ప్రకృతిని—జాతిని—వ్యక్తమొనర్పు స్వాతంత్ర్యమైయున్నది—ఇదియే జాతియందలి మూలభావము. కావుననే జాతివ్యవస్థ వేలకొలఁది సంవత్సరములనుండియు నిలిచియున్నది. అతి నవీనస్మృతులలోఁ గూడ జాత్యంతరభోజనము నిషేధింపఁబడలేదు, అతిప్రాచీనస్మృతులలోనైత మంతర్వివాహము నిషేధింపఁబడలేదు. అగుచో, భారతదేశపతనమునకుఁ గారణమేమి?—పైని చెల్పిన జాతిభావమును విడనాడుటయే. గీత తెలుపు రీతిని జాతి నశించిన, లోకమే నశించును. ఈ వైచిత్ర్యమును నిరోధించుటచేఁ బ్రపంచమే నశించునని తెలుచున్నది. నేటి వర్ణవ్యవస్థ సరియైనది కాదు, పై పెచ్చు తద్వికాసమునకుఁ బ్రతిబంధకము. జాతియొక్క వ్యాపారమగు వైచిత్ర్యప్రకటనమును స్వేచ్ఛగా సాగనీయక నిజముగా నిది యరికట్టియున్నది. చైతన్యరహితమై, పాషాణతుల్యమైన యే యాచారమైనను, ఆధిక్యమైనను, ఎట్టిపరంపరానుగతవర్గమైనను జాతిని సంపూర్ణవికాసము నొందనీయక నిరోధించును; మఱియు నే జాతియైనను, సమాజమైనను, ఈ బహుళవైచిత్ర్యమును వెలువఱుచుట మానినంతనే నశించితీరును. కావున స్వదేశీయులారా! నామాట వినుఁడు, జాతివ్యవస్థను మీరు నిరోధించి వెలివేయుటచేతనే భారతదేశ మధోగతి పాలైనది. పాషాణతుల్యమైన యే "అగ్రజాతి" యైనను జాతి యనిపించుకొనఁజాలదు. అది జాతివ్యవస్థకు ఘాత. స్వేచ్ఛగా జాతి నాత్మవికాసము నొందనిండు; ఆటంకములను తొలఁగింపుఁడు, అపుడు మన మభివృద్ధినొందుదుము. ఏకోపాఖండమును గనుఁడు. వ్యక్తుల

పుణోగమనమార్గమందలి యాటంకములను జాలవఱకుఁ దొలఁగించి, ప్రతివ్యక్తియుఁ దనజాతిని వికసింపఁజేసికొను నవకాశ మొసఁగి,—యిట్లు జాతికి స్వాతంత్ర్య మీయఁ గలుగుటచేతనే యూరోపాఖండ మభివృద్ధిపొందినది. అమెరికాలో సరియగు జాతివ్యవస్థ వికాసమునొందుటకు మహోత్తమమైన యవకాశము గలదు. కావుననే యమెరికా దేశీయులు ఘనులైనారు. శిశువు జన్మించినంతనే జ్యోతిషికులు తదీయజాతిని నిర్ణయింపఁజాలుదురని ప్రతి హిందువునకును దెలియును. ఇదియే నిజమైనజాతి, నిజమైన వ్యక్తిత్వము ; జ్యోతిషము దానిని గుర్తించియున్నది. మనల జాతికి సంపూర్ణస్వాతంత్ర్యము నొసఁగుటచేతనే మన మభివృద్ధినొందఁగలము. వైచిత్ర్యమనఁగా నసమత్వమని కాని, ప్రత్యేకాధికారమని కాని భావింపరాదు. హిందువులు దేనిని వినాశనకరమనలేదనియు బహుశతాబ్దాగత దాస్యఫలితమగు మాంద్యమును వీడి, మహాత్ములు చూపిన మార్గమునఁ జరింపఁదగునవియు వారికిఁ దెలుపుదును—ఇదియే నా విధానము. ప్రజాపీడనముతోఁగూడిన...ప్రభుత్వమున మన యభివృద్ధి వెనుకఁబడినదనుట వాస్తవము, ఏలన నప్పుడభివృద్ధిమాట యటుండ, 'ఉండుటయా, యూడుటయా' యను సమస్య యేర్పడినది. ఇప్పు డాయొత్తిడి తొలఁగిపోయినది కావున మనము ముందంజవేయవలయును,—స్వధర్మత్యాగులును మిషనరీలును దెలుపు విధ్వంసకమార్గమునఁగాక స్వధర్మమార్గమున — ముందంజవేయవలయును. భవనము పూర్తికానిచో నంతయు వికృతముగాఁ గాన్పిం

చును—మనవిషయముకూడ నిట్టిదే. ప్రజాపరిపీడనముతోఁ గూడిన శతాబ్దములలో భవననిర్మాణము నాఁటివేయవలసి వచ్చినది. ఇపుడు భవనమును బూర్తిచేయుఁడు—చేసినచో సర్వము యథాస్థితియందు వెలయుచు దివ్యసుందరమై దీపించును. ఇదియే నా కార్యవిధానము. ఇది నా దృఢవిశ్వాసము. ప్రతిజాతియందును ప్రతిసంఘమునను జాతీయజీవనవాహిని ముఖ్యముగ నొక మార్గమునఁ బ్రవహించుచుండును; భారతదేశమున నీ ముఖ్యమార్గము మతము, పరమార్థము. దీనిని మీరు బలపఱిచినచో, నిరువైపులనున్న జలమును దీనితోఁబాటు ప్రవహించిపోవును. నా కార్యక్రమమునందిదియొక ప్రధానాంశము. కాలక్రమమున మిగిలిన కార్యక్రమమునంతను దెలుపనెంతును. ఐనను ప్రస్తుత మీ దేశమున సైతము నేను నిర్వహింపవలయు నొక కార్యము గలదని తోఁచుచున్నది. మఱియు వేఱెచ్చటినుండియుఁగాక, యీ దేశమునుండియే తోడ్పాటు లభింపఁగలదని యూహించుచున్నాను. కాని యింతవఱకు నా యాశయములను వ్యాప్తి చేయుటకంటె మఱేపనిని చేయఁజాలనైతిని. ఇపుడు భారతదేశమున సైత మిట్టిప్రయత్నమే జరుగవలయునని కోరెదను... భారతదేశమునకు నే నెపుడురాఁగలనో నాకే తెలియదు. భగవదాజ్ఞాబద్ధుఁడను. నేను వానిచేతిలో నున్నాను.

. .

“ప్రభూ! సర్వేశ్వరా! ఈ లోకమున నిధినిక్షేపముల నన్వేషించుచు, నీవే నా పెన్నిధివని—చింతామణివని—కనుఁగొంటిని. నన్ను నీకు సమర్పించుకొనుచున్నాను.

"ప్రీతిపాత్రుని వెదకుచు, నీవే నా ప్రాణప్రియుఁడవని కనుఁగొంటిని. నన్ను నీకు సమర్పించుకొనుచున్నాను." (యజుర్వేదసంహిత.)

భగవానుఁడు మిమ్ము సదా, సర్వథా, అనుగ్రహించుఁగాక!—సదా కృతజ్ఞతాబద్ధుఁడు, భవదీయుఁడు, వివేకానందుఁడు.

3

చికాగో, 11-1-1895.

ప్రేమాస్పద—, ఇప్పుడే నీ లేఖ యందినది...ఎవరేమి యెత్తెత్తినను * హిందువుల వేదాంతమతము (విశ్వమత మహాసభలో) తన 'తాహతును' నిలువఁబెట్టుకొనఁగలిగినది. డాక్టర్ బా—యును ఆతరగతి వ్యక్తులును 'శుద్ధ సనాతనులు.' వారివలన నే నెన్నఁటికిని సాయము నపేక్షింపను ...పరమేశ్వరుఁడు నాకీదేశములో మిత్రుల ననేకులను సమకూర్చియున్నాఁడు, వారిసంఖ్య నిరంతరము వృద్ధిపొందుచున్నది...భగవంతుఁడు వారి ననుగ్రహించుఁగాక!... ఇంతవఱకు సదా ఈ దేశములో మహాకేంద్రము లనఁదగు న్యూయార్కు, బోస్టన్ పట్టణములనడుమ సంచరించుచున్నాను—బోస్టన్ ఈ దేశమునకు ధీశక్తి యనియు న్యూయార్కు ఖజానాయనియుఁ జెప్పవచ్చును. ఈ రెంటి

* జె. ఎచ్. బారోస్ (Rev. J. H. Barrows) అను వాఁడు వ్రాసిన The World's Parliament of Religions (విశ్వమత మహాసభ) యను గ్రంథమును జూడుఁడు.

యందునుగూడ నా విజయ మసామాన్యమై యొప్పినది. వార్తాపత్రికాప్రకటనలను నేను లక్ష్యింపను. అట్టివానిని నేనిని మీకు నేను బంపుచుంటినని మీరు భావింపరాదు. ఉద్యమ ప్రారంభమునకుఁ గొంచెము "హోరు" కావలసి వచ్చినది, అది చాలును.

...మీ రవలంబింపవలసిన కార్యక్రమము నిదివఱకే మీకుఁ దెలిపియున్నాను. ఇపుడు మీరు దాని నెంతవఱకు సాధింపఁగలరో కార్యరూపమున నాకుఁ జూపవలయును. అర్థరహిత ప్రలాపము లింకఁ బనికి రావు. కార్యరంగమున దిగవలయును; నిజమైన పని చేసి చూపి, హిందువులు తమ మాటలను నిలువఁబెట్టుకొనవలయును, చేతఁగానిచో వా రెందుకును బనికిరారన్న మాట. ...నా విషయమో యందురా, సత్యప్రకటనమే నా మతము, ఇచటనైన నేమి, మఱెచ్చటనైన నేమి!

నన్నుగాని, మిమ్ముఁగాని, జనులు దూషింపనిండు, భూషింపనిండు, ఇఁకముం దెన్నఁడు మీరు వానిని లక్ష్యింపకుఁడు, పని సాగింపుఁడు, సింహబలసాహసములతోఁ బని సాగింపుఁడు, భగవంతుఁడు మిమ్మనుగ్రహించును. ప్రాణము లున్నంతవఱకు నేను నా యుద్యమమును విడువను. మరణానంతరముకూడ లోకకల్యాణార్థము కృషి చేసెదను. అసత్యము కంటె సత్యము కోటిరెట్లు ఘనతరము; సౌజన్యవిషయము నిట్టిదే. సత్యసౌజన్యములు మీవద్దనున్నచో, అప్రతిహతమగు మార్గమేర్పడును.

...ఉత్తములు వేలకొలఁదిమంది నన్ను గమనించు చున్నారు; ఇది మీకుఁ దెలియును గావున భగవంతుని యందు విశ్వాసము గలిగియుండుఁడు. వార్తాపత్రికాఘోష లన్నియు నాకుఁ గలుగఁజేయఁగలిగిన దానికంటె విశేషమైన పలుకుబడి క్రమముగా నాకీదేశమునఁ గలుగుచున్నది...

శీలము, నైర్మల్యము, సత్యవ్రతము—వ్యక్తిత్వము—వీని ప్రభావమే ప్రభావము. ఇవి నావద్దనున్నంతవఱకు నా శిరోజములైన నెవ్వఁడును దాఁకఁజాలఁడు, నా విషయమై మీరు తాపత్రయపడనక్కఱలేదు. నాకార్యవిఘాతము చేయఁబూనిన వారియత్నము భగ్నమగును, భగవద్వాక్యమును స్మరింపుఁడు...పుస్తకములలో, వాదములలో నే మున్నది? ప్రత్యక్షజీవితమే, ఆచరణమే, అఖండశక్తి మంతము, ఇదియే మానవుల హృదయమును వశ మొనర్చు కొనును. ఆచరణమే వ్యక్తిప్రభావ నిలయము...విషయ మును నానాఁటికి భగవంతుఁడు నాకు విస్పష్ట మొనర్చు చున్నాఁడు. కృషిచేయుఁడు, తీవ్రకృషిచేయుఁడు. అర్థరహిత ప్రసంగము లికఁ జాలును; భగవంతునిగూర్చి మాట లాడుఁడు. ఆయుఃప్రమాణ మత్యల్పము, వంచకులను గూర్చియు వెఱ్ఱులను గూర్చియుఁ బ్రసంగించుచుఁ గాల యాపన చేయుటకు వ్యవధిలేదు.

ప్రతిదేశమును బ్రతిమానవుఁడును దన్ను దానే యుద్ధరించుకోవలయును; పరులు వచ్చి సాయముచేయుదు రని యాసింపకుఁడు. ఇచటఁ దీవ్రకృషిచేసి మీరాయుద్య

మమునకుఁగాను నేనప్పుడప్పుడు కొంచెము డబ్బు పంపఁగలను ——అంతవఱకే. దీనికోసము మీరు వేచియుండ వలసివచ్చిన పక్షమునఁ బని చాలించుటయే మేలు. నా యాశయము లనుసరించుట కిదిమహాక్షేత్రమనియుఁ హిందువులైననేమి, మహమ్మదీయులైననేమి, క్రైస్తవులైననేమి — భగవంతుని ప్రేమించువా రెవ్వరైనను సరియే.—వారికి నేను దాసుఁడ ననియు గ్రహింపుఁడు.

...నెమ్మదిగా, నిశ్శబ్దముగాఁ బనిచేయవలయునని నాకోరిక, భగవంతుఁడే సదా నాకుఁ బ్రాపై యున్నాఁడు. నిష్కపటులై, స్వార్థరహితులై, యన్నిటికంటెను విశుద్ధ చరిత్రులై, మీ రిచ్చవచ్చినచో న న్ననుసరింపుఁడు. మీ కివే నా యాశీస్సులు. ఒకరినొకరభినందించుకొనుచుఁ గూర్చుండుట కిపుడు వ్యవధిలేదు. ఈ మహాసమరానంతరము మనసార మనమొండొరుల నభినందించుకోవచ్చును. ఒండొరులతో మన యాశయములను ముచ్చటించుకోవచ్చును. ప్రజ్ఞలు పలుకకుఁడు, నఱములు బిగియింపుఁడు, పనిచేయుఁడు. కార్యశూరులు గండు! హిందూదేశమున మీ రింతవఱకుఁ జేసిన ఘనకార్యమేదో నాకుఁ జూపుఁడు—— మీరు నిర్మించిన కేంద్ర మేదో, మీరు కట్టించిన దేవాలయ మేదో, నెలకొల్పిన భవనమేదో, నాకుఁ జూపుఁడు——మీతో సహకారమునఁ బనిచేయు వ్యక్తులెవరో నాకుఁ జెప్పుఁడు—— ఎంతసేపు ప్రగల్భములు, ప్రగల్భములు.——అంతే! మేము గొప్పవారము, మేము ఘనులము! అర్థరహితప్రలాపము! మన మర్భకులము, ఇది మనస్థితి! పేరుప్రతిష్ఠలు మున్నగు

బూటకములతో—ఈ ప్రాఁకులాటలతో—నా కేమిపని? అవి యేమైన నా కేమి? వందలకొలఁదిమంది భగవత్సన్నిధి కరుదెంచుటయే నాకు వాంఛనీయము! వా రెవరు? వారు నాకుఁ గావలసియున్నారు, వారిని నేను గనవలయును. వా రెచట నున్నారో మీరు వెదకి కనుఁగొనవలయును. నాకు మీరిచ్చుచున్న వేమి? పేరుప్రతిష్ఠలు. వానిని గంగార్పణము చేసి, హో ధీరులారా! నా భారతవీరులారా! మీరు కార్యరంగమున నుఱుకవలసియున్నది. నా దీక్షను మీరింకను గుర్తింపకున్నారు — నా తత్త్వము మీ కింకను బోధపడలేదు! మాంద్యము, భోగానుభవము — అను మీ ప్రాఁతపుంతల లోనే నడయాడుచున్నారు. అలసతను నైహికాముష్మిక భోగములను విసర్జింపుఁడు. త్యాగాగ్నికీలలలో దుమికి జనులకుఁ బారమార్థికచింతఁ గలిగింపుఁడు.

నా ధైర్యమును నుత్సాహమును గ్రహింతురుగాక యని, మనఃపూర్వకముగా వర్తింతురుగాక యని, కార్యశూరులై రణరంగమున వీరమరణము నొందుదురుగాక యని నిరంతరము ప్రార్థించు—వివేకానందుఁడు.

మఱియొకమాట.— మనలఁగూర్చి ప్రతికూలముగాఁగాని, యనుకూలముగాఁగాని, యేపుల్లయ్యయో, యెల్లయ్యయో చెప్పు మాటలను నమ్మక, తమశక్తిసామర్థ్యముల నన్నిటిని నుద్యమముపైఁ గేంద్రీకరింపుఁడని...తోడను మిగిలినవారందఱితోడను చెప్పుము.—వి.

## 4

12-1-1895.

పేరుప్రతిష్ఠలనుగాని మఱి యే బూటకమునుగాని నేను లక్షించువాఁడను గానని నిష్కర్షగా గ్రహింపుఁడు. లోక కల్యాణార్థము నా యాశయములను ప్రచారము చేయుటయే నా యభిమతము. మీరు గొప్పపని చేసితిరి, కాని ఫలిత మేమి? — అది నాకుఁ బేరుప్రతిష్ఠలను గలుగఁజేసినది. అమూల్యమగు నీ జీవితమును లోకుల పొగడ్తలను సంపాదించుటకై వ్యయించుట పాడిగాదు. అట్టి వెఱ్ఱినడత నడచుటకు నాకు వ్యవధి లేదు. మన యాశయములను వ్యాప్తి చేసి భారతదేశములో నొక వ్యవస్థను—ఒక సంఘమును—నెలకొల్పుటకు మీరు చేసినపని యేమి? ఏమియు లేదు, లేనే లేదు.

అన్యోన్యసహకారము, అన్యోన్యగుణగ్రహణము— వీనిని హిందువులకు బోధించు సంస్థ యత్యావశ్యకము. ఇచటి నా యుద్యమమునుగూర్చి తమ యభినందనమును ప్రకటించుటకై కలకత్తాలో నైదువేలమంది సమావేశమై రనుచున్నారా?—మంచిది! కాని తలకొక యణా యిమ్మని మీరు వారి నడిగినపక్షమున వా రిచ్చియుందురా? మన జాతీయకథయంతయుఁ బసిపాపవలెఁ బరులపై నాధారపడుటతోఁ గూడుకొనియున్నది. బువ్వ కలిపి నోటి కందించిన మెతుకులఁ దినుటకు వారందఱును సిద్ధముగానున్నారు; కొందఱ కదియుఁ జాలదు, పాపము! — గొంతులోనుండి జానిని

గ్రంథికిఁ బ్రోయవలయును. మీకు మీద సాయపడఁజాల నిచో జీవించుటకు మీ రనర్హులు...

నా జనసామాన్యవిద్యాకార్యక్రమమును ప్రస్తుతము విరమించినాను. అది క్రమక్రమముగా సాగును. ప్రచండ దీక్షయు నుత్సాహమును గల ప్రచారకదళము — సేవక దళము — నా కిపుడు కావలయునదిది. ఇంగ్లాండులో సంప్ర తించురీతిని వివిధమతధర్మములను సంస్కృతమును వేదాంత మందలి వివిధమతధర్మములను ముఖ్యమైన కొన్ని దేశీయ భాషలను గఱపుటకై చెన్నపట్టణమున మన కొక కళాశాల యుండవలయును; దీనితోఁ బాటొక ముద్రణాలయమును దస్త్రాలమున నాంగ్లమునను దేశీయభాషలందును బత్రిక లను వెలువరింపవలయును. ఈ కార్యమును నెఱవేర్చినయెడల మీ రేమైనను సాధించితిరని నే ననుకొనఁగలను. పనిచేయ సంసిద్ధులమని దేశస్థులను జూపనిండు. భారతదేశమున నిట్టి కార్యమును మీరు దేనిని చేయఁజాలనియెడల నామాట తలపెట్టక నన్ను విడిచిపెట్టుఁడు. నాకు లోకమున కొసఁగ వలయు నొక సందేశము గలదు. ఎవ్వ రభినందింతురో, ఎవ్వ రాచరింతురో వారికి నేను దానినొసఁగెదను. దానిని స్వీకరించువా రెవ్వరైన నాకేమి! "పరమపితయగు భగవంతుని యాజ్ఞ ననువర్తించువాఁ డెవ్వఁడో వాఁడే"* నావాఁడు...

* "He who doeth the will of My Father, is my own."
—Bible.

నా పేరునకు మీరు ప్రాముఖ్యము చూపరాదు. కొనసాగవలసినవి, కార్యరూపము నొందవలసినవి నా యాశయములు—ఇవియే నా యభిమతము. ప్రవక్తలై, ఆచార్యులై వెలసినవా రందఱియొక్కయు శిష్యులు తమ గురుని భావముల ననివార్యముగా, అభేద్యముగా, నాతని వ్యక్తితో ముడిపెట్టి, తుదకాతని పేరు నిలువఁబెట్టవలయు నను నాందోళనమున నాతని భావములను గంగపాలుచేసిరి. శ్రీరామకృష్ణుని శిష్యులును నీ పుంతనే త్రొక్కకుండుటకుఁ గాను జాగరూకులు కావలయును. వ్యక్తినిగాదు, ఆశయములను లక్ష్యమున నిడుకొని పనిచేయుఁడు. భగవంతుఁడు మిమ్మనుగ్రహించుఁగాక !—ఆశీర్వాదములు.—సదా మీ

వివేకానందుఁడు.

## 5

## ధీరమాత యనునొక యమెరికా దేశీయ మహిళా మతల్లి పితృవియోగము నొందిన సందర్భమున స్వామి యామెకు వ్రాసిన లేఖ

బ్రూక్లిన్, జనవరి, 1895.

...మీ నాయన తన శరీరమును చాలించెనని నాకుఁ బాధకలిగినది; కఠోరమగు మాయాతరంగ పాతమునకు గురికానున్న సమయమున నెవ్వరికిని వ్రాయుట నా యాచారము కాదు. కాని యిట్టివే (విపత్తులే) జీవయాత్రలో నూతనపథములను మనకుఁ జూపునవి. దుఃఖభారమున నీవు ధైర్యము కోల్పోలేదని నే నెఱుఁగుదును. సాగరో

పరిభాగము లేచుచుండును, మఱలఁ బడుచుండును, కాని సాక్షీభూతులగువారికి—ప్రాజ్ఞులకు—ప్రతిపాతమును మగ్నతయు సముద్రపు లోఁతును గర్భముననున్న రత్నరాసులను ప్రకాశిత మొనరించుచుండును. రాకపోకలనునవి వట్టి మాయ—ఆత్మ యెందుండియు రాదు. ఎచటికిని బోదు. దేశమనునదంతయు నాత్మయందే యున్నపు డెచటికిఁ బోవుట? కాలమనునదంతయు నాత్మయందే యున్నపుడొక వస్తువునందుఁ జొచ్చుటకుఁగాని, యొకవస్తువును వీడుటకుఁ గాని సమయమేది?

సూర్యుఁడు తిరుగుచున్నాఁడను భ్రాంతిని గలుగఁ జేయుచు, భూమియే తిరుగుచున్నది. ఇట్లే ప్రకృతి, లేదా, మాయ మార్పునొందుచు, ఒకదానివెంబడి నొకటిగాఁ దన తెరలను విప్పుచు, జీవితగ్రంథమునందలి పుటలను ద్రిప్పుచుఁ జరించుచున్నది. సాక్షీభూతమగు నాత్మయో, నిశ్చలమై, నిర్వికారమై, జ్ఞానసుధను గ్రోలుచుండును. ఇంతవఱకుండిన, ఇప్పుడున్న, ముందుండఁబోవు జీవులన్నియు వర్తమాన కాలముననే యున్నవి—భౌతికోదాహరణముతోఁ జెప్పుచో—అన్నియు నొక బిందువున నిలిచియున్నవి. ఆత్మయందు



దేశసంబంధమగు భావమున కవకాశము లేదు: కావున మన వస్తువులై యిదివఱకుండినవియు నిప్పుడున్నవియు ముందుండఁ బోవునవియు సదా మనవద్దనే యున్నవి, సదా మనవద్దనే యుండినవి, సదా మన వద్దనే యుండఁగలవు. వానియందు మన

మున్నాము, మనయం దవి యున్నవి. ఈ ప్రతిమలోని విభాగములను గైకొని చూడుము. ప్రతివిభాగమును వేర్వేఱు వ్యక్తులై యున్నను నన్నియు 'అఆ' యను నక్షమునఁ గలియుచున్నవిగదా. అచట నవి యన్నియు నేకమగుచున్నవి. ఏ విభాగమును నీ యక్షమును దప్పించుకొని పోఁజాలదు. నైవార యెంత చెడినను నక్షరేఖవద్ద నిలిచినచో, మన మేయుఅలోనైనను బ్రవేశింపఁగలము. ఈ యక్షరేఖయే భగవంతుఁడు. అచట వానితో మన మైక్యమగుచున్నాము; సర్వమును సర్వ మేకీభవించుచున్నది; భగవంతునియం దన్నియు నైక్యమగుచున్నవి.

చంద్రుఁడు చరించుచున్నాఁడను భ్రమను గలుగఁజేయుచు చంద్రబింబముమీఁదుగా మబ్బు చరించుచున్నది. ఇట్లే యాత్మ చరించుచున్నదను భ్రాంతిని గలుగఁజేయుచుఁ బ్రకృతి, శరీరము, చరించుచున్నది...

ప్రతిజీవియు నొక నక్షత్ర మనుకొనుము. అఖండ చిదాకాశమున బ్రహ్మమున — ఈ నక్షత్రములన్నియు భాసించుచున్నవి. సర్వజీవుల యథార్థవ్యక్తిత్వమును నందే నెలకొనియున్నది. మన దిశావలయమును దాఁటి వెడలిన యిట్టి తారలను గొన్నిటి నన్వేషించుటయే ధర్మమునకు, లేదా, పారమార్థికజీవనమునకుఁ బ్రారంభము. మన యునికిని వానియునికిని వానియందుఁ గాంచుటయే తద్గమ్యము, రహస్య మిది మీ నాయన తన పూర్వవేషమును విసర్జించి, యనాదిగాఁ దానెచట నుండెనో యచట నెలకొని

యున్నాఁడు. ఈ లోకమునఁగాని, మఱి యేయితరలోకమునఁగాని యూతఁ డా వేషము మఱలఁ దాల్చునా! ఒకవేళ పూర్ణప్రజ్ఞతోఁ దాల్చినఁ దాల్పవచ్చునేమోకాని లేకున్నచో నట్లు చేయకుండుఁగాతమని మనఃపూర్వకముగా భగవానుని బ్రార్థించుచున్నాను. పూర్వకర్మవశవర్తులై యెవ్వరు నట్లాకర్షింపఁబడకుందురుగాతమనియే నా ప్రార్థన. ఎల్లరును ముక్తులగుదురుగాతమని, యనఁగాఁ దాము ముక్తులమని గ్రహింతురుగాతమని, నా ప్రార్థన. ఒకవేళ మఱల వా రీ (సంసార) స్వప్నమును గందురో, వారి స్వప్నము శాంత్యానందమయమై వెలయుగాతమని ప్రార్థింతము... ఆప్తుఁడు, వివేకానందుఁడు.

6

త్రిగుణాతీతానంద స్వామియను నొక సోదరశిష్యునకు

న్యూయార్క్, 17 1 1895.

ఆయుష్మంతుఁడగు రుద్రాక్షమాలలను కుశాసనములను నాకుఁ బంపితినని...వ్రాసి నాలుగునెలలైనది. కాని వాని టికాణా యింకను దెలియకున్నది...ఏమైన నీ పాశా శమునకు (అమెరికా ఖండమునకు) మీరు బంపు సరకులు విధాయకముగాఁ జేరుననుట సంతసింపఁదగిన సంగతి. సరకు లందినంతనే నీకు వ్రాయుదును. అథమము మూఁడు నెలలైనను నీవు మౌనముదాల్చి యుండవచ్చును!...

పత్రిక ప్రారంభించుటకు నీ కిదియే తరుణము... రమ్మా; నీ కిచటఁ బనియున్నది, ఆ పత్రికను నడపుము.

బలవంతముగానైనను జనులను చందాదారులను జేయుము, భయపడకుము. భీరువులనుండియు నల్పబుద్ధులనుండియు నేమి ఘనకార్యము లాశింపఁగలము? శుద్ధశూన్యము! ఈ సాగరము దాఁటుటకు నీకు వజ్రసన్నిభమైన సంకల్ప ముండవలయును. పర్వతములను బగుల్చునట్టి బలముండవలయును. రాఁబోవు శీతకాలమున నేను వచ్చుచున్నాను. ప్రపంచమునఁ బ్రచండోత్సాహమును బురికొల్పుదము ఇచ్చవచ్చినవారు మనతోఁ జేరి ధన్యులగుదురుగాక, రాని వారిని శాశ్వతముగా వెనుకఁబడియుండనిమ్ము! నడుము కట్టుకొని నీవు సిద్ధముగా నుండుము...భయములేదు! నీ నాల్కపై సరస్వతీదేవి తాండవించును. నీహృదయమున భగవానుఁ డధివసించును. లోకము నాశ్చర్యచకితులను జేయు కార్యములను నీవుచేయఁగలవు. కాని, బాబూ, నీకంత పెద్దపే రెందులకోయి? కొంచెము కుదించుకొనఁ గూడదా? పుస్తకమున నీ పైపునుండి యా పైపునకుఁ బట్టునంత పెద్దపే రెందులకోయి! భగవన్నామము మృత్యువును బాఱఁద్రోలు నందురు. ఊరక "హరి" కాదుకాఁబోలును, ఆనామము! "అఘభగనరకవినాశన", "త్రిపురమదభంజన", "అశేషనిశ్శ్రేమకల్యాణకర" ఇట్టి శ్రావ్యగంభీర నామములు యమధర్మరాజును సకుటుంబసపరివారముగాఁ బలాయనము చేయించును — కాదా? నీపేరు కొంచెము తగ్గించుకొనిన బాగుండదా? కాని యది నలుదిక్కులను వ్యాపించినది కావునఁ దగ్గించుకొనినను నిఁక లాభ ముండదేమో! కాని నామాట నమ్ముము, మృత్యుంజయశీలము, ప్రపంచ

సమ్మోహనమునగు నామము, నీనామము! — నీ ప్రియ సోదరుఁడు, వి.

మఱియొకమాట. వంగదేశమునేగాక, నిజముగా భారతదేశము నంతను మిలమిలలాడింపుఁడు? వివిధప్రదేశములలో కేంద్రములను నెలకొల్పుఁడు.

...ఇంగ్లాండు, అమెరికాదేశములతోఁ బెసరపప్పు, కందిపప్పు మొదలైన వానితో దిగ్విజయముగా వ్యాపారము సాగింపవచ్చునని — బాబుతోఁ జెప్పు. తగుకీలని ప్రవేశపెట్టిన మొదలఁ బప్పుచారిక్కడఁ జక్కఁగాఁ జెలామణీయగును. పచనవిధానమును బైన వ్రాసి, చిన్న చిన్న పొట్లములలో నా పప్పులను సంబారములను నింటింటికి పంపఁజేయుచు, సరకు నిలువఁజేయుట కొరకు 'డిపో' నెలకొల్పినపక్షమున మంచివ్యాపారము సాగును, ఇట్లే వడియములకుఁగూడ మంచి గిరాకి యేర్పడును. మనకుఁ జొరవ తక్కువ. అలసులమై జీవించుటవలన నేమియు సాధింపఁజాలము. ఎవరైనను నొక 'కంపెనీ' యేర్పఱిచి, యిచటకును నింగ్లాండు దేశములోనికిని సరకుల నెగుమతిచేసిన, మంచి వ్యాపారము సాగును. కాని మనవారు సోమరులు...

7

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 23-1-1895.

ప్రేమాస్పద—,... ఆమరణము బద్ధదీక్షితులు, విశ్వసనీయులు — ఇట్టివారే నన్ననుసరింపవలయు నని కోరెదను. జయాపజయములు నాకు గణనీయములు కావు...

నా యుద్యమమును నేను బరిశుద్ధముగా నుంచవలయును, లేకున్నచో నుద్యమమును సాగింపకుండుటయే మేలు — 'కలితీపనులు' నాకుఁ బనికిరావు. . . —మీ వివేకానందుఁడు.

8

న్యూయార్క్, 24-7-1895.

స్నేహాస్పదురాలగు—, . . . నా శక్తిసామర్థ్యముల నన్నిటిని వినియోగించి పనిచేసినాను. అందేమైనను సత్యబీజమున్నయెడల సజీవమై వికాసము నొందితీరును. ఆవిషయమున నాకేమియుఁ జింతలేదు. ఉపన్యాసములన్నను, బోధములనినను నాకు విసుగుపుట్టుచున్నది. ఇంగ్లాండులోఁ గొలఁది నెలలపాటుండి, తరువాత భారతదేశమునకువచ్చి కొన్ని సంవత్సరముల పర్యంతము, లేదా, శాశ్వతముగా దాఁగుకొనియుందును. సోమరిపోతునై యుండలేదని నామట్టునకు నేను సంతుష్టుఁడను. ప్రపంచమంతటను నాతోఁ బర్యటనముచేసిన గమనిక పుస్తకము (Note Book) ఒకటి నావద్ద నున్నది. "ఇఁక నొకమూల చూచుకొని, మరణమును బ్రతీక్షించుచు నుండెదను!" అనుమాట లేడేండ్లక్రితమందు వ్రాయఁబడియున్నవి. ఐన నీకర్మమంతయు మిగిలినది. కర్మానుభవము పూర్తియైనదనుకొందును. ఈ ప్రచారకర్మము నుండియు నీసుకృతబంధములనుండియు భగవంతుఁడు నన్నిఁక విముక్తుని జేయునని యాశపడుచున్నాను.

"ఆత్మ యద్వితీయమని గ్రహించితివా, ఎవరికోసము, ఏకోరిక నిమిత్తము నీవు తాపత్రయపడుట?" లోకసంగ్రహము మొదలైనవన్నియు మాయాప్రభావమున నామనసునఁ బ్రవే

శించినవి — ఇపు డవి వీడుచున్నవి. జ్ఞానసాధనకుఁ జిత్తమును యోగ్యమొనరించుటకంటె చిత్తశుద్ధికంటె—కర్మమునకు మఱియొక ప్రయోజనము లేదని నానాఁటికి నాకు ధ్రువపడుచున్నది. మంచిచెడుగులతోఁగూడిన యీ ప్రపంచము వివిధనామరూపములలో సాగుచునేయుండును. నిరుపద్రవమగు శాశ్వతశాంతికై నామనస్సు తల్లడిల్లుచున్నది.

"నిస్సంగివికమ్ము, నిస్సంగివికమ్ము. నిస్సంగియగు వాని కెవ్వరితోడను దగవుండదు ఎవ్వరిని నాతఁడు బాధింపఁడు. ఎవ్వరివలనను బాధపడఁడు." ఆహా! నాకాషాయము, నాముండితమస్తకము, నాయరణ్యవిహారము, నాభిక్షాచరణమును మఱల నాకెప్పుడు లభించునోకదా! ఎన్నిలోపములుండుఁగాక, భారతదేశ మొక్కటియే యంతఃకరణము, తన దైవమును స్వాతంత్ర్యమును గాంచఁదగు నిలయము. ఈ పాశ్చాత్య వైభవమంతయు వట్టి బూటకము, మనోబంధము. సంసారసారహీనత నింతకంటె విస్పష్టముగా నాజన్మములో నెన్నఁడును గాంచలేదు. ఎల్లరి బంధములను సర్వేశ్వరుఁడు విచ్ఛిన్నము చేయుఁగాక యని — ఎల్లరును మాయావిముక్తులగుదురుగాక యని నిరంతరము ప్రార్థించు

వివేకానందుఁడు.

9

న్యూయార్క్, 1 2 1895.

ప్రియసోదరీ! నీ లేఖ యిప్పుడే యందినది చాల సంతోషము...ఔను, ఫలానుభవమైనను బొందకుండ, "ఇది నా విధ్యుక్త" మను భావముననే కర్మ మాచరింపవలసి

వచ్చుట మన కోర్కెక్కెపుడు సుశిక్షణమగుచుండును...నీ విమర్శలనుజూచి చాల సంతోషించుచున్నాను, చింతించుట లేదు. మొన్న—ఇంటివద్ద ఒక "ప్రెస్‌బిటేరియన్" పెద్ద మనుష్యునితోఁ దీవ్రవాదము చేసినాను, అతఁడు మామూలు గనే పరుషవాక్యము లాడుచు, కోపోద్రిక్తుఁడై దూషింప నారంభించినాఁడు. ఏమైన నిట్టిపనులు నాకార్యవిఘాతము కలుగఁజేయవచ్చునను కారణమున...తరువాత నన్ను గట్టిగా మందలించివది. నీ యభిప్రాయము నట్టిదే యనుకొందును.

సరిగా. నిపుడే నీవు దీనినిగూర్చి వ్రాసినందులకు సంతోషము, ఏమన, దీనినిగూర్చి పర్యాలోచించుచున్నాను. ఈ సంగతు లిట్లు జరిగినందులకు నాకెంతమాత్రము చింత లేదు. నీ కిది విసుగుపుట్టింపవచ్చును — అందు కవకాశము లేకపోలేదు. ఇంపుగా మాటలాడుటయు హృద్యముగాఁ బ్రవర్తించుటయు నైతికోన్నతి కెవ్వారికైనను నెంతమంచిదో నాకు బాగుగాఁ దెలియును...ఇంపితముగా నుండవలయు ననియే నేనును సర్వకార్యములను జేయుదును, కాని యంత రాత్మను జంపుకోవలసిన సందర్భమున నిఁక విరమింతును. వినయమున నాకు నమ్మకములేదు. సమదర్శిత్వమునకు— అంతటిమొదలను సమభావమునకు—నేను దాసుఁడను. తనకు "దేవుఁడు" అగు సమాజమునొక్క యాజ్ఞలను బరిపాలించుట సామాన్యమానవుని విధి, కాని ప్రాజ్ఞులెన్నఁడును నట్లు చేయరు. ఇది శాశ్వతనియమము. సంఘాభిప్రాయము తోడను, బరిస్థితులతోడను సమాధానపడి భోగ్యవిషయ

ముల నన్నిటిని సమాజమువలన నొకఁడు పొందుచుండును, సంఘ మట్టివానికిఁ గల్పతరువు. మఱియొకఁడు స్వతంత్ర జీవియై సంఘమును దనవైపున కాకర్షించుకొనును, సమాధానపడువానికిఁ బూలబాట, పడనివానికి ముండ్లబాట; కాని "లోకాభిప్రాయము" నారాధించువారు క్షణములో నశింతురు, సత్యారాధకులో, శాశ్వతజీవులు.

హరించుటయం దఖండశక్తిగల వస్తువుతో సత్యమును పోల్చును. మెత్తనివస్తువైనయెడల శీఘ్రముగను, నల్లరాతి వంటి కఠినమైనదైనయెడల మెల్లగను ఇట్లది యెచటఁ బడినను నచట భగ్గున మండుచుఁ ద్రోవచేసికొనును, తప్పదు. అది బ్రహ్మాస్త్రాంతే, దానికిఁ దిరుగు లేదు. సోదరీ, ప్రతిశుద్ధాబద్ధముతోడను మోసముతోడను నేను రాజీపడఁ జాలనందులకు, సందర్భానుసార మింపుగాఁ బ్రవర్తింపఁజాల నందులకు, ఎంతో చింతించుచున్నాను. అది నావలనఁ గాదు, ఈ గుణమువలన యావజ్జీవము బాధపడినాను, కాని నావలనఁ గాదు; విశ్వప్రయత్నము చేసినాను, కాని నా వలనఁ గాలేదు. తుట్టతుద కాప్రయత్నము విరమించినాను. సర్వేశ్వరుఁడు నన్నాత్మవంచకుఁడను గానీయఁడు. లోపల నేమున్నదో పైకిరానిమ్ము. అందఱను సంతుష్టులను జేయు మార్గమేదియు నాకుఁ గనఁబడలేదు. స్వభావవిరుద్ధముగా నే నుండఁజాలను, కృత్రిమము నా వలనఁగాదు. "యౌవనము, సౌందర్యమును మాయమగును; జీవనము, సంపదలును నశించును; పేరును బ్రతిష్ఠయుఁ బలాయనమగును, పర్వతములు సైతము ధూళియైపోవును; మైత్రియు

ప్రేమానురాగములను మఱుమాయమగును. సత్యమొక్క-టియే యనశ్వరము. సత్యనారాయణా! నీవే నాప్రాపు, మార్గదర్శకుఁడవును. వయసు చెల్లినవాఁడను, కమ్మని మాటలను దియ్యని నడవడిని నేనిపు డలవఱచుకొనఁజాలను. ఎప్పటియట్లే నన్నుండనిమ్ము. "నిర్భయుఁడవై, ఫలాపేక్షతోఁ బ్రాఁకులాడక, శత్రువులు వచ్చినను మిత్రులు వచ్చినను గూడ లెక్క-సేయక సత్యనిష్ఠుఁడవై, యోసన్న్యాసీ! ఈ క్షణమునుండియు నిహపరములను నిస్సారమగు భోగములను సమస్తము త్యజించివేయుము." సత్యనారాయణా! నీవే నాకు దారి చూపువాఁడవు. సోదరీ, పేరు ప్రతిష్ఠలందుఁగాని, భోగభాగ్యములందుఁగాని నాకు వాంఛలేదు, అవన్నియు నాకు ధూళి. నా (దీననారాయణ) సోదరులకుఁ దోడ్పడఁ గోరినాను. దేవుని ధర్మమాయని ధనార్జనపై ప్రీతి నాకు లేదు. అంతర్వాణి నాలకింపక లోకుల యాటలకును పాటలకును నేనేల తాళము వేయవలయును? దౌర్బల్యముచే, సోదరీ! అనాలోచితముగా మనస్సొక్కొక్కప్పు డైహిక సాహాయ్యము నపేక్షించుచుండును. ఐనను భయములేదు. భయమే మహాపాతకమని నామతము.

"ప్రెస్బిటేరియన్" మతాచార్యునితో గలవాగ్వాదమును దరువాత...దీర్ఘవాదమును "ఏక ఏవ చరేన్నిత్యం"*

---

* శ్లో. ఏక ఏవ చరేన్నిత్యం సిద్ధ్యర్థ మసహాయవాన్,
సిద్ధిమేకస్య సమ్పశ్యన్ న జహాతి న హీయతే.

మనుస్మృతి, 6 42.

(సదా నిస్సంగివై చరింపుము) అని సన్న్యాసికి మనువు చేయు బోధయందలి సత్యమును నాకు ధ్రువపఱచినవి. సమస్త మైత్రియు సమస్త ప్రేమానురాగములును — నన్నియు సంకీర్ణములు మన కావరణమును గల్పించునవి. చెలిమి, ముఖ్యముగా స్త్రీలతోఁ జెలిమి, నిర్బంధించునట్టిది. ఓ మహార్షులారా! మీరు చెప్పిన మాట నిజము! పరుల నాశ్రయించువాఁడు సత్యదేవత నారాధింపఁజాలఁడు. మనసా! శాంతి వహింపుము! నిస్సంగివి కమ్ము, పరమేశ్వరుఁడు నీకండనుండును. జీవనము మిథ్య! మరణము భ్రాంతి! జగత్తు లేదు! బ్రహ్మమే సత్యము! మనసా, భయపడకుము. నిస్సంగివి కమ్ము! సోదరీ, మార్గము దూరము, కాలమో, అల్పము, సాయంసమయ మాసన్నమగుచున్నది, శీఘ్రముగా నేనింటికిఁ బోవలయును. మాటలలో, నడవడిలో, ఇంపును సొంపును నలవఱుచుకొనుటకు నాకు వ్యవధి లేదు. నాసందేశమును దెలుపుటకే నాకు సమయము చాలకున్నది. మీరు యోగ్యులు, ఎంతో దయామయులు; కాని కోపగింపకుఁడు, మీరందఱును కేవలము పసిబిడ్డలు.

మనసా! ఈ స్వప్నమింకఁ జాలును, ఈ స్వప్నమింకఁ జాలును! ఒక్కమాట నాకు లోకమునకుఁ దెలుపవలయు నొక సందేశము గలదు. దానిని లోకమున కింపుగను సొంపుగను నుండునటు లొనరించుటకు నాకు వ్యవధిలేదు. అటులుండుటకుఁ జేయుఁ బ్రతియత్నమును నన్నాత్మవంచకుని జేసివేయును. స్వదేశమగుఁగాక, పరదేశమగుఁగాక — ఈ

మూర్ఖలోకము చెప్పిన దానికెల్ల 'చిత్త' మనుచు, జీవచ్ఛవములవలె జీవించుటకంటె సహస్రపర్యాయములు మరణించుట మేలని భావింతును. నాకొక కార్యము గలదని...ఆమెవలె నీవును దలంచుననుచుఁ బొరపడుచున్నావు. పూర్తిగాఁ బొరపడుచున్నావు—లోకమునఁగాని, లోకమున కష్టాలఁగాని నాకేకార్యమును లేదు. నేఁ దెలుపవలయున దొక సందేశము. దానిని నాపద్ధతిని నేను దెలుపుదును. నా సందేశమును క్రైస్తవీయముగాఁగాని, హైందవీయముగాఁగాని, మఱియే "ఇయము" గాఁగాని యొనర్పను, దానిని 'మదీయముగా' నొనర్తును, అంతే. ముక్తియే నామతము, నాధర్మము; దాని నడ్డగింపఁ జూచున దేది గానిమ్ము, పోరెదను. పాఱెదను, దానిని దొలఁగించుకొందును. ఇస్సీ! మఠాచార్యులను నేను సమాధానపఱుప యత్నించుటయా!! సోదరీ, వేఱు విధముగా భావింపకుము. కాని మీరు బిడ్డలు, పసిబిడ్డలు; శిక్షితులగుటకై బిడ్డలు సమ్మతింపవలయును. "యుక్తిని యుక్తిశూన్యముగా—నశ్వరము ననశ్వరముగా—ఈలోకమును మిథ్యగా—నరుని నారాయణునిగాఁ" జేయు తత్త్వామృతపానమింకను మీరు చేయలేదు. "లోకము" అనెడి యీ యజ్ఞానకూపమునుండి చేతనైనచో, వెలువడుఁడు. అపుడు నిజముగా మీరు ధీరులనియు స్వతంత్రులనియుఁ జెప్పెదను. చేతఁగానిచో, ఈ సంఘమనెడి యీ మిథ్యాదైవమును నేలఁగొట్టి, సాంఘికడంభముపైఁ గాలిడ సాహసించువారిని జూచి సంతోషింపుఁడు, హర్షధ్వను లొనర్పుఁడు; అదియుఁ జేతఁగానిచో నూరకుండుఁడు. ఇది



నా మనవి, అంతియే కాని "సమాధానపఱచుట" యనియు "ఇంపుగాఁ బలుకుట" యనియు సర్థరహిత ప్రసంగములచే, మాయోపదేశములచే, వారిని మఱల రొంపిలోనికి దిగలాగఁ జూడకుఁడు.

పరమదుర్గ్రాహ్యములతో, శ్రీరంగనీతులతో — పెదవులపై మంత్రములతో, హృదయమునఁ దంత్రములతో — మేఁకవన్నె పెబ్బులులతో — పయోముఖ విషకుంభములతో — అన్నిటికంటెను బారమార్థికపుఁ గోమటి బేరములతోఁ — గూడిన యీ ప్రపంచమనిన — ఈ పీడకలయనిన — నాకు రోఁత. ఏమేమి! సాంసారిక దాసానుదాసులు చెప్పుమాట లనుబట్టి నాస్వభావమును నిర్ణయించుటయా! — ఛీ! సోదరీ, నీకు సన్న్యాసితత్త్వమింకను బోధపడలేదు. వేదశిరోభాగమున సన్న్యాసి సుప్రతిష్ఠితుఁడై యుండునని వేదములే చాటుచున్నవి. ఏలన, మతములను సంప్రదాయములను ప్రవర్తకులను గ్రంథములను — ఈయార్భాటమునంతను నాతఁ డతిక్రమించినాఁడు! మిషనరీలుగానిమ్ము, మఱెవ్వరుగానిమ్ము, ఇచ్చవచ్చినట్లఱవనిమ్ము, యావచ్ఛక్తితోడను నన్ను దూఱనిమ్ము: భర్తృహరియుఁ దులసీదాసును జెప్పినరీతిని నేనిట్లు భావింతును,

ఉ. "మాలఁడొ వీఁడు విప్రకులమందుననో మఱి శూద్రుఁడో తప
స్విలుఁడొ సిద్ధుఁడో యనుచుఁ జెంతలఁ జేరి వికల్పజల్పనా
చాల జనంబు లాడఁగ వెసం గుణితాత్ములగారు నమ్రతో
ద్వేలురుగాను మిన్నక భువిన్ విహరింతురు యోగిపుంగవుల్"*

---

* శ్లో. చణ్డాలః కిమయం ద్విజాతిరథవా శూద్రోఽథ కిం తాపసః
కిం వా తత్త్వవివేకపేశలమతి ర్యోగీశ్వరః కోఽపి కిమ్,

"ఏనుఁగు విపణివీథిని బోవుచుండఁ గుక్కలు మొఱుఁగుచుండును, కాని యది లేశమును లక్షింపదు. అట్లే లోకులు తన్ను నిందించుచున్నను సాధువగువాఁడు లేశమును దుర్భావము నొందఁడు."*

* * * *

సదా, సర్వథా, భగవంతుఁడు మిమ్ముందఱ ననుగ్రహించుఁగాక! — ఈ మహా మాయాజాలమునుండి — ఈ సంసారమునుండి విముక్తులను జేయుఁగాక! అనాదియైన యీసంసారమోహిని మఱల మిమ్మాకర్షింపకుండుఁగాక! శంకరుఁడు మీకుఁ దోడ్పడుఁగాక! ఉమాదేవి తత్త్వజ్ఞానమును బ్రసాదించి మీ భ్రాంతులన్నిటిని నాశ మొనరించుఁగాక! ఆప్తుఁడు, ఆశీర్వాదకుఁడు, వివేకానందుఁడు.

## 10

న్యూయార్క్, 9 2 1895.

ప్రేమాస్పద ,... పరమహంసదేవుఁడు నాగురువు, ఆతని గూర్చియు వాని మహాత్త్వమును గూర్చియు నే నెట్లు తలఁతునో లోకమును నటులే యేల తలఁపవలయును?

ఇత్యుత్పన్న వికల్పజల్పముఖరైః శాఖామృగాణాం జనై
ర్న క్రుద్ధాః పథి నైవ తుష్టమనసో యాన్తి స్వయం యోగినః.
భర్తృహరిసుభాషితము, వైరాగ్యశతకము, 97.

హాథీ చలే బజారమే కుత్తా భోంకే హజార,
సాధు కో దుర్భావ నహీ జబ నిందే సంసార.
తులసీదాసు.

ఈ విషయమున మీరు పట్టుదల చూపినపక్షమున సంతయుఁ బాడుచేసినవా రగుదురు. గురుని భగవంతునిగా నర్చించు భావము వంగదేశమువెలుపల నెక్కడను గానరాదు, ఇనను నితరు లీయాశయమును గైకొన సంసిద్ధులై యున్న వారు కారు....

...యోగవాశిష్ఠరామాయణమున కాంగ్లానువాదమును నాకుఁ బంపఁ బ్రయత్నింపుము....

ఇదివఱకు నే నడిగిన పుస్తకములవిషయము— అనఁగా నారదశాండిల్య (భక్తి) సూత్రములనుగూర్చి మఱవకుము.

"ఆశా హి పరమం దుఃఖం, నైరాశ్యం పరమం సుఖమ్ ఆశయే పరమదుఃఖము, నిరాశయే పరమ సుఖము."—ఆప్తుఁడు, వివేకానందుఁడు,

## 11

న్యూయార్క్, 14 2 1896.

స్నేహాస్పదురాలగు—,... మాతృప్రేమతోఁగూడిన నీ హితవాక్యములకు నా మనఃపూర్వకమైన కృతజ్ఞతను గ్రహింపుము.

...తొందర యేమున్నది? భారతదేశము శతాబ్దములతరబడి నూరక వేచియున్నది, చేతివద్ద సిద్ధముగా నున్నపని నెప్పుడును ముందు చేయవలయును—సిద్ధాన్నమును విడువరాదు.

సత్కార్యమునకుఁ గానిమ్ము, ధనము ప్రోగుచేయుట సన్న్యాసికిఁ దగదని మనువు వచించును. ప్రాచీనమహాత్ముల వాక్యములు యథార్థమని, న్యాయ్యమని నాకిపుడు బోధ పడుచున్నది. "ఆశా హి పరమం దుఃఖం, నైరాశ్యం పరమం సుఖమ్—ఆశయే పరమ దుఃఖము, నిరాశయే పరమసుఖము." ఇది చేయవలయు నది చేయవలయు ననెడి యీ బాల్యభావములు నాకుండినవి, ఇపుడివియన్నియు భ్రాంతులవలెఁ దోఁచుచున్నవి, తద్విముక్తుఁడ నగుచున్నాను.

"కోరికలను విడనాడి శాంతి వహింపుము. శత్రుమిత్రరహితుఁడవై నిస్సంగివి కమ్ము. ఈ విధముగా శత్రుమిత్రులను సుఖదుఃఖములను రాగద్వేషములను వీడి, యహింసావ్రతులమై, భగవన్నామ ప్రభావమును చాటుచు నూరూరను సంచరింతముగాక!"

"అధికులవలనఁగాని, యల్పులవలనఁగాని, యూర్ధ్వలోకమునుండికాని, యధోలోకమునుండికాని యేసాయమును నపేక్షింపకుము. నిష్కాముఁడవై, సాక్షీభూతుఁడవై యీ మాయాదృశ్యమును గాంచుచు, దానిని సాగనిమ్ము."

బహుశః ఈ పిచ్చికోరికలు న న్నీదేశమునకుఁ దీసికొనివచ్చుట కావశ్యకమై యుండి యుండవచ్చును. ఐన నీ యనుభవము నొసఁగూర్చినందులకు భగవానునకుఁ గోటి నమస్కారములు.

నాకిపుడు బ్రహ్మానందముగా నున్నది. అన్నమును నపరాలను లేదా, యవలను మేము వండుకొని నెమ్మదిగాఁ

దిందుము. అనంతర మేదియైనను వ్రాయుదును, లేక చదువుదును, లేదా, ఏమైనను నేర్పఁదలఁచివచ్చు పేదలను గలిసికొందును, — ఈ రీతి నిప్పుడిచట (అమెరికాలో, మతి యిచ్చటికంటెను) విశేషముగా సన్న్యాసినై మనుచున్నట్లు తోఁచుచున్నది.

"ఐశ్వర్య మనుభవించుచో, దారిద్ర్యమెక్కడ సంభవించునో యను భయము కలదు, పండితుఁడనుగదా యనుకొనునపుడు ప్రతివాదులవలన భయముకలదు, చక్కఁదనము గలదనుకొనునపుడు ముసలితనము వచ్చునో యను భయము కలదు, యశోవంతుఁడ ననుకొనునపుడు నిందకుల వలన భయము కలదు, విజయమును సాధించితినిగదా యనుకొనునపుడు అసూయాపరులవలన భయము గలదు. అరసి చూచిన, లోకమున సర్వము భయాన్వితమే. వైరాగ్య మొక్కటియే భయరహితము."*...

—నీ ప్రియపుత్రుఁడు, వివేకానందుఁడు.

## 12

న్యూయార్క్, 1895.

స్నేహాస్పద—, ...సంఘసంస్కారము జోలికిఁబోకు. ఏలన మొదట పారమార్థిక సంస్కారము లేనిదే యేసంస్కారమును బనిచేయదు... భగవంతునిగూర్చి బోధింపుము —

* ఇది యీ క్రింది శ్లోకమునకు భావము :

శ్లో. భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయమ్
మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయా భయమ్

జనుల మూఢవిశ్వాసములనుగూర్చిగాని, దోషములనుగూర్చిగాని దూషణభూషణలను జేయకు....అధైర్యపడకు, గురుభక్తి వీడకు, భగవద్భక్తిని వీడకు — నాయనా, ఇవి మూఁడును నీవద్దనున్నంతవఱకు నిన్నెవ్వరును ఏమియుఁ జేయఁజాలరు. ఆత్మబలమున నానాఁటి కభివృద్ధి నొందుచున్నాను. వత్సలారా! ధీరులారా! కృషిచేయుఁడు. మీకు నా యాశీర్వాదములని గ్రహింపుఁడు. — సదా మీ వివేకానందుఁడు.

## 13

6 8 1895.

ప్రేమాస్పద ....ఈ (అమెరికా) దేశీయులు పారమార్థిక విషయములలో ననుభవము గలవారని యెన్నఁడును భావింపకుము. వారి యనుభవ మెంతసేపు ఆర్థికవిషయమున; పారమార్థిక విషయమున ననుభవశీలురు హీనమువ్రలే.

...కార్యక్రమమునఁ బెద్దపెద్ద వ్యూహములు పన్నక, మీ బలమును బరిస్థితులను జూచుకొనుచుఁ జిన్నచిన్న పనులతోడనే ప్రారంభింపుఁడు.

...వత్సలారా! ధీరులారా! ఉద్యమము సాగింపుఁడు. కాలక్రమమున వికాసము నందితీరుదుము.

వలయునది సామరస్యము, శాంతి....నెమ్మదిగా నుద్యమ మభివృద్ధి పొందనిండు. ఒక్కనాఁ డేమహాకార్య

శాస్త్రే వాద భయం గుణే ఖలభయం కాయే కృతాన్తాద్భయమ్
సర్వం వస్తుభయాన్వితం భువినృణాం వైరాగ్య మేవాభయమ్.
భర్తృహరివైరాగ్యశతకము, 81.

మును సాధింపఁజాలము. మనకుఁ బ్రాపగువారిలో నొకఁడగు మైసూరుమహారాజు గతించెను. కానిండు, మనకు సాయపడుటకై సర్వేశ్వరుఁ డితరులను బంపును.

వీలైనచోఁ గొన్ని పుశాసనములను బంపుఁడు. ఆశీర్వచనములు.—సదా మీ వివేకానందుఁడు,

## 14

న్యూయార్క్, 21-3-1895.

స్నేహాస్పదురాలగు——, ...మన మెట్లు ప్రవర్తించినను, అపవాదములను గల్పించు వ్యక్తులు కొందఱుందురు. షికాగోలో నా విషయమున నిట్టి ఘోరకలి నిత్యకృత్యమైపోయినది!...

హిందువులు, క్రైస్తవులు—మొదలైన యీ నామములన్నియు నొండొరులయెడ సోదరభావమునకుఁ బ్రతిబంధకములని నా గురుదేవులు వచించువారు. ముందు వానిని మనము నిర్మూలింపఁ బ్రయత్నింపవలయును. వానియందలి శ్రేయస్కర సామర్థ్యమంతయు నంతరించినది, ఇఁక నవి కేవలము చెఱుగున కాలవాలమగుచున్నవి, తన్మూలమున మనలో నుత్తములుకూడఁ గేవల రాక్షసులవలె వర్తించుచున్నారు. ఏమైనను మనము కష్టపడి పనిచేయవలసియున్నది. చేసిన, విజయము నందితీరుదుము.

ఇందువలననే మన కొక కేంద్రము కావలసియున్నదని ఘోషించుచున్నాను. సంఘస్థాపనమున దోషములుండుఁగాక, కాని సంఘమనునది లేనిదే మన మేకార్యమును

సాధింపఁజాలము. జను లాడినదియాట, పాడినది పాటయు నని యంగీకరించుచుఁ, దోడ్తోడనే మహాకార్యములను సాధింపఁగలిగిన వా రెవ్వరును లేరు—వీరా లేమనుకొని నను నా యభిప్రాయమిది. అంతర్వాణి నాలకించి కృషి చేయుటయే మనవిధి. అది యోగ్యము, న్యాయ్యము నైనచో, మనయనంతరము శతాబ్దముల కగుఁగాక, సమాజము తనయభిప్రాయములను మార్చుకొనితీరును. త్రికరణ శుద్ధిగాఁ బూనుకొని మనము కార్యాంగణమున దిగవలయును. ఒకే యాశయునిమిత్తము సర్వము త్యజింపఁజాలకుండు నంతవఱకు విశ్వాసము మన కెన్నఁటికిని గలుఁగదు, కల్గినను గలుగదు.

మానవకోటికిఁ దోడ్పడఁగోరువారు తమ సుఖ దుఃఖములను జేసప్రతిష్ఠలను సమస్తమైన స్వలాభములను గట్టకట్టి గంగలోఁ గలిపి, తదనంతరము భగవంతు నాశ్రయింపవలయును. మహాత్ములందఱును జెప్పినదియుఁ జేసినదియు నిదియే....

ధనికులనఁబడువారివలన నే ఘనకార్యమైనను లోకములో నింతవఱకెన్నఁడైనను జరిగినదా? హృదయము, మేధస్సు—ఘనకార్యములను సాధించును, విత్తాని సంచులు కావు.

సాయమునకై భగవంతు నర్థింపవలయును—మఱెవ్వరినిగాదు—నా యభిప్రాయము, నా యావజ్జీవితానుభవము నిదియే! ఇదియే విజయ కీలకము; ఈ విషయమున నాతో

మీ రేకీభవింతురని నా నమ్మకము. ...—చిరస్నేహాస్పదుఁడు, కృతజ్ఞుఁడు, మీ వివేకానందుఁడు.

**15**

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 4-4-1895.

స్నేహాస్పద—,...అమెరికానుగూర్చి నీవు సరిగాఁ దెలియవు...బ్రహ్మాండమైన యీ దేశమున జనబాహుళ్యము మత విషయముల నంతగా లెక్క సేయదు.

కేవల దేశభక్తిరూపమునఁ గ్రైస్తవమత మిచట నిలువఁబడియున్నది, అంతకంటె విశేషమేమియు లేదు... వత్సా! ఇపు డిఁక ధైర్యము వీడకుము.

...దౌర్బల్యము తోఁచినపుడెల్ల నీ కేకాక, ఉద్యమమున కంతకును హానికరమని గ్రహింపుము. అఖండ బల విశ్వాసములే విజయప్రదాయకములు.

ఉత్సాహము బూనుము...నీయాదర్శము వీడకుము. ...అన్నిటికంటెను నితరులను నడపుటకును, వీరనుసట్లు, "కట్టిపెత్తనము చేయుటకు"ను ప్రయత్నింపకుము. ఎల్లరకును సేవకుఁడవై యుండుము. నీవు నా యాశీస్సులని గ్రహింపుము.—సదా మీ వి.

**16**

న్యూయార్కు, 11-4-1895.

స్నేహాస్పదురాలగు—,...నా కామె చాలఁ దోడ్పడుచున్నది. ఆమెకు నేనెంతయో కృతజ్ఞుఁడను. ఆమె దయార్ద్రహృదయ, మఱియు నిష్కపటహృదయయుఁనని నా

నమ్మకము. నేను "సరియైనవారి" పరిచయము సంపాదింపవలయునని యూహ యభిప్రాయము. నాకు "కవాటు తెరిచియుతుచేయు గ్రంథమునకు" ఇది మలిహూర్వమో యనుకొందును! భగవంతుఁ డెవ్వరిని నావద్దకుఁ బంపునో వారే "సరియైనవారు"—ఇదియే నా జీవితానుభవము. వారే నాకు సాయముచేయఁగలవారు, చేయువారును. మఱెవ్వరైన నున్నచో, భగవంతుఁడు వారందఱకును దోడ్పడి నన్ను వారి బారిపడకుండఁ గాపాడుఁగాక!

పేదలుండుచోట నివసించుటయు వారికే బోధించుచుండుటయు—నిదంతయుఁ దుదకు నిరర్థకముగాఁ బరిణమించుననియు నిచటికి దొరసాను లెవ్వరు నెన్నఁడును రారనియు నా మిత్రులందఱును దలఁచిరి. . . .ఐనను "సరియైనవారు" ఇచటికి రేయింబవళ్లు వచ్చుచునే యున్నారు.—ఆమెయును వచ్చుచున్నది. పరమేశ్వరా! నిన్ను, నీకటాక్షమును నమ్ముట, అహా! నరున కెంత దుర్లభము! శివా! శివా! సరియైన వారెవరు? కానివారెవరు? తల్లీ! సర్వము అల పరమేశ్వరుఁడే! పులియందు, మేఁకపిల్లయందు, పావనాత్మునియందు నున్నవాఁడు అల పరమేశ్వరుఁడే కదా! మనోవాక్కాయములను వానినే నేను శరణుజొచ్చినాను. కన్నాకై నన్నింతవఱకుఁ గాపాడినవాఁడు, నాచేయిఁబట్టుకొని నడిపించుచున్నవాఁడు, నన్నిపుడు విడిచివేయునా? పరమేశ్వరుని కరుణాకటాక్షమే లేనిచో సాగరమున నీటిబొట్టయిన నుండదే, మహారణ్యమున చిన్నపల్లైన నిలువదే,

కుబేరునియింట పిడికెడన్నమైన దొరకదే! వాఁడు సంకల్పించినచో భిక్షాధికారి లక్షాధికారియగును, ఎడారులు నదీనదప్లావితములై ప్రకాశించును. చీమ చిటుకుమన్నచో, భగవానునకుఁ దెలియును. తల్లీ! ఇవన్నియు వట్టిమాటలనుకొనుచుంటివా? ప్రత్యక్ష జీవితానుభవములు!

"సరియైన విధానము" మొదలైన వీనికన్నిటికిని స్వస్తియగుఁగాక! శివా! సర్వేశ్వరా! నాయొప్పిదమును దప్పిదమును నీవే. చిన్ననాఁటనుండియు నిన్నే నమ్మియున్నాను. సాగరగర్భమునఁ బయనించినను, పర్వతాగ్రముల సంచరించినను, ఎడారులలోఁ దిరుగాడినను, ధ్రువములకడ కరిగినను నీవు నాదండనుండువు. నాప్రాపు నాజీవనజ్యోతి— నాశరణ్యము నామిత్రము నాగురువు నాదైవము నాయంతరాత్మయు నీవే, నీవు నన్నెన్నఁడును, కలనైనను విడువవు, ఇది నానిశ్చయము. ఏకాకినై, కష్టసాగరమున నీదులాడుచు, దుర్బలుఁడనై, యొక్కొక్కతఱి, తండ్రీ, నరుని సాయమునుగూర్చి తలపోయుచుందును. నిన్ను దక్క మఱెవ్వరిని, ఎన్నఁడును, కలనైనను సాయమర్థింపకుందునట్లీదౌర్బల్యమునుండి సదా నన్ను గాపాడుము. ఒకఁడు మఱియొక సజ్జనుని నమ్మియున్నచో, నాతఁడు వానినెన్నఁడును విడనాడఁడు, ఎన్నఁడును మోసపుచ్చఁడు. శివా! శంకరా! ఆజన్మము నీదాసుఁడనని యెఱింగియున్న నీవు నన్ను విడనాడుదువా? పరులచే వంచితుఁడనగుటకై, లేదా, దోసమునఁ గూలఁబడుటకై నీవు నన్ను విడిచిపుత్తువా?

తల్లీ! అల పరమేశ్వరుఁడు విడనాడఁడని నా నిశ్చయము.—నీ పుత్రుఁడు, వివేకానందుఁడు.

**17**

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 11-4-1895.

ఆయుష్మంతుఁడగు —,... "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్" అనునట్లారోగ్యవిషయమున మొదట మీరు జాగరూకులు కావలయును. మీరు త్రాగు నీటిని గాఁచి వడియఁగట్టుకొనుఁడు...మీయన్యోన్య ప్రేమానురాగముల మీఁదనే మీ కార్యసాఫల్య మాధారపడియుండును. ద్వేషము, అసూయ, అహంకారము—ననునివి చెలరేఁగుచున్నంతవఱకే శ్రేయమును గలుగఁజాలదు. పరోక్షముగా నితరులలోపముల నెన్నుట పాపమని గ్రహింపుఁడు. మీరు దానిని విషమువలె విడనాడవలయును. మనస్సున నెన్నేని తోఁచవచ్చును, కాని వానిని వెల్లడింపఁబూనినచోఁ, గ్రమముగా గోరంతలు కొండంతలు చేయుచుందురు. క్షమ చూపిన, సర్వము శాంతించును....విద్యావిషయమున మీరు ప్రత్యేకశ్రద్ధవహింపవలయును. తెలిసినదా! మూర్ఖులను పెక్కుమందిని గుమిగూడఁజేయకుఁడు, యోగ్యులైన వ్యక్తులను నలువురను సమావేశ మొనర్చినను నాకు సంతోషమే.

శ్రీరామకృష్ణుని (వారు) నమ్మినను నమ్మకున్నను, ఎల్లరను ప్రేమసానుభూతులతోఁ జూడుఁడు, ఆదరింపుఁడు. శుష్కవాగ్వాదములకై యెవ్వరైనను మీ వద్దకు వచ్చిన, మర్యాదగా నొత్తిగిలుఁడు....సర్వమత సంప్రదాయస్థుల

మొదలను మీ సానుభూతిని బ్రకటింపవలయును. ప్రధానమైన యీగుణములు మీయందు వ్యక్తమైననాఁడే యఖండశక్తి సామర్థ్యములతోఁ బనిచేయఁగలుగుదురు. ఊరక గురునామమును ఘోషించినఁ బ్రయోజనము లేదు. "మాచేతఁ గాదు, మావలనఁగాదు" అనుచుఁ గూర్చున్నచో నేమియు సాధింపఁజాలరు, ఏమియు గ్రహింపఁజాలరు. ఉత్తమాశయముల నుదాత్తభావములను మనము ప్రకటింపవలసియున్నది. విద్యావంతుల కవి నచ్చును. ఊరక సంకీర్తన సమాజాదులను జేరఁదీసి కూర్చుండుటవలన లాభము లేదు. ఈజన్మదినోత్సవము శ్రీరామకృష్ణుని స్మారకోత్సవమగుటయేకాక, అతని దివ్యాశయములను తీవ్రప్రచారము చేయుటకుఁగాను కేంద్రస్థానీయమగు సమావేశము కాఁగలదు....సర్వము సకాలమునఁ బ్రాప్తించును. ఐనను, నే నొక్కొక్కప్పుడు చిఱ్ఱుమనుచుందును. పురోగమనము, పురోవృద్ధి ఇదియే నాధర్మసూత్రము....ఆప్తుఁడు, వివేకానందుఁడు.

## 18

## ఒక యాంగ్లేయునకు

న్యూయార్క్, 24 4 1895.

...ప్రాచ్యలోకమునఁ గానిమ్ము, పాశ్చాత్యలోకమునఁ గానిమ్ము, ఎచ్చటనైనను మానవస్వభావమునకు బలోన్నతులను బ్రసాదించి... మూఢవిశ్వాసములనుండి జనులను గాపాడఁగలిగినది యద్వైతమత మొక్కటియే

యును విషయమున మీతో నే నేకీభవింతును. పాశ్చాత్య దేశములలో నీతత్త్వ మెంత యావశ్యకమై యున్నదో భారత దేశమునందును నంత, అంతకంటె నెక్కువగాఁ గూడ, ఆవశ్యకమై యున్నది. కాని ఇది బహుకష్టసాధ్యమైనపని. ఏలన, మొదట మనము (జనులకు) అభిరుచి కలుగఁజేసి తరువాత బోధింపవలయును, అప్పుడే యీ మహా (అద్వైత) సౌధమును నిర్మింపఁబూనఁగలుగుదుము.

అఖండనిష్కాపట్యము, పావిత్ర్యము, బ్రహ్మాండమైన ధీశక్తి, సర్వవిజయశీలమగు సంకల్పము—వీనితోఁ బదిమందిని బనిచేయనిండు, ప్రపంచమంతయుఁ బూర్తిగా మాఱిపోవును....సహనసందీపితమగు శీలము, జ్ఞానోపలబ్ధికి వలయు తీవ్రసాధన ఇవియే లోకమున నెన్నఁటికైనను బరిణామమును గల్గించునవి. కొందఱు స్త్రీలను బురుషులను—ఒక చిన్న బృందమును బ్రహ్మ సాక్షాత్కారము నొందుట కీ పద్ధతి ననుసరించి యీసంవత్సరము తరిబీయతు చేయఁదలఁచుచున్నాను. ఇందు నేనెంతవఱకు విజయము నందఁగలనో నాకుఁ దెలియదు. ప్రత్యేకముగాఁ దన సంప్రదాయమునకును దన దేశమునకును గంటె విశేషము మానవకోటికిఁ దోడ్పడఁదలఁచువానికి పశ్చిమఖండమే తగిన కార్యాంగణము. పత్రిక విషయమున మీయభిప్రాయమును బూర్తిగా నే నామోదింతును. కాని యిట్టికార్యనిర్వహణమునకు నాకు వ్యవహారనైపుణ్యమేమియు లేదు. బోధించుట, ప్రచారముచేయుట, ఒక్కొక్కప్పుడు కొంచెము వ్రాయుట

ఇవి నేను చేయఁగలిగిన పనులు. కాని సత్యమున—పరమార్థమున—నా కఖండ విశ్వాసము. తోడ్పాటును నాతోఁ గలిసి పనిచేయువారిని భగవంతుఁడే సమకూర్చును. అకలంకుఁడను, నిష్కపటిని, స్వార్థరహితుఁ డను నై యుండ నిమ్ము, చాలును.

"సత్యమేవ జయతే నానృతమ్, సత్యేన పన్థా వితతో దేవయానః సత్యమే జయించునది, అనృతము కాదు; సత్యముననే దేవయానమార్గము నెలకొనియున్నది."

లోక కల్యాణార్థము స్వార్థము నెవ్వఁడు విడనాడునో అట్టివాఁడు లోకమంతయుఁ దన దేయని కనుఁగొనును...... భగవంతుఁడే సకాలమునఁ ద్రోవఁజూపును.

## 19

న్యూయార్క్ ౹—.

"సత్యమే జయించునది, అసత్యముకాదు. సత్యముననే దేవయానమార్గము (బ్రహ్మమార్గము) నెలకొనియున్నది." అసత్యమనెడి తియ్యని యనుపానమును గొంచెము చేర్చిననేకాని సత్యము పనిచేయఁజాలదనియు శీఘ్రముగా వ్యాప్తిచెందఁజాలదనియుఁ దలఁచువారు పొరపడుచున్నారు. ఒక్కచుక్కవిషము పాల నన్నిటిని పాడు చేయునని క్రమముగా వారు తెలిసికొందురు....నిష్కపటియు సాహసోపేతుఁడు నగువాఁడే సర్వకార్యములను సాధించును. భ్రాంతులనుండియు పిచ్చిభ్రమలనుండియు భగవంతుఁడు సదా నిన్ను గాపాడుఁగాక! నీతోఁ బనిచేయుటకు నేను

సిద్ధముగానున్నాను. మొదట మనకు మనము మిత్రుల మైనచో, సర్వేశ్వరుఁడు వందలకొలఁది మిత్రులను మనకడ కంపును. "ఆత్మైవహ్యాత్మనో బంధుః—తనకుఁ దానే బంధువు." (గీత).

ఐరోపా సాంఘికశక్తికిని, ఆసియా ఆధ్యాత్మికశక్తికిని సదా నిలయమైయున్నవి. ఈశక్తులు రెండును నొండొంటితో నొకప్పు డెక్కువగను మఱియొకప్పుడు తక్కువగను సమ్మేళన మొందుచుండు కథయే జగత్కథ. మానవ చరిత్రలో మెల్లఁగా నూతనాధ్యాయము ప్రారంభమగు చున్నది. ఇందులకు నిదర్శనము లెల్లెడలను గాన్పించుచునే యున్నవి. నూతన కార్యక్రమములు వందలకొలఁది నిర్మాణ మగును, వందలకొలఁది విధ్వంసమగును. అగ్ర్యమైనదేదియో అదియే నిలుచును. సరియైనదియు, శ్రేష్ఠమైనదియుఁ దక్క సర్హ్యమైనది మఱేమి?

20

న్యూయార్క్, 25-4-1895.

స్నేహాస్పదురాలగు—, ... "అయోగ్యుల" నుండి "యోగ్యుల"ను వెలువడఁ జేయుటయే సదా యాచార్యునివిధి....నాయల్పకార్యమును నాయంతట నేనే చేయుట మేలని నాయభిప్రాయము....

...కాని, తల్లీ, నేనొకని మొగమువైపుఁ జూచినంతనే వాని గుణస్వభావము లిట్టివని రామకృష్ణునను గ్రహమున సహజముగా, నించుమించుగా నమోఘముగా, గ్రహింతును....—సదా నీపుత్రుఁడు, వివేకానందుఁడు.

## 21

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 2 5 1895.

ఆయుష్మంతుఁడగు——, కావున నీవు సన్న్యసించుటకు నిశ్చయించుకొన్నావన్న మాట. నీమనోరథమునుగూర్చి నాకు సానుభూతి లేకపోలేదు. స్వార్థత్యాగముకంటె మహత్తరమైన దేదియులేదు. కాని నీమీఁద నిర్భరపడియున్న వారి క్షేమార్థము నీయభీష్టమును త్యజించుట తక్కువత్యాగము కాదనిమాత్రము నీవు గుర్తింపవలసియున్నది. శ్రీ రామకృష్ణుని బోధనల ననుసరించి నిర్మలమైన జీవనము నవలంబించుచు, నీకుటుంబకష్టసుఖములలోఁ బాల్గొనుచుండుము. నీకర్తవ్యమును నీవు నిర్వర్తించి మిగిలినదంతయు భగవంతునకు విడిచి పెట్టుము.

ఒకరికిని మఱియొకరికిని, ఆర్యునకును మ్లేచ్ఛునకును, బ్రాహ్మణునకును, చండాలునకును, తుదకు స్త్రీకిని బురుషునకును నడుమ నెట్టిభేదమును ప్రేమ పాటింపదు. ప్రేమ సమస్తవిశ్వమును స్వీయనిలయముగా నొనరించును. నిజమైన వికాసము మెల్లఁగాఁ గలిగినను, అమోఘమై వెలయును. భారతదీనజనోద్ధరణమనెడి యద్వితీయ కర్తవ్యమునిమిత్తము తమ మనశ్శరీరములను సమర్పింపఁగలుగు యువకులను మేల్కొల్పుటకై నీ యావచ్ఛక్తిని వినియోగింపుము. ఒంటోరులతో వారి నేకీభవింపఁజేయుము. ఈత్యాగాశయమును వారి హృదయమునఁ బురికొల్పుము. భారతదేశసౌభాగ్యము యువకులమీఁదనే యాధారపడియున్నది.

విధేయత నలవఱచుకొనుము, కాని నీ విశ్వాసమును త్యజింపకుము. పెద్దలయెడ విధేయతయనునది లేనిదే కేంద్రీకరణముతో—సంఘీభావముతోఁ—గూడిన యే కార్యమును గొనసాగఁజాలదు. వ్యక్తిగతశక్తుల నేకసూత్రబద్ధ మొనర్చి యిట్లు కేంద్రీకరించిననే కాని యే ఘనకార్యమును సాధింపఁజాలము. కలకత్తా (శ్రీరామకృష్ణ) మఠము ప్రధాన కేంద్రము; తన్నియమములతో నేకీభవించి వాని కనుగుణముగా శాఖాకేంద్రములలోని సభ్యులు వర్తింపవలయును.

అసూయను నహంభావమును విసర్జింపుము. ఇతరులతోఁ గలిసి పనిచేయ నేర్చుకొనుము. మన దేశమునకిది ముఖ్యావశ్యకము. ఆశీర్వాదములు, ఆప్తుఁడు, వివేకానందుఁడు.

22

6-5-1895.

ప్రేమాస్పద—,...హిందువు లందఱును మాకేమని నిద్రపోవుచుండఁగా హిందూమతమును సమర్థించుచు నా శక్తిసామర్థ్యములను నేనేల వ్యర్థము చేసికొనవలయును? ముప్పదికోట్ల జనులు మీరందఱును, ముఖ్యముగాఁ దమ చదువుసంచెలను జూచుకొని త్రుళ్లిపడువారు, అచట నేమి చేయుచున్నారు? బోధప్రచారముల మాట నాకు విడిచి పెట్టి మీరేల సమరములోనికి దిగరాదు? నూతనవ్యక్తుల నమును నేనిచట నహర్నిశము పెనఁగులాడుచున్నానుగదా!... హిందూదేశమేమి సాయము చేయుచున్నది? హిందూజాతి యంతటి దేశభక్తివిహీనమైన జాతిని ప్రపంచమెన్నఁడైనను

గని విని యెఱుఁగునా? ఐరోపా, అమెరికాలలోఁ బ్రచారము చేయుటకుఁగాను విద్యార్థులైన పదిపండ్రెండుగురు యువకులను బంపి, వారినచటఁ బోషింపఁగలిగితిరేని నైతికముగనే కాక, రాజకీయముగఁగూడ భారతదేశమునకు మీరఖండసేవ చేసినవారగుదురు, భారతదేశముపట్ల నైతిక సానుభూతి చూపు ప్రతివ్యక్తియు రాజకీయమిత్రుఁడగును. పాశ్చాత్యులలో ననేకులు మి మ్మర్ధనగ్నులైన యడవిజాతి వారనియు నాగరికతను మీకుఁ దెలిపియుటు చేయవలసి యున్నదనియుఁ దలఁతురు. అది కాదని వారికి మీరేల చూపరాదు?...అతిదూరదేశములో నొక్కఁడేమి చేయఁగలఁడు? నేను చేసినదానికైనను మీ రనర్హులు....

ఇంతవఱకుఁ బశ్చిమదేశములకు వచ్చిన హిందువులు పాశ్చాత్యుల మెప్పుకోసమో, డబ్బుకోసమో, తమ మతమును తమదేశమును పదేపదే దూషించియున్నారు. పేరు ప్రతిష్ఠలను గడించుటకు నేనిచటికి రాలేదన్న సంగతి మీకుఁ దెలియును; అవి నామీఁద వచ్చి పడినవి. హిందూదేశమునకు నేనెందుకు మఱలవలయును? నాకుఁ దోడ్పడు వారెవరు? మతప్రచారము నిమిత్తము సంసారత్యాగము చేయువారు చెన్నపురిలో నేరి? తమదేశమును సమర్థింప సాహసించిన వాఁడను నేనొక్కఁడ నైతిని; ఒక హిందువు వలన వారెన్నఁడును ఆశింపనటువంటి యాశయములను వారికిఁ దెలిపినాను. ఈ దేశమున నాకు మిత్రులైనవారు వేలకొలఁదిమంది కలరు, ఆచరణము నన్ననుసరించువారు

వందలకొలఁదిమంది కలరు; ఏఁటేఁట వారి సంఖ్య వృద్ధి పొందఁగలదు, మఱికొంతకాలముపాటు జీవించి వారితో నేను బనిచేసినపక్షమున నా జీవితాశయములను ధార్మికా దర్శములను గూడ నెఱవేఱఁగలవు. తెలిసినదా!

...కావున వత్సలారా! కృషిచేయుఁడు. ఒక నెల లోపలఁ గొంతధనము పత్రికకోసము పంపఁగలుగుదును. హిందూ (దేశపు) బిచ్చగాండ్రను యాచింప బయలుదేఱకుఁడు. నా బుద్ధితోడను బలమైన యీ కుడిభుజముతోడను ఆ కార్యము స్వయముగా నేనే చేయుదును. ఇచటఁగాని హిందూదేశమునఁగాని మఱెవ్వరి సాయమును నా కక్కఱలేదు....రామకృష్ణుఁ డవతారమూర్తియని నమ్మవలయునని లోకులను నిర్బంధింపకుఁడు.

నేను గనుఁగొనిన విషయము నిపుడు మీకుఁ జెప్పెదను. వేదాంతమున, అనఁగా ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతమునను మతములలోఁ దత్త్వమంతయు నిమిడి యున్నది! ఇవి మూఁడును గ్రమావస్థలు, మానవుని యాత్మవికాసమందలి స్థితులు, ఒక్కొక్కటియు మనకావశ్యకమైయున్నది. ఏ ధర్మమునకైనను నిదియే ప్రధానమగు తత్త్వము. భారతదేశమందలి వివిధ జాతి మతాచారముల ననువర్తించు వేదాంతమే హిందూమతము. ఐరోపాఖండమందలి వివిధజాతుల యాశయములకును భావములకును ననువర్తించు ద్వైతమను ప్రథమావస్థయే క్రైస్తవమతము;

అరబ్బులు మొదలైన వారి కనువర్తించునప్పు డదియే మహమ్మదీయ మతము. యోగానుభవరూపమున నను వర్తింపఁ జేయఁబడిన యద్వైతమే బౌద్ధాదిమతములై వెలసినది. మతమనఁగా వేదాంతమని యభిప్రాయము, వివిధజాతుల, వివిధదేశకాలపరిస్థితుల కనుగుణముగా నను వర్తన విధానము మాఱవలయును. తత్త్వ మొక్కటే యైనను శాక్తేయులు, శైవులు మున్నగు వివిధసంప్రదాయస్థులు దానిని దమతమ ప్రత్యేకసంప్రదాయములకును ఆచారములకును అనురూపముగా నొనర్చుకొనుచుందురు. ఈ మూఁడుసంప్రదాయములను (అనఁగా ద్వైతాద్వైత విశిష్టాద్వైతములను) గూర్చియు వాని వాని యాచారకాండ నటుంచి, యన్యోన్యసమన్వయమును గ్రమముగా జూపుచు మీ పత్రికలో వ్యాసములను గుప్పింపుఁడు. తత్త్వమును బోధించి జనులను దమతమ మార్గములకును సంప్రదాయములకును యథాయోగ్యముగా వర్తింపఁజేసికొననిండు. ఈ విషయమున నేనొక పుస్తకము వ్రాయఁదలఁచియున్నాను. అందుకే భాష్యత్రయము * కావలయునని వ్రాసియున్నాను. కాని యింతవఱకు రామానుజభాష్య మొక్కటియే నా కందినది.

...స్వార్థమును బూర్తిగా విడనాడి దీక్షతోఁ బని చేయుఁడు; మనము ఘనకార్యములను జేయుదుము, భయపడకుఁడు....ఆశీర్వాదములు. సదా మీ వివేకానందుఁడు,

* శంకర రామానుజ మధ్వాచార్యుల భాష్యములు.

23

న్యూయార్కు, 14 5 1895.

స్నేహాస్పద ....లోకమందలి యైశ్వర్యమంతటికంటెను ధీరులగు మానవులే విశేషమైన విలువగలవారు.... అఖండ నైర్మల్యము, అనంత సహనము, అపరిమిత దీక్ష ఇవియే యే యుద్యమమునకైనను విజయ రహస్యము. ఆశీర్వచనములు. సదా మీ వివేకానందుఁడు.

24

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 20 5 1895.

ఆయుష్మంతుఁడగు ....ఒక చిత్రము. మీలో నెవ్వరికైనను జబ్బుచేసినఁ, దనంతఁ దానుగాని, మీలో నెవ్వరైననుగాని యాతని రూపము ననుసంధానించి, స్వస్థుఁడై యున్నాఁడని దృఢముగా భావింపనిండు, శీఘ్రముగా నాతనికి నిమ్మళించును. వ్యాధిగ్రస్తునకుఁ దెలియకున్నను, మీకును వానికిని నడుమ వేలకొలఁది మైళ్ల దూరమున్నను భయము లేదు....

తన పిల్ల పెండ్లి విషయమై — ఆతని కంత చిత్త క్షోభ యెందులకో నాకుఁ దెలియకున్నది....పిల్లకుఁగానిమ్ము, పిల్లవానికిఁగానిమ్ము, పెండ్లియనుమాటయే నా కసహ్యము. ఓయీ, మతిహీనుఁడా! ఎవ్వరికైనను బంధము కల్పించుటకు నేను దోడ్పడవలయుననియా నీయభిప్రాయము ? నా తమ్ముఁడు మ పెండ్లి చేసికొనినయెడల నావలకుఁ ద్రోసి వేయుదును. ఇది నా నిశ్చయము. ... — అప్పుఁడు వివేకానందుఁడు.

## 25

న్యూయార్క్, మే, 1895.

ప్రేమాస్పద—,...అంతయు మన మేలునకే, సంయోగములన్నియుఁ దుదకు వియోగమునకే. అసహాయుఁడనై పనిచేయఁ బూర్తిగా సమర్థుఁడను గాఁగలనని నా యాశయము...నరునిసాయము తగ్గినకొలఁదియు నారాయణుని సాయ మధికమగుచుండును...అన్నపానీయములవలె, ఉచ్ఛ్వాసనిశ్వాసములవలె, తత్త్వబోధనము నాజీవితమున ననివార్యము, అత్యావశ్యకమునైన యంశమైనది.—మీ స్నేహాస్పదుఁడు, వివేకానందుఁడు.

మఱియొకమాట... వంచకులచే లోకమెంత సులభముగా మోసగింపఁబడుచుండునో! మానవ చరిత్రయందు నాగరికత ప్రారంభమైనది మొదలు కొని — పాపము — మానవకోటి యెంతటిమోసము పాలగుచున్నదో!

## 26

పెర్సీ, న్యూహాంప్‌షైర్, 7-6-1895.

స్నేహాస్పద—, నేనింతవఱకుఁ జూచిన యత్యంత మనోహరప్రదేశములలో నిది యొకటి. మహారణ్య పరివృతమైన పర్వతములనడుమ నున్న యొకసరోవరము నూహింపుము,— అందు మే మేకాంతముగానున్నాము! ఆహా! యిది యెంత మనోజ్ఞము! ఎంత ప్రశాంతము! ఎంత విశ్రాంతిదాయకము! పట్టణసంకుల ఘోషనుండి వెలువడి యిచటనున్న నాకిపుడెంత హాయిగా నున్నదో మీ రూహించుకోవచ్చును.

ఇచటి నివాసము నాకు నూతనజీవనప్రదము. ఏకాంతముగా నడవిలోనికి వెడలి గీతను జదువుకొనుచు హాయిగా నున్నాను. ఇటనుండి పదిదినములలో సహస్రద్వీపోద్యానము (Thousand Island Park) నకు వెళ్లెదను. నియమితకాలమున నచట ధ్యానించుచుం గేవల మేకాంతముగా నుండుదును. ఈభావనయే మహోత్సాహకరముగదా!— మీ వి.

27

న్యూయార్క్, 22-6-1895.

స్నేహాస్పద—,... నే నపజయముల కలవడినవాఁడను గాను, ఇచట నేను నాటిన బీజము వృక్షము కానున్నది, ఎఱుఁగుదును,...—విశ్వసనీయుఁడు, వి.

28

1895.

స్నేహాస్పద—,... రామకృష్ణపరమహంస యవతారమూర్తియనియు మఱి యేమేమోయనియు మీరు ప్రచారము చేయనక్కఱలేదు. లోకకల్యాణార్థమాతఁ డావిర్భవించెను — తనపేరు చాటుకొనుటకుఁ గాదు — ఈ సంగతి సదా మీరు జ్ఞప్తిలో నుంచుకొనవలయును. తమగురుని బోధనలను గంగలోఁ గలిపి, శిష్యులు తనపేరు నిలువఁబెట్టుటకై ప్రాఁకులాడుచుందురు. — ఫలితమేమి? — స్వమతదురభిమానాదులు.... నీవు కర్మకలాపమును విడువఁ బ్రయత్నింపుము. అది సన్న్యాసుల కుద్దేశింపఁబడినది కాదు, జ్ఞానోపలబ్ధిపర్యంతమే కర్మాచరణము చెప్పఁబడినది....

స్వమతాభిమానముతోఁగాను — శాఖాసంప్రదాయసృష్టితోఁగాను — కూపస్థమండూకజీవనముతోఁగాను నా కెంతమాత్రమును సంబంధము లేదు. రామకృష్ణపరమహంసదేవుని యుదారాశయములను బోధించుచుఁ దోడ్తోడనే శాఖలను సంప్రదాయములను నెలకొల్పుట యసంభవము.... నాకు బోధపడున దొకేపని. అది లోకహితాచరణము, మిగిలిన దంతయుఁ జెడుగే. అందుచే బుద్ధదేవునికి నేను బాదాక్రాంతుఁడనగుదును.... నేను వేదాంతిని — సచ్చిదానందమయ బ్రహ్మమే నాదైవము. దివ్యమగు నాయంతరాత్మకంటె మఱియొక దేవుఁడు నాకంతగా గోచరింపఁడు. 'అవతారము' అనఁగా బ్రహ్మజ్ఞానము నొందినవ్యక్తి, లేదా, జీవన్ముక్తుఁడని భావము. అవతారములలో విశేషమేమియు నాకుఁ గాన్పింపదు. బ్రహ్మాది స్తంబపర్యంతము కాలక్రమమున జీవన్ముక్తినంది తీరును. ఆస్థితి నొందుటకుఁ గాను ఎల్లరకును దోడ్పడుటయే మనవిధి. ఈ తోడ్పాటే ధర్మము, కర్మము; మిగిలిన దంతయు అధర్మము, దుష్కర్మము,—అనియే నాకుఁ దోఁచుచున్నది. వైదిక తాంత్రికాదులగు నితరకర్మములు ఫలప్రదములు కావచ్చును, కాని వాని నాచరించుట కేవలవ్యర్థమగు కాలయాపన. ఏలందువా, కర్తాచరణగమ్యమగు చిత్తశుద్ధి పరహితాచరణము వలననే ప్రాప్తించును. యజ్ఞయాగాదులవలన భోగములు లభింపవచ్చును, కాని చిత్తశుద్ధి నొందుట యసాధ్యము. ఎల్ల జీవుల యంతరాత్మయందును సర్వము నెలకొనియే యున్నది. ఎవ్వఁడు తాను ముక్తుఁడనని వక్కాణించునో,

నిశ్చయించునో, వాఁడేముక్తుఁడగును. తానుబద్ధుఁడనను కొనువాఁడు బద్ధుఁడుగనే యుండును. మానవుఁడు తా నల్పుఁడవనియు హీనుఁడవనియుఁ దలఁచుట దోషమనియుఁ బాతకమనియు నజ్ఞానమనియు నా యభిప్రాయము. "నాయ మాత్మా బలహీనేన లభ్యః—ఈ యాత్మబలహీనులకు లభ్యముకానేరదు." "అస్తి బ్రహ్మవదసిచే దస్తి భవిష్యతి, నాస్తి బ్రహ్మవదసిచే న్నాస్త్యేవ భవిష్యతి—బ్రహ్మము కలదందువా, అస్తిత్వమే ఫలము, బ్రహ్మము లేదందువా, నాస్తిత్వమే ఫలము." తాను దుర్బలుఁడ ననుకొను చుండువాఁ డెన్నఁటికిని బలవంతుఁడుకానేరఁడు. తాను సింహబలాన్వితుఁడనని భావించువాఁడో, "నిర్గచ్ఛతి జగజ్జాలాత్ పంజరాదివ కేసరీ—పంజరమునుండి కేసరివలె జగజ్జాలము నుండి వెలువడును." మఱియొక విషయమును మీరు గుర్తింపవలయును — రామకృష్ణపరమహంస 'యే నూతన తత్త్వములను బోధింపరాలేదు. ఐనను నాతని యాగమనము పురాతన తత్త్వములను సుప్రకాశిత మొనర్చి యుంచినది. ప్రాచీనభారతీయ ధార్మికవిజ్ఞానమంతయు నాతనియందు రూపుఁదాల్చినదని చెప్పనొప్పును. శాస్త్రతత్త్వము నర యుట కేమి, ప్రాచీన తత్త్వశాస్త్రగమ్యమును విధానమును నంతయు నవగాహన మొనర్చుకొనుటకేమి, యాతని జీవితమే నాకు సాధనభూతమైనది.

...జనులను వంచించుచుఁ, గేవల కుక్షింభరుఁడనై కాలయాపన చేసియుండినచో, నాత్మహత్య చేసికొనియుండెడి

వాఁడను. సోదరమానవులకు బోధింప నసమర్థులమని గ్రహించియు, ఆచార్యవేషమును దాల్చి, జనులను వంచించుచుఁ గుక్షింభరులై జనులేల సంచరింతురో నాకుఁ దెలియకున్నది. అది మహాపాతకము కాదా?...—మీ యాప్తుఁడు, వివేకానందుఁడు.

## 29

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 1-7-1895.

...మిషనరీల ప్రయత్నములను జూచి గగ్గోలు చేయుచు, ఏమియుఁ జేయఁజాలక మీరు గంతులు వేయుచున్నంతసేపు మిమ్ములను జూచి నేను నవ్వుదును—మీరు వట్టి మట్టి బొమ్మలు, అది మీ స్థితి....ఏండ్లు మీరిన యీ యర్భకులకోసము స్వామి యేమి చేయఁగలఁడు!!

నాయనా! మిమ్ముఁ బురుషులను ధీరులను జేయుటకై నేను రావలసియున్నదని నాకుఁ దెలియును. హిందూదేశమున నున్న వారబలలును నపుంసకులును ననుసంగతి నాకుఁ దెలియును. అందుచేఁ జికాకుపడకుము. ఇచటఁ బని చేయుటకు నాకు సాధనసంపద కావలసియున్నది. నే నర్భకుల చేతిలోఁ బడను. నీ వాందోళన పడవక్కఱలేదు. ఏ కొంచెమైనను నీ చేతనైన పని చేయుము. తుదముమొదలు కొని దేవకార్యమునకు నంతయు స్వయముగా నేనే చేసికొనవలసి యున్నది.

...మీరేమి చేయఁగలరో చేసి చూపుఁడు, అపుడు నేను సంతసింతును....నన్నుగూర్చి యేమాత్రుని యుధి

ప్రాయము కోసమును నేను గనిపెట్టుకొనియుండ లేదు. ఓ యర్భకులారా! అఖండసహనము, అఖండధైర్యసాహసములు, అఖండప్రయత్నములు—వీని మూలముననే మహాఫలములు గలుగఁగలవని గ్రహింపుఁడు....

...అకలంకుఁడనై నేను వాని సేవకుఁడనై యున్నంత వఱకు నా శిరోజమునైన నెవ్వఁడును దాఁకఁజాలఁడు....

జనసామాన్యమునిమిత్తము మీరేమైనను గొంత పనిచేయుఁడు. అపుడు వారు మీకుఁ దోడ్పడుదురు. వీరులై వర్తింపుఁడు, మరణ మొక్కసారియే. నా శిష్యులు పిఱికి పందలు కారాదు. మీరందఱును నాకుఁ బ్రేమపాత్రులని గ్రహింపుఁడు.—సదా మీ వి.

## 30

## శ్రీ ఖేత్రీమహారాజునకు వ్రాయఁబడిన లేఖ

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 9-7-1895.

...ప్రతిమహాకార్యమును హేళన, ప్రతిఘటన, అంగీకారము—నను నీ మూఁడుదశలను దాఁటవలసి యుండును. తమ్మధిగమించు వాని యాశయముల నెప్పుడును జను లపార్థము చేసికొందురనుట నిస్సంశయము. కావునఁ బ్రతిఘటనమును హింసయు యథేచ్ఛముగాఁ గలుగనిండు. స్థైర్యము, నైర్మల్యము, అఖండ భగవద్విశ్వాసము—ఇవి నాకుండినఁ జాలును, ఎన్ని యాటంకములు వచ్చినను క్షణములో మటుమాయమగును.

## 31

## ఒక యాంగ్లేయునకు

న్యూయార్క్, 9-8 1895.

...అర్హమగున దేదియో అదియే నిలుచునని చరిత్ర మనకుఁ దెలుపుచున్నది; శీలము గానిచో, సుస్థిరముగా నిలువఁగలుగునది మఱేమి? అద్వైతమే యిఁక మానవకోటియందు సమాలోచనాపరులగువారి మతమై వెలయును ఇది నిస్సంశయము. ఎవ్వరు మహోత్తమశీలసంపన్నులై ప్రకాశింతురో ఎచట నున్నను వారే సర్వమత సంప్రదాయములందును విజయపతాకమును దాల్చువారు.

ఈ విషయమున స్వానుభవమును గొంచెము తెలిపెదను. నా గురుమహాశయుఁడు తనువు చాలించిన పిమ్మట మేము పది పండ్రెండుగురము ఊరును పేరును లేని యువకులము. మేము తలయెత్తినంతనే అణఁచివేయుటకు బలాఢ్యములగు శతసంస్థలు సిద్ధముగా నుండినవి. వాచాలతను వాక్ఛూరతను గాక, పారమార్థిక జీవనము గడపవలయు ననెడి మహావాంఛను, ఆమరణము తత్ప్రయత్నమును రామకృష్ణుఁడు మాకుఁ బ్రసాదించియున్నాఁడు. నేఁడు భారతదేశమంతయు రామకృష్ణుని ప్రతిభాతిశయమును దెలిసికొని పూజించుచున్నది. అతఁడు బోధించిన తత్త్వములు సూర్యకిరణములవలె వ్యాపించుచున్నవి. అతని జన్మదినోత్సవమును జరుపుటకుఁ బదిసంవత్సరముల క్రితము నేను వంద

మందినైనను సమావేశపఱుపఁజాలకుండఁగా నిరు దేఁబదివేల మంది సమావేశమైనారు.

వలయునది జనసంఖ్యకాదు, శక్తి సామర్థ్యములు కావు, ఐశ్వర్యముకాదు, పాండితికాదు, వక్తృత్వము కాదు,—నైర్మల్యము, ప్రత్యక్షాచరణము, ఒక్క-మాటలో-అనుభూతి—ఇదియే వలయునది. ప్రతిదేశమునను సిద్ధాత్ములు—బంధవిముక్తులు, బ్రహ్మానుభవయుక్తులు—సిరి సంపదలనుగాని, యధికారమునుగాని, పేరు ప్రతిష్ఠలను గాని, మఱి దేనినిగాని లక్ష్యింపనివారు పదుగురు ఉండి నింపు,—ప్రపంచము నుఱ్ఱూఁతలూఁగింపఁగలరు.

రహస్యమిది, సమస్తయోగసిద్ధులను బరిత్యజించిన వాఁడు ధర్మమేఘమను స్థితిని బడయునని యోగ జనకుఁడగు పతంజలి వచించును.* అట్టి యోగి భగవంతుని దర్శించును, భగవంతుఁడగును, అట్టిస్థితిని బొందుటకై యితరులకుఁ దోడ్పడును. ఇదియే నేను బోధింపవలయు తత్త్వము. సిద్ధాంతములు కుప్పతిప్పలుగాఁ బ్రకటింపఁబడియున్నవి. కోట్లకొలఁది పుస్తకములు వెలువడియున్నవి. ఆహా! అణుమాత్ర మాచరణముండిన నెంత బాగుండెడిదో కదా!

---

* "ప్రసంఖ్యానేఽప్యకుసీదస్య సర్వథా వివేకఖ్యాతేర్ధర్మమేఘస్సమాధిః—సకల తత్త్వములను జక్కఁగా వివేచించునట్టి జ్ఞానము నొందియును, ఫలాపేక్ష లేక యుండునట్టివాని కట్టి పరిపూర్ణ వివేక ఫలిత మగు ధర్మమేఘమను సమాధి కలుగుచున్నది." పాతంజలయోగ సూత్రములు, 4. 28.

...లోకులు నన్ను ప్రతిఘటించినకొలఁదియు నా సామర్థ్యము వెలువడియున్నది. రాజాధిరాజులు నా వాహనమును లాగిరి, నన్ను బూజించిరి, మఱియు మతాచార్యులును లోకులును సమానముగనే నన్ను దూషించిరి. ఐననేమి? భగవంతుఁడు వారిసంతతిని బ్రోచుఁగాక! వా రందఱును నా యంతరాత్మయే కదా! నా శక్తి సామర్థ్యములు క్రమవికాసము నొందుటకై వారందఱును సాధనభూతులే కదా!

...యావజ్జీవము మనము చేయు కృషివలన నొక్కఁడు—ఒక్కజీవి—సంసారబంధ విముక్తుఁడు కాఁగల్గినచో, మనము మన యుద్యమమును నిర్వహించిన వారమే. హరి, ఓమ్!

...మఱియొకమాట. భారతదేశము నాకుఁ బ్రేమాస్పదమనుటకు సందియము లేదు. కాని నానాఁటికి నాకు విషయము విస్పష్టమగుచున్నది. మనకు భారతదేశమననేమి? ఇంగ్లాం డననేమి? అమెరికా యననేమి? అజ్ఞులచే నరుఁడనఁబడు నారాయణునకు మనము దాసులము. పాదతలమున నీరు వోయువాఁడు పాదపమున కంతకును నీరు వోసినవాఁడే కదా!

సాంఘికముగా ననుఁడు, రాజకీయముగా ననుఁడు, పారమార్థికముగా ననుఁడు — శ్రేయోమార్గ మొక్కటియే — నేనును నా సోదరుఁడును నేకమేయని గ్రహించుటయే యా మార్గము....

పేరు ప్రతిష్ఠలమీఁది వాంఛను, బరులను బరిపాలింప వలయుననెడి కాంక్షను వీడి పనిచేయుదముగాక. కామ క్రోధలోభములను వీడి వర్తింతముగాక. అపుడు తత్త్వము మనకుఁ గరతలామలక మగును!

32

సహస్రద్వీపోద్యానము, ఆగస్టు, 1895.

స్నేహాస్పద—, ...సమస్తజీవులందును మానవుఁడే యుత్తమోత్తముఁడను హైందవాశయము నానాఁటికి నాకు విస్పష్టమగుచున్నది. మహమ్మదీయుల యభిప్రాయము నిదియే. అల్లా దేవతలను ఆదాము మ్రోల మోకరింపుఁ డనెను. ఇబ్లీస్ మోకరింపలేదు, అందుచే నాతఁడు సైతానయ్యెను. ...నరుఁడే నారాయణుఁడు కాఁగలఁడు. దైవత్వము నొందుటకు దేవతలును దిరిగి మానవజన్మమెత్తవలసి యున్నది....—వివేకానందుఁడు.

33

అమెరికా సంయుక్తరాష్ట్రములు, ఆగస్టు, 1895.

...మిషనరీలనుగూర్చి నీవు బాధపడకు. నన్ను బాధ పెట్టకు. గోలచేయుట వారికి సహజము. అన్నము పడిపోవుచుండఁగా నెవరు గోలచేయరు?...ఐనను సర్వదా వారికి శుభము కలుగుఁగావుతమనియే కోరెదను. గురునందును భగవంతునియందును భక్తియు సత్యమున శ్రద్ధయు నున్నంత వఱకు, నాయనా! నిన్నెవ్వరును నేమియుఁ జేయఁజాలరు.... సత్యమే నా దైవము, విశ్వమే నా దేశము. కర్తవ్య మను

దానిని నేను నమ్మను. కర్తవ్యమనునది సంసారుల దుర దృష్టము. సన్న్యాసికిఁ గర్తవ్యమనున దేమికలదు? అది మిథ్య. నేను ముక్తుఁడను. నా బంధములు విచ్ఛిన్నము లైనవి. ఈ శరీర మేమైన నా కేమి?... పేరుప్రతిష్ఠ లనెడి బుద్బుదములను నే నెన్నఁడును గాంక్షించినవాఁడనుగాను. భగవత్పుత్రుఁడనగు నేను లోకమునకుఁ బరమార్థమును బోధింతును.... ఆ పరమార్థమును—దత్త్వార్థమును—నాకుఁ దెలిపిన భగవంతుఁడే నాకుఁ దోడ్పడుటకై ధీరులను సత్త్వ మోత్తములను నా కడ కంపును.... ఆశీర్వాదములు.—సదా మీ వివేకానందుఁడు,

34

ప్యారి, 9-9-1895.

ప్రేమాస్పద——,...మిషనరీల ప్రలాపములను మీ రింతగా గమనించుట నాకాశ్చర్యముగానున్నది.... భారతీయులు నేను సరియగు హైందవాహారమునే తినవలయునని కోరు నెడల వెంటనే యొక వంటవానిని వలయు ధనమును బంపుఁడని వారికిఁ దెలియఁజేయుఁడు. అణుమాత్రమైనను సాయము చేయని యీ యవివేకుల వాచాలతను జూచిన నాకు నవ్వు వచ్చుచున్నది. మఱియు సన్న్యాసికిఁ బ్రధానవ్రతములగు బ్రహ్మచర్య త్యాగముల నెన్నఁడైనను వ్యతిరిక్తముగా వర్తించితి నని మిషనరీలు మీకుఁ జెప్పినయెడల వారు వట్టి 'అబద్ధపు కోరు' లని తెల్పుఁడు....

ఇఁక నా సంగతి వినుఁడు. నే నొకరి యాజ్ఞలకు బద్ధుఁడనుగాను. నా జీవిత మెందుల కుద్దేశింపఁబడినదో

నాకుఁ దెలియును. 'స్వదేశదురభిమానముతో నాకు సంబంధము లేదు. మనఃపూర్వకముగాఁ జెప్పుచున్నాను. నేను భారత దేశమున కెంత చెందుదునో ప్రపంచమునకును నంత చెందుదును....నాచేత నైనంతవఱకు మీకు సాయము చేసినాను. మీకిపుడు కావలసినది స్వయంసాహాయ్యము. ఏ దేశమునకుఁ గాని నామీఁదఁ బ్రత్యేకమైన హక్కు లేదు. ఒక దేశమునకు నేను దాసుఁడనుగాను. విశ్వాసహీనులగు నో నాస్తికులారా! అర్థరహితప్రసంగము లింకఁ జేయఁబోకుఁడు.

కష్టపడి పనిచేసి, దొరకిన ధనమంతయుఁ గలకత్తాకును జెన్నపట్టణమునకును బంపినాను. ఇంతచేసి, యవివేకుల యాజ్ఞలకు బద్ధుఁడనగుటయా! సిగ్గులేదా మీకు? వారికి నేను ఋణపడిన దేమి? వారు నన్ను దూషించిన నేమి, భూషించిన నేమి? నాయనా! నే నసాధారణుఁడను. నీవైనను నా తత్త్వమింకను బోధపడ లేదు. మీ పని మీరు చేయుఁడు, చేతఁగానిచో నూరకుండుఁడు; అంతేకాని యీ యర్థరహిత బోధలతో నన్నూరక "సాధింపఁ" బోకుఁడు. దైవ మానవ రాక్షసశక్తులన్నిటికంటెను మహత్తరమైన శక్తి నాకాధారభూతమై యున్నది. ఇది నా ప్రత్యక్షానుభవము, నాకెవరి సాయము నక్కఱలేదు. యావజ్జీవము నితరులకు నేను సాయముచేయుచున్నాను....తమ దేశమున నావిర్భవించిన మహనీయుని — రామకృష్ణ పరమహంసదేవుని — కార్యమునకుఁ దోడ్పడుటకుఁగాను వారు నాలుగు రూపాయిలను ప్రోగుచేయలేకపోయినారు. పైపెచ్చు తా

మెవని కెట్టివంటి సాయమును జేయలేదో, ఎవఁడు తన కోసమే యావచ్ఛక్తితోడను బాటుపడెనో, అట్టివాని నాక్షేపింపఁజూచుచున్నారు! కృతజ్ఞతయనునది యెట్టిదో యెఱుఁగనిలోక మిట్లుండును!

హిందూసంఘమున 'విద్యార్థుల'ందు మాత్రమే కానవచ్చు స్వజాత్యహంకార పిశాచగ్రస్తులలో, మూఢ విశ్వాసపరులలో, దయావిహీనులలో, వంచకులలో, పిఱికిపందలలో, ఒకఁడనై తుచ్ఛజీవనము చేసి చచ్చుటకు జన్మించినవాఁడ నని భావింపకుఁడు; పిఱికితనమనిన నాకుఁ బరమాసహ్యము. పిఱికిపందలతోఁగాని, రాజకీయ పహార్ఖలిముతోఁగాని నా కెట్టిసంబంధమును లేదు. రాజకీయమున నాకు లేశమును విశ్వాసములేదు. ప్రపంచములో భగవంతుఁడు, పరమార్థము — ఇవియే నా రాజకీయములు, మిగిలిన దంతయుఁ జెత్త... ఆశీర్వాదములు.—
అప్పుఁడు, వి.

35

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

1895.

సోదరా—...కలకత్తాలోనివారుగాని, మద్రాసులోనివారు గాని, హిందువులు, ఒక సభజరిపి, నన్ను దమ ప్రతినిధిగా గుర్తించుచు,—నాయెడఁ జూపిన దయకు అమెరికా జనుల నభినందించుచు—ఒక తీర్మానము చేసియుండిన యెడలఁ బరిస్థితు లెంతో బాగుండెడివి, ఉద్యమము విస్తృం

భించెషిది. కాని యొకసంవత్సరము గడచినను ఎవ్వరును ఏమియుఁ జేయలేదు....

మన దేశమునకు గతిలేదు. స్వతంత్రమైన భావ మొక్కటియు నెవ్వరికిని దట్టదు. ఎంతసేపు ప్రాఁతపుంతలనే త్రొక్కుచు,—రామకృష్ణ పరమహంస యింతవాఁడని అంత వాఁడని, తలయుఁ దోఁకయులేని గాథలను గల్పించుచు, వానినిగూర్చి తమలోఁ దాము తగవులాడుచుఁ, గాలయాపన చేయుచుందురు. రామ! రామ!! జనసామాన్యమునకును మీకును ఏమైనను తారతమ్యముగలదని లోకమునకుఁ జూపుటకుఁగాను మీ రేమైనను జేయరా?—ఎంతసేపు మీ పిచ్చియేనా మీ కానందము!... నేఁడు (పూజామందిరమున) మీ కొకఘంట, రేపు దానిపైన నొక జేగంట, మఱునాఁ డొక చామరము—లేదా, నేఁడొక శయ్య, మఱునాఁడు దాని కోళ్లకు వెండిమలామా—ఇఁక భక్తులకుఁ బరమాన్నమును దిండివంటలును; ఇఁకఁ దలయుఁదోఁకయు లేని వేయి గాథలు—వేయేల, బాహ్యకర్మకలాపము—ఇదియే కాదా మీ కార్యక్రమము! మీ ధోరణి!! దీనికి ఆంగ్లమున Imbecility (బుద్ధిమాంద్యము) అనిపేరు. ఈ విధమైన కుత్త తనపుఁ జేష్టలకంటె మఱేమియుఁ దలకెక్కనివారే Imbeciles (బుద్ధిహీనులు) అనఁబడుదురు. గంట కుడివైపున వాయించవలెనా?—చందనపుబొట్టు నుదుటనే పెట్టవలెనా, మఱెచ్చటనైనను గూడ పెట్టవలెనా—హారతి మూఁడు సార్లీయవలెనా, నాలుగుసార్లీయవలెనా? ఈ విధమైన సమ

స్యలతో నహర్నిశ పెంప రించుచుండుగాఁ గలవరపడు చుండుటకో వారే Wretches (నిర్భాగ్యులు) అనఁబడినవారు. ఈ ధోరణివలననే భాగ్యదేవతకు వెలియై, ప్రతివారిచేతను నీసడించుకొనఁబడుచుఁ, బ్రతివారికిని లోఁకువయై మనము మొట్టికాయలను దన్నులను దినుచున్నాము. పాశ్చాత్యులో, ప్రపంచాధిపతులై యున్నారు.... త్యాగవైరాగ్యములకును సోమరితనమునకును హస్తిమశకాంతరము.

అభ్యుదయము నొందవలయుననిన, మీ కర్మకలాపమును గంగలోఁ గలిపి, సజీవదైవమును, మానవదైవమును ప్రతి మానవరూపుని విశ్వముననే కాక, ప్రతి వ్యక్తియందును వెలయు భగవంతుని ఆరాధింపుఁడు. భగవానుని విశ్వరూపమే యీ ప్రపంచము. తదర్చనమే, లేక సేవనమే కర్మాచరణము, కర్మకలాపములందును ఆచారములందును నిమగ్నులైయుండుట కాదు. అన్నపుఁ బళ్లెరము దేవునిముందు పదినిమిషము లుంచవలయునా, అఱగంట సేపుంచవలయునా యని యాందోళన పడుటయు (కర్మము) కాదు అది మతిభ్రమ; కాశీయందును, బృందావనమునందును దేవాలయపుఁదలుపులు తెఱచునపుడుగాని, మూయునపుడుగాని తదాదిగా నవి దినమంతయు గణగణ మ్రోఁగుటకుఁగాను లక్షలకొలఁది రూప్యములు వ్యయింపఁబడినవి! ఇపుడు దేవునకు అలంకార సమయము, ఇపు డారగింపు సమయము, ఇపుడు మనకుఁ దెలియని మఱేదియో సమయము....ఇఁక నిదియంతయు సజీవ ప్రత్యక్షదైవము తిండిలేక మలమల

మాడుచున్నప్పుడు, చదువులేక 'అలో' లక్ష్మణా! యని విలపించుచున్నప్పుడు! కోటిమానవులకుఁ బ్రాణము మీఁదికి వచ్చినను వారేమియుఁ జేయరు కాని బొంబాయిలోని బనియాలు (వైశ్యులు) నల్లుల యోగక్షేమార్థము ఆసుపత్రులను గట్టించుచున్నారు! ఈ యల్ప విషయము గ్రహింప మీకు బుద్ధిబలము చాలకున్నది—ఇదియే మన దేశమునకు ముప్పు; పిచ్చి సంస్థలు మన దేశమునఁ గుప్పతిప్పలు... ప్రచండదీక్షతో, మహోత్సాహముతో, మీలోఁ గొందఱు నలుదిక్కులకును వెళ్లి మన దేశమున నింతవఱకెవ్వరును నిర్వహింపని యీ విశ్వరూపారాధన ప్రచారమును సాగింపుఁడు, జనులతోఁ దగవులాడకుఁడు, ఎల్లరితోడను మనము మైత్రితో మెలఁగవలయును....

భగవదనుగ్రహమున మీ నోటినుండి లక్షల కొలఁది వేదములును తంత్రములును పురాణములును వెలువడఁ గలవు.... శిష్యపారంపర్య మనునది లేనిదే ఏమియు సాధింపఁ జాలము....

... ఇతరులకు ముక్తిని జేకూర్చుటకుఁగాను నరకమునకైనను సరియే పొమ్ము....

... ఈ క్రింది సంగతులను సదా జ్ఞప్తిలో నుంచుకొనుము :

1. భక్తిని ముక్తిని భోగమును సమస్తము త్యజించి వేసిన సన్న్యాసులము మనము.

2. ఆచండాలము సర్వజనులకును హితమొనర్చుటయే మన వ్రతము. ...

3. లోకకల్యాణార్థము రామకృష్ణ పరమహంస యావిర్భవించెను. ఆతనిని మానవుఁడనుఁడు, భగవంతుఁడనుఁడు, అవతారమనుఁడు—మీమీ పరిజ్ఞానము ననుసరించి, మీ యిష్టానుసార మాతనితత్త్వమును గ్రహింపుఁడు.

రామకృష్ణపరమహంస కంబలి ఘటించువా రా క్షణముననే దివ్యులై వెలయుదురు.

... —అప్పుఁడు, వివేకానందుఁడు.

36

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

1895.

...నాయనా! నీవు ముక్తిని బొందకున్న నేమి? కొలఁది పర్యాయములు నరకమునే యనుభవించిన నేమి? భర్తృహరి చెప్పినమాట యసత్యమా?

శ్లో. మనసి వచసి కాయే పుణ్యపీయూష పూర్ణా
త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయన్తః
పరగుణ పరమాణూన్ పర్వతీకృత్య నిత్యం
నిజహృది వికసన్తః సన్తి సన్తః కియన్తః.

చ. "హృదయవచశ్శరీరముల నెంతయుఁ బుణ్యసుధాప్రపూర్ణులై
ముదము బహూపకారముల మూఁడు జగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణలవంబులు గొండలుసేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తులగు మాన్యులు గొందఱు పొల్తురిద్ధరన్." *

* భర్తృహరి సుభాషితము, నీతి శతకము, 70.

నీకు ముక్తి కలుగకున్న నేమి? (నీవనునది) ఏమి బాల్య ప్రలాపము! అహా! దృఢముగా నిరాకరింపఁగలిగినచోఁ గాలకూటవిషమైనను శక్తిహీనమై పోవునని చెప్పుదురే! "నా కేమియుఁ దెలియదు!" "నేను అధముఁడను!" అనుట యేమి వినయమోయి! అది మిథ్యావైరాగ్యము—నక్క వినయము—అని నేను చెప్పెదను. ...

మనకుఁ గట్టుదిట్టమైన యొక సంఘము కావలసియున్నది. ...పని చేయునపుడు మీరు మద్రాసువారితో సంప్రతింపుఁడు. వారికి మంచి కార్యనైపుణి కలదు.

...ఉచితముగాఁ బంచిపెట్టిన పుస్తకములు జనులు చదువరు. కావున నామకార్థము కొంత వెలపెట్టుఁడు.

హరి సభలను నితర సంస్థలను మెల్లఁగా మనలోఁ గలుపుకొనవలయును....

నీవు నారాయణుఁడవు, నేను నారాయణుఁడను, నరుఁడు నారాయణుఁడు. మానవరూపముననున్న యీ నారాయణుఁడే లోకమున సమస్తము చేయుచున్నాఁడు. నారాయణుఁ డెక్కడో కొండమీఁదఁ గూర్చుండియున్నాఁడా? కావున నడుము కట్టుకొని కార్యరంగమునఁ బ్రవేశింపుము!

...హిందూదేశములోనున్న కొలఁదిమంది బ్రాహ్మణులకు మాత్రమే ధర్మాధికారమఁట! ...(ఇట్టివారి) ఆచారములలో — సాధనలలోఁ — గల తత్త్వార్థము సంగ్రహముగా నిది : "నేను బరిశుద్ధుఁడను, లోకమంతయు

నశుద్ధము!" పరమ నికృష్టమతము, పాషండమతము, ఘోరరాక్షస మతమిది!... ఇఁక వీరు చేయు ఘనకార్యములో!—"వంకాయ బంగాళాదుంపను దాఁకిన పక్షమునఁ బ్రళయము సంభవింపకుండఁ బ్రపంచ మెంతకాలము నిలుచును?" "చేతులను శుద్ధి చేసికొనుటకుఁగాను బంగ్రేండుసార్లు మట్టిపెట్టి తోముకొనని యెడలఁ బితరులు పదునాలుగు తరముల వారా, అధోగతి పాలగువారు, ఇరువదినాలుగు తరముల వారా?"—జనాభాలో నాలుగవ వంతు తిండిలేక పస్తుండియుండగా నీ విధమైన ధర్మసూక్ష్మములను రెండువేల యేండ్లనుండి చర్చించుచున్నారు. ఇందులకు శాస్త్రీయోపపత్తులను గనుఁగొనుచున్నారు. ఎనిమిదేండ్ల పిల్లను ముప్పదియేండ్ల వానికిచ్చి తల్లిదండ్రులు బ్రహ్మానంద పడుచున్నారు. దాని నెవ్వరైనను బ్రతిఘటించిన యెడల, "మా మతము ధ్వంసమై పోవుచున్నది" అని పెద్దగోల! యౌవనమైనను రాకమునుపే తమపిల్లలు తల్లులు కావలయునని యాందోళనపడుచు, నీ వైపరీత్యమునకు శాస్త్రోపపత్తులను జూపఁబోవువారి మతము నేమన వచ్చును? అనేక లేక నీదోషమును మహమ్మదీయాగమనమున కంటఁగట్టుదురు. మహమ్మదీయుల దోషము, మనది కాదు! గృహ్యసూత్రములలో బాలికల వివాహవయస్సును జూడుఁడు.... అతిబాల్యముననే బాలికలకు వివాహము చేయవలెనని యందు వక్కాణింపఁబడినది.... ఇఁక వైదికమైన యశ్వమేధయాగమున నింతకంటె నసభ్యమైన సంగతులు చెప్పఁబడినవి. బ్రాహ్మణములన్నియు వానిని

సూచించును, వ్యాఖ్యానకర్తలందఱును యథార్థమని యంగీకరింతురు. వీనిని మీరెట్లు కాదనఁగలరు?

ఇంతకును నా యభిప్రాయ మేమన, ప్రాచీనకాలమున —ప్రాచీన చరిత్రమున—అనేకమైన మంచి విషయము లుండవచ్చును, ఉండినవి, వానితోఁ బాటు చెడ్డ విషయ ములు నుండినవి. మంచివానిని మనము నిలుపుకొన వలయును. కాని భావిభారతదేశము ప్రాచీనభారతదేశము కంటెను మహత్తరమై వెలయవలయును. శ్రీ రామకృష్ణుఁ డవతరించిన నాఁటినుండియు నవీనభారతదేశవికాసము, సత్యయుగము, ఆరంభమైనది. మీరు తత్ప్రతినిధులు కావలసియున్నారు. ఈ నిశ్చయముతోఁ గృషి చేయుటయే మీ కర్తవ్యము.... నాస్తికుని మనస్సున నేమున్నది?— చెత్త. ఆస్తికులే వీరులు. అద్భుత శక్తిని వారు ప్రకటింపఁ గలరు. ప్రపంచము వారికిఁ బాదాక్రాంతమగును.— "దీనజనసానుభూతి సాహాయ్యములు" : "నరుఁడే నారాయణుఁడు" : — "ఆత్మ స్త్రీ పురుష బ్రాహ్మణ క్షత్రియాదిభేద విరహితము": — "సర్వం విష్ణుమయం జగత్" (భగవంతుఁడు సర్వాంతర్యామి). పరులకుఁ దోడ్పడుటయే మనయందలి దైవాంశము వ్యక్తమగు విధానము....

బ్రాహ్మణునికంటెఁ జండాలునికే విద్య విశేష మావశ్యకము. బ్రాహ్మణపుత్రుని కొకగురుడు గావలసి యున్నచోఁ, జండాల పుత్రునకుఁ బదుగురు కావలసి యున్నారు.... కమ్మరివీధిలో సూదు లమ్మనేల? దరిద్రులు,

దీనులు, అధఃకృతులు, అజ్ఞానులు వీరే మీ కారాధ్యులు కావలయును.

...అస్పృశ్యత మనోజాడ్యము, కావున జాగ్రత! వికాసమే జీవనము, సంకోచమే మరణము. ప్రేమయే జీవన ధర్మము....___మీ సేవకుఁడు, వివేకానందుఁడు.

37

1895.

ఆయుష్మంతుఁడగు సఖుండాపందునకు ... నీ యాశయ మద్భుతమైనది, కాని దాని యొక్క కట్టుపాటునకు వచ్చుశక్తి మన హిందూసంఘమున శుద్ధశూన్యము ఇదియే సర్వానర్థముల కును బుట్టినిల్లు. మన మే విషయమునను ఏకీభవింపము, పైగా సందులకు విముఖులము. కట్టుపాటునకు ముఖ్యవిషయము విధేయత. "తోఁచినచో నేఁడో కొంచెము చేయుదును, తరువాత పని ధ్వంసమైనను సరియే" ఇది మన ధోరణి ఈవిధమైన పనివలన నేమియుఁ బ్రయోజనము లేదు. సహనము, అఖండ కార్యదీక్షయు మనకుఁ గావలసియున్నవి....

...అగ్నికీలలలో దుముకుటకైనను నీవు సిద్ధముగా నుండవలయును అపుడే యేమైనను సాధింపఁ గలుగుదువు ... నీ ప్రియసోదరుఁడు, వివేకానందుఁడు.

38

రీడింగ్, ఇంగ్లాండ్, 4 10 1895.

స్నేహాస్పద—, ...జీవన రహస్యము భోగానుభవము కాదు. అనుభవ మూలమున జ్ఞానార్జనము. ...నీ శ్రేయోభిలాషి, వివేకానందుఁడు.

39

రీడింగ్, ఇంగ్లాండ్, 4 10 1895.

స్నేహాస్పద—, ... నైర్మల్యము, సహనము, కార్యదీక్ష—ఇవియే సమస్తవిఘ్నములను జయించును. మహాకార్యము లెప్పుడును నెమ్మదిగా సాగును. ... అప్పుఁడు, వివేకానందుఁడు.

40

రీడింగ్, ఇంగ్లాండ్, 4 10 1895.

ప్రేమాస్పద , ఇతరులను నేను ప్రేమింతును, కాని శ్రీరామకృష్ణుని శరణు జొచ్చినవానికి రవంత ముల్లు గ్రుచ్చుకొనినదని విని ఘోరపరితాపమును బొందుదును. . . .

నా యభిప్రాయమును దెలిపెదను, దయ యుంచి కోపపడకుము. నీ వాతని వాఁడవై యున్నంతవఱకు నేను నీ దాసుఁడను, తన్మార్గమునుండి లేశముతొలఁగితివా, నీదారి నీది, నాదారి నాది. నాయనా! దేశములోని సమస్త సంప్రదాయములకును నాలో డాపోశనము పట్టినాఁడు. "మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్ ఓ సవ్యసాచీ! (అర్జునా) వీరందఱును నాచేఁ బూర్వమే నిహతులైరి, నీవు నిమిత్త మాత్రుఁడవు కమ్ము." (గీత). నేఁడో, రేపో, అవి మీ సంఘమునకే లయించును. వరుఁడా! విశ్వాసహీనుఁడా! ఆతని కృపచే, "బ్రహ్మాణ్డం గోష్పదాయతే బ్రహ్మాండమంతయు గోష్పద మాత్రమైపోవును సుమీ." గురు

ద్రోహాలు కావు, గురుద్రోహము ప్రాయశ్చిత్తము లేని పాతకము. వేదప్రతిష్ఠలు, సత్కార్యములు, "యజ్జుహోషి, యత్తపస్యసి, యదశ్నాసి," ఇత్యాది. మీ రేమి యజ్ఞములొనర్చినను, ఏమి తపమొనర్చినను, ఏమి భుజించినను సర్వము నాతని చరణోపాంతమున సమర్పింపుఁడు, లోకమున మనకింక నేమి కావలయును! — అతఁడు మన కాశ్రయము నొసఁగినాఁడు, ఇంతకంటె మనకేమి కావలయును! భక్తికి భక్తియే ఫలము ఇంక నేమి కోరఁదగినది! సోదరా! మనలను పెంచి, పోషించి, జ్ఞానవిజ్ఞానముల నొసఁగిన మహానీయునియెడ మన మెవనిని సాక్షాత్ భగవానుఁడని గ్రహించితిమో ఆ పురుషోత్తమునియెడ ద్రోహులము కాఁదగునా!!! ఆ ప్రభుని దయను మఱచితివా! బుద్ధుఁడు, కృష్ణుఁడు, ఏసు వీరి జీవితములు పురాణేతిహాసవిషయములు, వీరు చారిత్రకపురుషులా, కాదా, యను శంకలు వెలువడుచున్నవి; ఇంక శ్రీరామకృష్ణు నౌన్నత్యమును ప్రత్యక్షముగాఁ గాంచిన నీవు ఒక్కొక్కప్పుడు భ్రమించుటయా! ఇస్సీ! నేను చెప్పవలసిన దేమియు లేదు. దేశదేశాంతరములలో, నాస్తికులచే, నిర్దయాత్ములచే, నాతని విగ్రహము పూజింపఁబడుచుండ నీ వపుడపుడు సంశయాత్ముఁడవగుటయా!! నీవంటివారిని వందలకొలఁది, వేలకొలఁదిమంది, నాతఁ డుచ్ఛ్వాసమాత్రమున సృజింపఁగలఁడు. అతని పాదధూళిని శిరమునఁ దాల్పఁగలుగుటచే నీ జన్మము ధన్యమైనది, నీ వంశము ధన్యత చెందినది, నీ దేశము ధన్యమై ప్రకాశించుచున్నది. నేనేమి చెప్పుదును! అతఁడు

మనరక్షకుఁడు    ఇది నా ప్రత్యక్షానుభవము. నాయనా! పిచ్చివాఁడవు గాకున్న, అప్సరసలును లక్షలకొలఁది రూప్యములును నన్ను లేశము నాకర్షింపఁజాలక, తృణప్రాయముగాఁ దోఁచుటకు నా బలమేనా కారణము? లేక నన్ను రక్షించుచున్న యా మహనీయుఁడా, కారణము? అతని యందు విశ్వాసము లేనివాఁడు, అతనియెడ గౌరవము లేనివాఁడు, భ్రష్టుఁడగునని నిష్కర్షగాఁ జెప్పెదను.

...హిందువులకుఁ బ్రపంచజ్ఞానము లేనట్లు తోఁచుచున్నది; ఏపనినైనను జేయుదునని నీవు మాటయిచ్చిన యెడల సరిగాఁ జెప్పిన సమయమునకు నీ వా పనిచేయవలయును, లేకున్న, జనులకు నీ యందలి నమ్మకము చెడిపోవును. ధనాదివ్యవహారవిషయములకు వెంటనే జవాబు చెప్పవలయును. వ్యవహార మెన్నఁటికిని వ్యవహారమే. ...

మీ వివేకానందుఁడు.

## 41

చెల్సీ, 31 10 1895, సాయంకాలము. గం. 5 లు.

ప్రియమిత్రునకు    . . . సాధారణముగా లోకమున కేదియో యొక్క సంప్రదాయమనునది కావలయును. కర్మకాండ మూలమునను ప్రతీకముల మూలమునను రూపకల్పన నొందిన వేదాంతమే సామాన్యముగా మతము లేక ధర్మమని భావింపఁబడుచున్నదని చెప్పనొప్పును.

ఏదియో యొక విధమైన యాచారకాండ నేర్పఱచుట మన కొక సంప్రదాయమనునది యుండుట—అత్యా

వశ్యకము. వీలైనంత శీఘ్రముగా మన యొక యాచార కాండను నిర్ణయింపవలసి యున్నదని నా యభిప్రాయము. ... భాండాగారమునుండి హిమాద్రికోశమును ఉపనిషత్తులను నీవు తీసికొని రాఁగోరెదను. మానవునకు ఆజన్మాంత ముత్కృష్టమగు నొక ధర్మశాస్త్రమును నిర్మింతము. కేవల తత్త్వశాస్త్రమును వేదాంతమును జనుల తలకెక్కవు—— జనుల నవి వశపఱచుకొనఁజాలవు.——అత్యమిత్రుఁడు, ఆశీర్వాదకుఁడు, వివేకానందుఁడు.

**42**

లండన్, 19-11-1895.

ఆయుష్మంతుఁడగు నఖండానందునకు——. . . నాయనా! ఇది

బహువిచిత్రమైన ప్రపంచము —— బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సహితము కామినీ కాంచనములబారి పడకుండ తప్పించుకొనుట దుర్ఘటము. . . , మఠము పేర నెవ్వరిని డబ్బు వసూలు చేయనీయకుము. . . , గృహస్థుఁ డెవఁడైనను మఠము కట్టించుటకను మిషతో నా పేరఁగాని, మన పేరఁగాని ధనము వసూలు చేయుచున్నట్లు వినుట తటస్థించిన, నీవు మొదట చేయవలసినపని వానిని నమ్మకుండుటయు వానితో జోక్యము కల్పించుకొనకుండుటయు నే. . . . భక్తుఁడగు ధర్మకర్తయైనను, యోగ్యుఁడును స్థితిపరుఁడునగు గృహస్థుఁడైనను నిట్టికార్యమును బూనినయెడల, లేక వసూలు చేయఁబడిన సొమ్ము ధర్మకర్తయగు గృహస్థుని యధీనమున నుంచఁబడినయెడల మంచిదే, భయములేదు. . . .

... ఈ దేశమున (ఇంగ్లాండున) నేయుద్యమమైనను సాగవలయుననినం గొంతకాలము పట్టును. కాని John Bull (అనఁగా నాంగ్లేయుఁడు) ఏ పనికైనను బూనుకొనెనా, అది భల్లూకపుఁబట్టే. అమెరికాదేశీయులు చురుకైనవారేగాని వారి యుత్సాహము తాటియాకుమంట....మీ ప్రియ సోదరుఁడు, వివేకానందుఁడు.

43

లండన్, 18-11-1895.

స్నేహాస్పద—,...ఇంగ్లాండులో నా యుద్యమము దివ్యముగా సాగుచున్నది. ఇచటి విజయము నాకే ఆశ్చర్యకరముగా నున్నది. ఆంగ్లేయులు పత్రికలలో గడబిడ చేయరు. కాని శాంతముగాఁ బని సాగింతురు...(పాఠములు మొదలైనవానినిమిత్తము) జనులు గుంపులు గుంపులుగా వచ్చుచుండుటచే వారికిఁ దగు నాసనము లొసఁగుటకు నాకు శక్యముగాకున్నది. కావున దొరసానులును నెల్లరును నేలమీఁదనే కూర్చుందురు. రాఁబోవు వారము నే నమెరికాకు వెళ్లెదనని విని యిచటి జనులు చాల విచారించుచున్నారు. నేను వెళ్లినచో, నిచట నా యుద్యమమునకు హానికలుగునని కొందఱి యభిప్రాయము. కాని నే నట్లు తలంపను. మానవులపై, పరిస్థితులపై, నే నెన్నఁ డాధారపడువాఁడను గాను, పరమేశ్వరుఁడే నా కాధారభూతుఁడు....

...ఆత్మవంచకుఁడవును, బిఱికిపందవును గాకుండ, నెల్లరకును సంతోషకరముగా వర్తింపుము. ... మన దేశీయు

లనునట్లు నాకు మరణించుటకుఁగూడ తీరికలేకున్నది.... ఆత్మవిశ్వాసమునకు గురుభక్తియే మూలము.

... నిజముగా కార్యభారముచే నలసియున్నాను. ఇంత తీవ్రముగాఁ బనిచేసినచో, మఱి యేహిందువైన నీపాటికి మరణించియుండును.... చిరకాల విశ్రాంతి నిమిత్తము భారతదేశము రాఁగోరెదను... ఆప్తుఁడు, ఆశీర్వాదకుఁడు, వివేకానందుఁడు.

**44**

న్యూయార్క్, 20-12-1895.

ప్రేమాస్పద—, ... సూక్తముల ననువదించుటలో భాష్యకారులు తెలుపు విషయములను శ్రద్ధతో గమనింపుము, అంతేకాని ప్రాచ్యభాషాపండితు లనఁబడువారి యభిప్రాయములను పాటింపకుము. మన శాస్త్రములనుగూర్చి వారికి రవంతయుఁ దెలియదు. శుష్కశబ్ద శాస్త్రజ్ఞులు మతధర్మములనుగూర్చియుఁ దత్త్వమునుగూర్చియు గ్రహించుట దుస్తరము.... ఉదాహరణమునకు ఋగ్వేదములోని "ఆనీద వాతమ్" అను మాటలు "అతఁడు శ్వాసింపకుండ జీవించెను" (He lived without breathing) అని యనువదింపఁబడినవి. 'అవాతమ్' అనుదానికి 'అచలితముగా' లేక 'స్పందన రహితముగా' అని మూలార్థము. కల్పారంభమున విశ్వశక్తి, లేక ప్రాణస్థితి యిందు వర్ణితము;—భాష్యకారుల వచనములను గమనింపుము, మన ఋషుల ననుసరించియే కాని, విదేశీ పండితుల ననుసరించి వ్యాఖ్యానింపకుము, వారి కేమి తెలియును?

...మీలో మీరు తగవులాడకుఁడు. అసూయయే మన జాతికి పేరుపురుగు. నీవును పచటి మిత్రులెల్ల రును నాకత్యంత ప్రేమపాత్రులని గ్రహింపుఁడు.— వివేకానందుఁడు.

45

న్యూయార్కు, 29 12 1895.

ప్రియసోదరికి , కామాది ప్రవృత్తుల కున్నతగతి కల్పించుటయే మన ధర్మముకాని వానిని నశింపఁజేయుట కాదు....

...భక్తులను సేవించువాఁడే మహోత్తమ భగవద్భక్తుఁడని మన భగవద్గీత బోధించుచున్నది.... సదా మీ ప్రియసోదరుఁడు, వివేకానందుఁడు.

46

స్నేహాస్పద ,...ఎవ్వరికైనను ధనికులు సాయము చేసియుండిన దేశమేదియో నాకుఁ జెప్పుము! సమస్త దేశములందును ఘన కార్యము లొనర్చినది నడిమి తరగతి జనులే....ఏమియు భయము లేదు! అల జగన్మాత నాకుఁ దోడ్పడుచున్నది!...మీ ప్రియసోదరుఁడు, వివేకానందుఁడు.

మఱియొకమాట.... వంగమాసపత్రికను నెల కొల్పుటనుగూర్చి ప్రస్తావించుచున్నాఁడు. అతనికి నీ చేతనైనంత వఱకుఁదోడ్పడుము....ఏ యుద్యమమునను ఎవ్వరిని నిరుత్సాహపఱుపరాదు. నిరసనమును ఖండనమును విసర్జింపుము.

పరులు సరియైన మార్గమవలంబించుచున్నట్లు తోఁచునంత వఱకు వారికిఁ దోడ్పడుము. పెడదారిని పోవుచున్నట్లు తోఁచెనా, మెల్లఁగా వారి తప్పిదమును వారికిఁ దెలుపుము. పరస్పర ఖండనమండనములే యెల్లరికి మూలము. ఇదియే సంస్థలకు వేరుపురుగు. . . .వి.

## 47

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 1895.

ఆయుష్మంతుఁడగు ,... ఈ లేఖ నీకొక్కనికే యుద్దేశింపఁబడినది. ఈ లేఖయందలి హితబోధలను ప్రతిదినము పఠించి వాని ననుసరింపుమని కోరెదను. . . .

1. మన తాపత్రయము సహజము కాదు. కావున దానిని తొలఁగించుకొనవచ్చునని శాస్త్రములు చెప్పుచున్నవి.

2. జనులు తమలోఁ దాము జాతులను తెగలను నేర్పఱచుకొనుటయే యాధిభౌతిక తాపమునకు మూలమని అనఁగా జన్మముపైఁగాని, సిరిసంపదలపైఁగాని యాధారపడి యుండునట్టి జాతిభేదమే యీ తాపమునకు మూలకారణమని — బుద్ధావతారమున భగవానుఁడు తెల్పి యున్నాఁడు. ఆత్మయందు స్త్రీపురుషవర్ణాశ్రమాది భేదము లేవియు లేవు; బురదను బురద శుభ్రము చేయఁజాలనియట్లు భేదభావముచే నెన్నఁటికిని ఏకీభావము కలుగఁజాలదు.

3. సమస్తపాపములకును దుఃఖములకును అవిద్యయే మూలమనియు నిష్కామకర్మము చిత్తశుద్ధిని జేకూర్చు

ననియుఁ గృష్ణావతారమున భగవంతుఁడు పలికియున్నాఁడు. కాని, "కిం కర్మ కి మకర్మేతి కవయోప్యత్ర మోహితాః ——ఏది కర్మము, ఏది యకర్మమను విషయమునఁ బండితులు సైతము మోహితులగుచున్నారు." (గీత)

4. పారమార్థిక శీలమును బెంపొందించిన దేదియో అదియే కర్మము. ఐహికచింతను బురికొల్పిన దేదియో అదియే అకర్మము (దుష్కర్మము).

5. కావున మానవుని చిత్తవృత్తిని దేశకాలములను ననుసరించి కర్మాకర్మములు నిర్ణయింపఁబడవలయును.

6. యజ్ఞయాగాది కర్మములు పూర్వకాలమునకే కాని యాధునిక కాలమునకుఁ దగవు.

7. రామకృష్ణావతారము సత్యయుగ ప్రారంభము.

8. ఈ యవతారమున నాస్తికభావములు...జ్ఞాన కుఠారముచే నిర్మూలింపఁబడును; నిఖిల ప్రపంచమును ప్రేమమూలమునను భక్తిమూలమునను నేక మొనర్పఁ బడును....రామకృష్ణు నవతారముగా నంగీకరించినను, అంగీకరింపకున్నను నాతని బోధల నవలంబించువా రెవ్వరైనను ధన్యులై వెలయుదురు.

6. ప్రాచీన కాలమునఁగాని, యాధునిక కాలమునఁ గాని వివిధ సంప్రదాయ కర్తలు త్రొక్కినది పెడదారి కాదు. వారు చేసినది మంచిదే, కాని యింకను వారు

విశేషమైన మేలు చేయవలయును. యోగ్యము—యోగ్యతరము—యోగ్యతమము—ఇది మనసూత్రము.

10. ఎల్లరను వారివారి స్థితినుండియే మనము లేవనెత్తవలయును. ఇష్టనిష్ఠనుండి మరల్పక, యెల్లరకును క్రమముగా నుత్తమాశయములను జూపవలయును. నేఁటి సాంఘిక పరిస్థితులు యోగ్యమైనవే, ఐనను వానిని యోగ్యతరముగను యోగ్యతమముగను నొనరింపవలసియున్నది.

11. స్త్రీల స్థితిగతులను జక్కఁజేయనిచో, లోకశ్రేయమున కవకాశము కాన్పింపదు. ఒక్క ఱెక్కతోఁ బక్షి యెగురఁజాలదు.

12. రామకృష్ణావతారమున స్త్రీ గురువుగా స్వీకరింపఁబడుటయు స్త్రీవేషమునను మధురభావమునను నాతఁడు (శ్రీ రామకృష్ణుఁడు) సాధన లొనర్చుటయు స్త్రీ జగన్మాతృస్వరూపిణి యని లోకమున కాతఁడు చాటుటయు — పైని దెల్పిన విషయములనే, ప్రకటించుచున్నవి.

13. కావుననే స్త్రీలకోసము మొట్టమొదట మఠమును స్థాపింపవలయునని నా ప్రయత్నము. గార్గులును మైత్రేయులును వీరిని మించు విశిష్టగుణసంపన్నలును ఈ మఠమునుండి వెలువడవలయును.

14. మోసముచే నే శుభకార్యమును సాధింపఁజాలము. ప్రేమ, సత్యవ్రతము, అఖండ కార్యదీక్ష—వీని

వలననే యుద్యమములు కొనసాగుచుండును. "తత్ కురు పౌరుషమ్." (కావున నీ పౌరుషమును ప్రకటింపుము.)

15. ఎవ్వరితోడను మనము వివాదపడనక్కఱలేదు. మీ సందేశము నొసంగి జనులను వారి యభిప్రాయము నవలంబింపనిండు. "సత్యమేవ జయతే నానృతమ్"— సత్యమే జయించునది, అనృతము కాదు." తదా కిం వివాదేన? (కావున వివాద మెందులకు?)

...కార్యదీక్ష, నఖండనిష్కాపట్యముతోడను సౌజన్యముతోడను మేళవించి వర్తింపుము. ఎల్లరతోడను బొత్తు కలిగియుండుము. అహంభావమును శాక్తికభావములను బూర్తిగా విడనాడుము. వ్యర్థ వాగ్వాదము మహాదోషము.

...N—ఘోషు నన్ను ఏసుక్రీస్తు మొదలగువారితోఁ బోల్చినట్లు తెలియవచ్చుచున్నది. మన దేశములో దానికిఁ దలయూఁపువా రుందురేమోకాని, వానిని (అట్టి యభిప్రాయములను) అచ్చొత్తించి మీ రిచటికిఁ బంపిన, నన్ను వీరు దూషింపవచ్చును! ఒకరి భావస్వాతంత్ర్యముజోలికి మనము పోరాదని నా యభిప్రాయము. అది నే నిచ్చగింపను— నేనేమి 'మిషనరీ'నా?

...ఏ కార్యమైనను, ఉద్యమమైనను ఆరంభించుటకు ముందు శ్రీరామకృష్ణుని ప్రార్థింపుము, నీ కాతఁడు సరియైన మార్గము చూపును....

...నే నీ లోకమున నుండ, శ్రీ రామకృష్ణుఁడు నన్ను నిమిత్తమాత్రుని జేసికొని తన యుద్యమమును

సాగించుచున్నాము. మీా కించు విశ్వాసమున్నంతవఱకు కే కీడును హానియుఁ బొటిల్లునను భయములేదు.

...మనము లోకుల దృక్పథమున నున్నామనియు మన మొనర్చు ప్రతికార్యమును, నుచ్చరించు ప్రతివాక్యమును వారు గమనించుచున్నారనియు జ్ఞప్తిలో నుంచుకొనుఁడు.

...ప్రతిపక్షులను గొట్టుటకుఁ గత్తులును గదాదులును గావలయును, కావున శ్రద్ధతో నాంగ్లమును సంస్కృతమును నేర్చుకొనుము....అలంకారిక శైలి విడిచిపెట్టుమని... చెప్పుము. విదేశీయభాషలో నాలంకారిక శైలిని వ్రాయుట దుర్లభము.

48

ఇంగ్లాండ్, 1895.

స్నేహాస్పద, ...పెద్దమనుష్యులకుఁ దగునట్లు మనవారేల స్వదేశీయ వేషమును ధరింపరాదు! తమ కాలువలుపునకుఁ దోడు (దొరటోపీలతో) ఆ భయంకర వేషమేల! శ్రీరామ రక్ష!. ...

...నిరంతరోపన్యాసములచే నాడీదౌర్బల్యమును దన్మూలమున నిద్రలేమియు నితరబాధలును గలుగుచున్నవి....——ఆప్తుఁడు, వివేకానందుఁడు.

49

రీడింగ్, ఇంగ్లాండ్, 1895.

...'లౌక్యము' మహాదుర్గుణము, దానిని దొలఁగించుకొనుట దుర్లభము....ఇందున, నందునఁ బొందక సగము సన్న్యాసులును సగము గృహస్థులునై యుందు

విచిత్రవ్యక్తులు నా కక్కఱలేదు. "దుర్విమర్శలను జేయు లోకులను క్రిమితుల్యులుగాఁ జూడవలయును!" అని శ్రీ రామకృష్ణుఁడు వచించువాఁడు....మీ మాటలకును చేఁతలకును సంపూర్ణ సామరస్యము ఉండవలయును.... సాంఘికాచారములన్నిటికిని 'దాసోఽహా' వను సనాతన పౌరాణిక హిందువుఁడనా నేను? నే నెన్నఁడును అట్లు నటింపలేను—ఎన్నఁడును అట్లు చెప్పఁకొనను. ఏ పక్షమునకుఁగాని యింపుగానుండు విషయములను మీకు చెప్ప నక్కఱలేదు. ... నాయనా! ప్రతివ్యక్తియు రామకృష్ణ పరమహంస గానేరఁడు!

...ఇంగ్లాండులో ధార్మికోద్యమములు మెల్లఁగాఁ గాని సాగవు. ఇచటి జనులు మొండిపట్టుదలగలవారు, లేదా, నాస్తికులు. ఇందు మొదటి తరగతివారికి మఱల నేదో కొంచెము నామమాత్రమగు ధర్మముండును. వారు "దేశభక్తియే మామతము" అందురు. అంతే.

...ఉపన్యాసముల నిమిత్త మాంగ్లేయులు పైస ఖర్చుపెట్టరు. వీరు నీ మాటలను వినవచ్చినయెడల నీ వదృష్టవంతుఁడ వనుకొనవలసినదే—మన దేశమునను నింతే కదా....దీనికిఁదోడు బ్రహ్మము మొదలగు తత్త్వములను గూర్చి నీవు వారికి బోధింపఁబోయినయెడల, "చిత్తము, సెలవు పుచ్చుకొందుము" అందురు. "ఈతఁ డెవఁడో మఱి యొక Clergyman(మతగురువు) కాఁబోలునురా బాబూ!" అనుకొందురు!...మీ స్నేహాస్పదుఁడు, వివేకానందుఁడు.

50

1895.

...ఉన్నసంగతి యిది: 'మిషనరీ' పండితుల చేతులనుండి యెవరైనను దమ యన్నమును లాగుకొన వలయును. అనఁగాఁ బాండిత్య ప్రకర్షచే వీరిని గద్దించి వ్యవహరింపవలయును. లేనిచో వానిని 'ఉఫ' అని యూఁదివేయుదురు. మీ సాధువు లెట్టివారో, సన్న్యాసు లెట్టివారో, మీ వైరాగ్యమేమో వారికేమియు బోధ పడదు. కాని, వారికి బోధపడున దొకటి కలదు అది పాండిత్యప్రకర్ష, వక్తృత్వవిజృంభణము, తీవ్రకార్యపర త్వము. అన్నిటికంటెను ఎల్లరును రంధ్రాన్వేషణ చేయు చుందురు, శక్తిచేతనో, యుక్తిచేతనో మతాచార్యు లహర్నిశము గద్దింపఁ జూచుచుందురు. తత్త్వప్రచారము చేయుటకై యీ యాటంకములను దొలఁగించుకోవలయును. ఆల జగన్మాత కృపవలన సమస్తము సాధ్యమగును....

...ఉడుకఁబెట్టఁబడి సిద్ధముచేయఁబడిన దానిలో మీరు కాసంత యుప్పు వేయఁజాలని యెడల, సామగ్రి నంతయు సమకూర్చుకొనఁగలరని నే నెట్లు నమ్మఁగలను? మీ విశ్వాసమునుండి చలింపకుఁడు,... సదా మీ వివేకానందుఁడు,

51

1895.

స్నేహాస్పద——,...నేను సన్న్యాసిని, కావున సేవకుఁడ ననుకొందునే కాని యధిపతి ననుకొనను....జనులు

నన్ను ప్రేమించిన సంతోషము, ప్రేమింపకున్నను సంతోషమే.

...నాకెవ్వరైనను జోడ్పడినచో, అది వారి యను గ్రహము, నా 'హక్కు' గాదు, కావున శాశ్వతముగాఁ గృతజ్ఞుఁడనై యుందును....

నేను బిచ్చగాఁడను, నా మిత్రులు పేదలు. పేదలను నేను ప్రేమింతును, పేదతనము నాహ్వానింతును. ఒక్కొక్క ప్పుడు పస్తుండవలసి వచ్చినందులకు నా కానందము.... "సుఖ దుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ, తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి సుఖదుఃఖములను లాభనష్టములను జయాపజయములను సమముగా నెంచి యటుపిమ్మట యుద్ధము చేయఁబూనుము; అట్లుచేయుదువేని పాపమును బొందవు." (గీత)... మీా వివేకానందుఁడు.

...సింహబల సాహసములను గుసుమమార్దవముతో మేళవించి పనిచేయుఁడు....(శ్రీ రామకృష్ణ జన్మోత్సవదిన మున) వేదవేదాంత గ్రంథములకు మంగళహారతు లొసఁగుఁడు....

మీారు క్రిందఁ బరుండుట మానివేయఁగలిగినయెడలఁ జాల బాగుగా నుండును. రోగమునకు మూలకారణము ముతికిగుడ్డలు....

...శ్రీ రామకృష్ణుని నైవేద్యమునకుఁ గొంచెము పాయసాన్నము చాలును; అందే గురుదేవుఁడు ప్రీతి

వహించువాఁడు,...కర్మకలాపములను దగ్గించి గీతనో, ఉప నిషత్తులనో, ఇతర పవిత్రగ్రంథములనో చదువుచుండుఁడు.

...ఊరూరను వాడవాడలందును శ్రీరామకృష్ణుని బోధనలను చాటుఁడు—ఇంతకంటె మహత్తరభాగ్యమేమి కలదు!

...స్త్రీలకును, పురుషులకును, ధనికులకును, నిర్ధనులకును, బండితులకును, పామరులకును, బ్రాహ్మణులకును, చండాలురకును గల భేదమును రూపుమాపుటయే శ్రీ రామకృష్ణ జీవితోద్దేశము. ఆతఁడు శాంతిదూత: హిందువులకును మహమ్మదీయులకును, హిందువులకును క్రైస్తవులకును గల భేదము లిపుడు భూతకాలవిషయములు.

...హిందువులలోఁ గల గొప్పదోషములు రెండు—స్త్రీల నణఁగఁద్రొక్కుట, జాతిభేదాదుల మూలమునఁ బేదలను పీడించుటయును....శ్రీ రామకృష్ణుని పూజను ప్రతిగృహమునను నెలకొల్పనిమ్ము—ఆతనిని పూజించుట కెల్లరకును హక్కుగలదు. భక్తితో నాతని నారాధించువాఁ డెవ్వఁడైనను ధన్యుఁడై తీరును....—ఆప్తుఁడు వివేకానందుఁడు.

52

జనవరి, 1896.

...పత్రికకుఁ జందాదారులు దొరకుట చాలకష్టము, నిజమే. కాని మార్గమిది: పరివ్రాజకులై సంచారము చేయుఁడు; మీ మాతృభాష (వంగభాష) మాటాడువా

దున్న శాస్త్రములం దెల్ల చేతి కందిన వానిని — వా రెవరైనను సరియే — నిర్బంధించి చందాదారులను జేయుఁడు. బలాత్కారమే మార్గము!—డబ్బు ఖర్చు పెట్టవలసివచ్చినయెడల వా రెప్పుడును బిక్కమొగము పెట్టుదురు....

...మీరు 'కలుగఁజేయు కోలాహలము లోకాంతమున మాఱుమ్రోఁగవలయును.... యావచ్ఛక్తితోడను కృషి చేయవలయును!...భయమేమి!...

...చెన్నపురి కొకరిని బొంబాయికి మఱియొకరిని వెళ్లనిండు. లోకము అల్లల్లాడి పోవలయును! అహా! నావంటి రాక్షసు లిద్దఱు ముగ్గురు దొరకినయెడలఁ బ్రపంచము నుఱ్ఱూఁతలూఁగించి వైచియుందును. కాని నేను ప్రస్తుతము నెమ్మదిగా నడువవలసియున్నది. లోకము నామూలముఁ గదల్చివేయుఁడు! ఒకరిని చైనాకును మఱియొకరిని జపానునకును బంపుఁడు! తమ సంసారములతో, అల్పాయుర్దాయములతో, పాపము, గృహస్థు లేమిచేయఁగలరు! శివుని భూతములు, సన్న్యాసులు, "హర! హర! మహాదేవ! శంభో!" యను నినాదములచే భూమ్యాకాశములను గంపింపఁ జేయవలయును,—అప్పుఁడు, వివేకానందుఁడు.

53

న్యూయార్క్, 24-1-1896.

ప్రేమాస్పద—,...హార్బిలింగువంటి శీతలప్రదేశములకు వెళ్లఁగలవా! శైత్యాధిక్యము (నావిషయమునవలెనే)

నీ జీర్ణశక్తిని సరిచేయును. నేతిని సంబారములను బూర్తిగా విసువఁగలవా? నేతికంటె వెన్న దబ్బున జీర్ణమగును....

ఎల్లరియెడలను సమానముగ ప్రేమముంచుట దుర్లభము, కాని యది లేనిదే ముక్తి లేదు. అప్పుఁడు, వివేకానందుఁడు.

54

17 2 1896.

స్నేహాస్పద ....గ్రహింప దుస్తరమగు నద్వైతము కళాసంశోభితమై దైనందిన జీవితమున సజీవమై యొప్పవలయును; దుర్భేద్యమైన పురాణములనుండి సుబోధమగు నైతికసూత్రములు వెలువడవలయును; శీతిగొలుపు యోగసంప్రదాయమునుండి యత్యంత శాస్త్రీయమును ఆచరణయోగ్యమునగు మానసికశాస్త్రము బయల్వెడలవలయును—ఇదియంతయుఁ బసిబాలునకుసైత మవగాహనమగు భాషాస్వరూపము నొందవలయును. ఇదియే నా జీవితోద్యమము. ఇందు నే నెంతవఱకు విజయము సంపఁగలనో పరమాత్మున కెఱుక. కృషి చేయుటకే కాని ఫలమున మన కధికారము లేదు. ఇది కష్టసాధ్యము. నాయనా! కష్టసాధ్యమే! కామకాంచన ఝంఝామారుతముచేఁ జలింపక, స్వీయాదర్శములను వీడక, పరిపూర్ణ త్యాగము, ఆత్మానుభవము ననెడి పరమాశయములను శిష్యులు గ్రహించునంతవఱకు వారికి శిక్షణ గఱపుచు వర్తించుట నిజముగాఁ గష్టసాధ్యమే. ఐనను భగవదనుగ్రహమున నిదివఱకే యిందుఁ జాలవఱకు విజయము నందినాను. క్రైస్తవ

ప్రచారకులును నితరులును నా తత్త్వము నవగాహన చేసి కొనఁజాలనందులకు వారిని నేను నిందింపఁజాలను—కామినీ కాంచనములను లెక్క సేయనివానిని, పాపము, వా రెన్నఁ డును జూచియెఱుఁగరు. ఇది సాధ్యమని మొదట వారు నమ్మఁజాలరైరి; ఎట్లు నమ్ముదురు! బ్రహ్మచర్యమును గూర్చియు నైర్మల్యమును గూర్చియు భారతీయులకున్న యాశయములే పాశ్చాత్యులకును గలవని మీరు భావింప రాదు. వారికి వీని ప్రత్యామ్నాయములు సౌజన్యము, ధైర్యమును....ఇపుడు జనులు నాకడకుఁ దండోపతండ ములుగా వచ్చుచున్నారు. కామక్రోధాదులను నిగ్రహింపఁ గలవారు నిజముగాఁ గలరని పందలకొలఁదిమందికి (పాశ్చాత్యులకు) నమ్మకము కలిగినది; సనాతనధర్మ తత్త్వములయెడ గౌరవభావము వారిలో వృద్ధిపొందు చున్నది. ఓరిమితో వేచియుండువారికి సర్వము సిద్ధిం చును. శాశ్వతముగా మీరు ధన్యులగుదురు గాక!—మీ వివేకానందుఁడు.

55

బోస్టన్, 23-3-1896.

ప్రీతిభాజన—,...ఇచటి నా నూతన సన్న్యాసి బృంద మున నొకరు స్త్రీ.... మిగిలినవారు పురుషులు. ఇంగ్లాండులో మఱికొందఱను సన్న్యాసుల నొనర్చి, నాతోఁ గూడ భారతదేశమునకుఁ దీసికొని వచ్చెదను, హిందువుల కంటె నీ "శ్వేత ముఖములకు" హిందూదేశములో విశేషమైనప్రభావముండును—అంతేగాక వీరు బలవంతులు,

పరాక్రమవంతులు; హిందువులో, మృతప్రాయులు, హిందూదేశమున కెన్నఁటికైనను ఆశాజనకమగునది జనసామాన్యమే. అగ్రవర్ణజులు శారీరకముగను నైతికముగను మృతప్రాయులైయున్నారు....

జనహితమగు శైలియే నావిజయమునకుఁ గారణము బోధకుని ఘనత భాషాసరళతలో నిమిడియుండును....మీరందఱును నాకుఁ బ్రేమపాత్రులనియు మీకు నా యాశీర్వచనము లనియు గ్రహింపుఁడు. వివేకానందుఁడు.

56

అమెరికా సంయుక్తరాష్ట్రములు, 1896.

ప్రేమాస్పద ,...మీరు నడుపుచున్న పత్రిక (బ్రహ్మవాది) శుద్ధపారిభాషిక పదభూయిష్ఠము, జటిలమునై యుండుటచేఁ జందాదారు లెవరును జేరుట లేదు మీరిది గమనింపవలయును. కేవలసాంకేతిక పదములతత్త్వము అతికఠినమై, పంఙ్క్తాదిపడఁజేయు సంస్కృత శబ్దముల తత్త్వము ఇవంతయు సామాన్య పాశ్చాత్యునకుఁ దెలియదు తెలిసికొనుటకాతఁడు తాపత్రయమును బడఁడు.... ప్రత్యేకార్థమున వాడఁబడిన ప్రతిపదమును సంపాదకీయములనుండి తొలఁగింపవలయును, మఱియు భారతదేశమును మాత్రమేకాక, యావత్ప్రపంచమును మీ రుద్దేశించుచున్నారనియు మీరు చెప్పఁదలఁచిన విషయములను గూర్చి లోకులకేమియుఁ దెలియదనియు సదా మీరు గుర్తింపవలయును. జాగ్రత్తగాఁ బ్రతిసంస్కృత శబ్దమును అను

పఠించి విషయమును సాధ్యమైనంతవఱకు సుబోధము చేయుఁడు....——మీ వివేకానందుఁడు.

57

న్యూయార్క్, 14-4-1896.

స్నేహాస్పద—,...నా కొక (పరిచయ) లేఖను గైకొని యీ పెద్దమనుష్యుఁడు బొంబాయినుండి వచ్చి యున్నాఁడు. ఈతఁడొక యంత్రకారుఁడు. ఈ దేశము నందలి యినుప యంత్రాగారములను గాంచి పనిముట్లను జూడవలయునని యాతని యభిప్రాయము....ఈతనిఁగూర్చి నా కేమియుఁ దెలియదు, కాని యాతఁడు పట్టి మోస గాఁడై యుండఁడుగాక, నా దేశీయులలోఁ బరిశ్రమాభివృద్ధికి సంబంధించిన యిట్టి చొరవను బ్రోత్సహించుటయు నభివృద్ధి చేయుటయు నా యభిమతము....దారిఖర్చులకుఁ దగినంత డబ్బితనివద్ద నున్నది....నమస్కారములు.—భవదీయుఁడు, వివేకానందుఁడు.

58

న్యూయార్క్, 14-4-1896.

సహృదయ—,...సంస్కృత వాఙ్మయమున నద్భుతమైన కథలు వెల్లివిరియుచున్నవి. వానిని మరల జనహితము, సుబోధమునగు భాషలో వ్రాయవచ్చును. (మీ పత్రికకు) నాకవకాశము గలిగినపుడెల్ల నీలైనన్ని కథలను వ్రాయు చుందును....అత్యంతసరళభాష నుపయోగింపుఁడు, పత్రిక విజయము నందెడును. కథల మూలమునఁ దత్త్వములను దెలుపుటయే పత్రికకుఁ బ్రధానలక్షణమై యుండవలయును.

దాని నెంత మాత్రము వేదాంతమయము చేయకుఁడు.... ఏకీభావ శక్తి సంఘ నిర్మాణశక్తి—లేకుండుటయే మన దేశమునందలి గొప్పలోపము. విధేయతయే సంఘ నిర్మాణ కీలకము....—అప్పుడు, వివేకానందుఁడు.

## 59

న్యూయార్క్, 14 4 1896.

స్నేహాస్పద ....రంధ్రాన్వేషణము సులభమే, గుణగ్రహణమునకు సాధుశీలము కావలయును ఈ సంగతి మఱవకుఁడు....మీకుఁ గావలసియున్నది సంఘీభావము దానికి విధేయతయుఁ బరిశ్రమ విభాగమును ఆవశ్యకములు.... అప్పుడు, వివేకానందుఁడు.

## 60

రీడింగ్, ఇంగ్లాండు, 27 4 1896.

స్నేహాస్పద ....శాసనబద్ధులమై యుండుట దోషమనుటకు సందియములేదు; ఐనను బరిపక్వము చెందని యారంభావస్థలో శాసనబద్ధులమై—నియమబద్ధులమై యుండు టావశ్యకము మొక్క— చుట్టును గంచె వేయవలయునని గురుదేవుఁడు వచించువాఁడుగదా....

...మీలో నెవ్వరును వామాచార సాధనలకుఁ దగరు....వామాచారము మేలైనను మనమున నెత్తరాదు. దుష్టవామాచారమును శ్రీరామకృష్ణ సంఘమునఁ బ్రవేశ పెట్టఁ జూచువారెవ్వఁ డిహాపర భ్రష్టుఁడగును!

* * *

...వీరిలో నెవ్వఁడైనను, ఎంతటి వాఁడైనను, దుర్మార్గ మవలంబించిన పక్షమున వెంటనే వానిని (మఠము నుండి) వెడలఁగొట్టుఁడు...మిథ్యాచారులు—వంచకులు—మన కక్కఱలేదు. కావలసినంత మంది యోగ్యులను భగవంతుఁడే కైకొనివచ్చును.

* * *

...పరమహంసదేవుఁడు శీలమునఁ బూర్వావతార మూర్తులందఱికంటెను మిన్న. బోధన విషయమునఁ బూర్వులందఱిబోధలకంటెను నాతనిబోధలు విశేషముగా స్వతంత్రములు, ఉపజ్ఞావిలసితములు, ఉదారములు, విశ్వాస సమన్వితములు; పూర్వాచార్యుల భావములు పాక్షికములై యుండ, యోగ జ్ఞాన కర్మ భక్తి మార్గములందలి యుత్తమ తత్త్వములు నూతన సమాజమును నిర్మించునటుల నేఁడొండొంటితో సమ్మేళన మొందింపఁబడవలయునని యీ యాచార్య శేఖరుఁడు—అవతారమూర్తి—మన కుపదేశించుచున్నాఁడు...పూర్వ సంప్రదాయములు మంచివే, కాని యోగ·జ్ఞాన కర్మభక్తి సమ్మేళనము—స్త్రీ పురుషాది భేదములను పాటింపక, యాచండాలము భక్తిజ్ఞానముల నందఁజేయు ధర్మవ్యాపనము—వర్తమానయుగ నవీన ధర్మము. పూర్వావతారపురుషులు తెల్పిన విషయములు యోగ్యములే, కాని యన్నియు రామకృష్ణుని వ్యక్తిత్వమున సమ్మేళన మొందినవి. సాధారణుఁడగు సాధకున కిట్టివిష యత్యావశ్యకము. అనఁగా మహాపురుషుల నెల్లరను

ఆచార్యుల నెల్లరను ఉచితరీతిని బూజింపవలసియున్నను రామకృష్ణునకు మాత్రము నేఁ డెల్లరును బాదాక్రాంతులు గావలసియున్నదని జనులకు బోధింపుఁడు. నిష్ఠయనునది లేనిచే పటుత్వము ఉండఁజాలదు. అది లేనిచే హనుమంతుని దీక్షవంటి దీక్షతో నెవ్వఁడును బ్రచారము చేయఁజాలఁడు. నూతన దైవముతో, నూతన ధర్మముతో, నూతన వేదములతో నొప్పు నవీన భారత వర్షము నేఁడు మనకు లభ్యమైనది. ఎంతసేపు పురాతన విషయములను బట్టుకొనియే, ప్రాఁత పుంతలను బట్టుకొనియే, ప్రాఁకులాడుచుండు ఛాందసమునుండి, పరమేశ్వరా! మాదేశ మెప్పుడు విముక్తి నొందునోగదా! ఏమైనను గొంచెము స్వమతాభిమానమును అవసరమే, కాని యితరులయం దెన్నఁడును ద్వేషభావమును వహింపరాదు.... -

...ఎవ్వఁ డనంత ప్రేమమూర్తియో, న్యూనతాధిక్యము లనునవి పాటింపక, యెవ్వఁ డెల్లరను సమానముగాఁ బ్రేమించునో, వానికి లోకమంతయుఁ బాదసేవ యొనర్చును.—వివేకానందుఁడు.

61

లండన్, మే, 1896.

ప్రియసోదరికి—...నూతన విషయములను జూడ నే నభిలషింతును,...ఇపుడు హిందూదేశమునకు వెడలి, స్వమత దురభిమాన సంకుచిత భావపూరితమైన యాఘోర కళేబరమునుండి యొక నవీన సంస్థను,—సరళము, బలీయము,

ప్రథమోదిత శిశువులీల నవ్యనూతనము—నగు నొక సంపూర్ణ నవీనసంస్థను—నిర్మించుటకుఁగాను నేనేమి చేయఁగలనో చూడఁబోవుచున్నాను....దాపున దివ్యగంగానదీ తోయములు లభించుచుండ, బాహాపిపాసితులకు మురుగునీటి నీయనేల? అది కేవలము స్వార్థపరత్వము....సదా మీ యాప్తుఁడు, వివేకానందుఁడు.

62

లండన్, 5-6-1896.

ప్రేమాస్పద—,...నా తండ్రి ప్లీడరైనను నాకుఁ బ్రేమాస్పదుఁడగు వాఁ డెవ్వఁడును బ్లీడరగుటకు నేను సమ్మతింపను: నాగురుదేవుఁడును సమ్మతించువాఁడు కాఁడు.... మనదేశము ప్లీడరులపుట్ట, విశ్వవిద్యాలయములు వీరిని వందలకొలఁదిమందిని దయారు చేయుచున్నవి. ధైర్య సాహసములును (భౌతిక) శాస్త్ర ప్రతిభయు దేశమున కిపు డావశ్యకమై యున్నవి....విద్యుద్యంత్రకారకుఁడు (Electrical Engineer) హిందూదేశములో జీవనోపాధి సంపాదించుకోఁగలఁడు....అప్తుఁడు, వివేకానందుఁడు.

63

లండన్, 8-6-1896.

స్నేహాస్పదురాలగు నోబుల్ కన్యామతల్లికి *—సంగ్రహముగాఁ జెప్పినచో—మానవులకు వారి దైవత్వమును

---

* సోదరి నివేదిత.

గూర్చి చాటుచు, జీవితమున ననుక్షణమును దానిని వ్యక్తీకరించు విధానమును బోధించుటయే నా యాదర్శము.

లోకము మూఢవిశ్వాస బద్ధమై యున్నది. హింసితులను అంతకంటె విశేషముగా హింసకులను జూచి నేను జాలిపడుదును.

అజ్ఞానమే దుఃఖహేతువని నాకు విస్పష్టముగాఁ గాన్పించుచున్నది. ... మహాధీరులు, మహావీరులు, ఉత్తమోత్తములు నగువారు బహుజనహితార్థము, బహుజన సుఖార్థము, స్వార్థత్యాగము చేయవలసి యుందురు. చిరంతన ప్రేమసానుభూతులతోఁ గూడిన వందలకొలఁదిమంది (గౌతమ) బుద్ధు లావశ్యకమైయున్నారు.

లోకమందలి మతధర్మములు ప్రాణవిరహితమై పరిహాసాస్పదమై యున్నవి. లోకమునకుఁ గావలసినది శీలము, స్వార్థరహితులై, యుజ్జ్వల ప్రేమపూరితులగు వ్యక్తులు లోకమునకుఁ గావలసియున్నారు. ఇట్టి ప్రేమతోఁగూడిన ప్రతిపదమును వజ్రాయుధము.

నమ్ముము, నామాట లోకము నుఱ్ఱూఁత లూఁగించు శక్తి నీయందు దాఁగియున్నది—ఇది మూఢవిశ్వాసముగాదు, నీవంటివా రితరులను వెలువడుదురని నానమ్మకము, నిశ్చయము. మనకుఁ గావలసినవి సాహసవాక్యములు, సాహసోజ్జ్వల కార్యములు. ఓ మహాత్ములారా! లెండు, లెండు! లోకము దుఃఖానల సంతప్త మగుచున్నది. నిద్రింకను

నిద్ర పోఁగలరా ?...సదా సకల శుభములను నీకొసఁగుఁ గాక !—ఆప్తుఁడు, వివేకానందుఁడు.

64

లండన్, 24-6-1896.

సహృదయ—,...మహోత్సాహమును మహాశక్తిసామర్థ్యములును మనకుఁ గావలసియున్నవి, సంగినంగి మాటలును సంగనాచితనమును పనికిరావు. ... సంఘీభావమే శక్తి హేతువు, విధేయతయే యిందలి రహస్యము—ఆప్తుఁడు వివేకానందుఁడు.

65

లండన్, 6-7-1896.

స్నేహాస్పద—,...ఇరువదేండ్ల ప్రాయమున నేనితరాభిప్రాయములతో రవంతయు సానుభూతిలేని—లేశమును సమాధానము నొందని—స్వమతాభిమాన పూరితుఁడను; కలకత్తాలో నాటకశాల వైపునున్న బాటనే నడచువాఁడను గాను. ముప్పదిమూఁడేండ్ల వయస్సున (నిపుడు) వ్యభిచారిణులున్న యింటనే నివసించుచు, వారిని బల్లెత్తు మాట నైనను అనకుండ నుండఁగలను. ఇది క్షీణదశయా? లేక భగవత్స్వరూపమగు విశ్వమానవ ప్రేమానురాగము లందు లీనమగు వికాసమా?...నా కార్యశక్తి యపారముగా వృద్ధిపొందుచున్నది. కొన్నిదినములలో దివ్యభావ పారవశ్యము గలుగుచుండును. ప్రతివ్యక్తిని, సర్వమును, ఆశీర్వదింపవలయునని, ప్రేమింపవలయునని, యాలింగన మొనర్చుకొనవలయునని, తోఁచును; అపుడు చెడుగనునది భ్రాంతి

యని లెట్టును. ఇప్పటి నా మనోభావమిట్టిదే; నాయనా! నిన్ను దలఁచుచు, నా యందలి...దయను అనురాగమును స్మరించుచు, ఆనందబాష్పములు విడుచుచున్నాను.... ఆ మహానీయునకు నేను నిమిత్తమాత్రుఁడను!...

ఇదియొక విచిత్రమైన లోకము, ప్రేమమూర్తియగు భగవానుఁడు మహావిచిత్ర వ్యక్తి! లీలామయుఁడు!...

నేను గ్రహించినవి యొకటి రెండు విషయములు: యుక్తికిని, పాండితికిని, ప్రవచనములకును నతీతమై "ప్రేమ జ్యోతి", పరంజ్యోతి వెల్గొందుచున్నది. అదియే మనకుఁ "ప్రియతమము." ... ప్రేమోన్మత్తుఁడు, సదా మీ యాప్తుఁడు, వివేకానందుఁడు.

**66**

ఇంగ్లాండ్, 14 7 1896.

సహృదయ ,...విదేశ భాషలో వ్యాసము వ్రాయుట కంటెఁ కథ వ్రాయుట కష్టతరము....

...వ్యక్తులవలెనే సంఘములును స్వయంసాహాయ్య మొనర్చుకొనవలయును, ఇదియే నిజమైన దేశభక్తి.... ఆశీర్వాదములు. ఆప్తుఁడు, వివేకానందుఁడు.

**67**

స్విట్జర్లాండ్, 8 8-1896.

స్నేహాస్పద ,...విదేశీయు లెవ్వరును గాక, మనమే పారమార్థిక విషయములలో లోకమునకు బోధకుల

మని మనదేశీయులు గుర్తింతురుగాక ;—కాని వ్యావహారిక విషయములలో మనము వారివద్దనుండి నేర్చుకొనవలయును.

*　　　*　　　*

కృషి సాగింపుఁడు! పట్టు విడువకుఁడు! ధైర్యము వీడకుఁడు! సర్వమునకును సాహసింపుఁడు.

సంసారము దుఃఖనిలయము!—ఆశీర్వాదకుఁడు, అప్పుఁడు, వివేకానందుఁడు.

**68**

స్విట్జర్లాండ్, 8-8-1896.

...క్లిష్ట పరిస్థితులు — ఏ విషమ సమస్యలు— సంభవించినను వేదాంతులమగు మనము మనల నిట్లు ప్రశ్నించుకోవలయును : "ఇది నాకెందుకు సంభవించినది? ప్రేమచే దీనిని జయింపఁజాలనా?...

**69**

స్విట్జర్లాండ్, 23-8-1896.

ప్రేమాస్పద—,...నే నుద్యమము నారంభించినాను, ఇతరులను దానిని గొనసాగింపనిమ్ము. కావునఁ జూచితివా, ఉద్యమమును నడపుటకై కొంతకాలము నేను సిరిసంపదలను దాఁకవలసి వచ్చినది. ఈ కార్యమున నావంతు ముగిసినదని నానిశ్చయము. ఇఁక వేదాంతమునఁగాని, లోకమున మఱియేతత్త్వమునఁ గాని, తుద కీ యుద్యమమునఁగాని, నా కభిమానము లేదు, రుచిలేదు. ఈ లోకమునకు ఈ పరకమునకు—మజల రాకుండుటకై ప్రయాణసిద్ధముగ మూటఁగట్టుకొనుచున్నాను.

పారమార్థిక ప్రయోజనముగూడ నాకు నిస్సార ముగాఁ దోఁచుచున్నది. మఱల రాకుండునటుల జగన్మాత నన్ను దన సన్నిధిని జేర్చుకొనుఁగాక !

...సంసార బంధమనెడి యినుపసంకెలను విడిచి నాను పారమార్థిక భ్రాతృత్వమనెడి బంగారుసంకెలను దగుల్చుకొనుటయు భావ్యము కాదు. ముక్తుఁడను నేను, సదా ముక్తుఁడనై యుండవలయును. ప్రతి వ్యక్తియు ముక్తమై, మలయమారుతము లీల స్వేచ్ఛామయమై యుండవలయునని నాకోరిక....

ఇంతటినుండి ధనవిషయమున నెట్టి జోక్యమును నాకు వలదు ప్రాప్తించిన దానిని మీ యిష్టానుసారము వ్యయింపుఁడు ; సకల శుభములును మీకుఁ గలుగును. భగవదేక శరణుఁడు, వివేకానందుఁడు.

70

స్విజర్లాండ్, 23 8 1896.

ప్రీతిభాజన ....పునీతుల నిమిత్తముకంటె విశేషముగా పాపుల నిమిత్తమే భగవంతుఁ డవతరించుచుండును.

...ఓవ్యభిచారులారా! ఓ చోరులారా! ఓ మధు పాన మత్తులారా! — రండు. మీరందఱును రండు,— రామకృష్ణమందిర ద్వారము మీకందఱకును దెఱువఁబడి యున్నది. "ధనికుఁడు దైవసామ్రాజ్యమును జొచ్చుటకంటె

నొంటె సూదికంటిని దూర్చుట సులభతరము.'' * మీరందఱును నాకత్యంత ప్రేమపాత్రులు.—వివేకానందుఁడు.

## 71

స్విట్జర్లాండ్, 26-8-1896

ప్రేమాస్పద—,...మనము ఏకమై చేయవలసిన ప్రయత్నములన్నియు—ఉద్యమములన్నియు—హిందూదేశములో నడుగంటుచుండును : కారణమేమి? కచ్చితమైన వ్యవహార ధర్మములను మన మలవఱచు కొనకుండుటయే. ''ఎక్కడనైన బావ కాని వంగతోఁటలో బావ కాఁడు'' అనునట్లు వ్యవహార మెప్పటికిని వ్యవహారమే, అందు మొగమోటము పనికిరాదు. తన కప్పగింపఁబడిన మూలధనమున కెవ్వఁడైనను దేట తెల్లముగా జమాఖర్చులు వ్రాయుచుండ వలయును — అంతేకాని యొక కార్యమున కుద్దిష్టమైన ధనమును మఱియొక కార్యమునకు—అది యెట్టిదగుఁగాక—ఉత్తరక్షణమునఁ దాను పస్తుండవలసి వచ్చుఁగాక — ఎన్నఁడును, గలనైనను, వ్యయింపరాదు. ఇది వ్యవహారనీతి. తరువాతి విషయము కార్యదీక్ష. నీవేమి చేసినను దాత్కాలికముగా నది నీ యారాధనమై యుండవలయును. ఇపుడు (నీవు నిర్వహింపవలసిన) ఈ పత్రికయే నీదైవమై యుండ నిమ్ము, విజయము నిన్ను వరించును.

---

* "It is easier for a camel to pass through the eye of a needle than for a rich man to enter the Kingdom of God."—Bible.

ఈపత్రికలో జయమొందిన తరువాతఁ దమిళము, తెలుఁగు, కన్నడము మొదలైన దేశభాషలలోఁగూడ పత్రికలను నెలకొల్పుఁడు. చెన్నరాజధానివారు యోగ్యులు, బలోత్సాహవంతులు. వారియం దింకను నెన్నియో సుగుణములు కలవు—కాని శంకరాచార్యునిదేశము త్యాగవైరాగ్యములను గోల్పోయి నట్లు తోఁచుచున్నది.

నావత్సలు సమరమున దుముకవలయును, సంసారపరిత్యాగము చేయవలయును—అపుడు సుస్థిరమైన పునాది యేర్పడును.

ధైర్యోత్సాహములతోఁ బని సాగింపుఁడు.... నేను మీ దండనున్నాను. నా యనంతరముగూడ నా యంతరాత్మ మీతోఁ గలిసి కృషి చేయును. ముందంజ వేయుఁడు!—ఆశీర్వాదములు, ఆప్తుఁడు, వివేకానందుఁడు.

## 72

లండన్, 1896.

ప్రేమాస్పద—, ... యోగ వేదాంతములను బ్రచారమొనర్చుటకై యమెరికాలో నిరువదిమంది బోధకులకుఁ దగిన తావు గలదు...సమర్థులును నిష్కపటులునగువారు కొందఱు దొరకినఁ బదియేండ్లలో నమెరికాసంయుక్తరాష్ట్రములలో సగము జయింప వచ్చును. వారేరి! మీ రందఱును అర్భకులైతిరి! దేశభక్తులమనియు పారమార్థికులమనియు చెప్పికొను మీరు, స్వార్థపరులగు పిఱికి పందలు!!!

మీా దేశ భక్తి నాలుక చివరిమాట! చెన్న రాష్ట్రీయులకుఁ జౌరవయు నిలుకడయు నున్నవి, కాని ప్రతిమూర్ఖుఁడును పెండ్లి చేసికొనియున్నాఁడు....అంటియు నంటనట్లు సంసారము చేయుఁడలఁపవచ్చును గాని చెన్నరాష్ట్రమున మనకిపుడు కావలసినది—బ్రహ్మచర్యమే—అవివాహత్వమే.

నాయనా! ఇనుపకండలు, ఉక్కునరములు, తదంతర మున వజ్రాయుధతుల్య మానసము—వీనితోఁ గూడిన వ్యక్తులు నాకిపుడు కావలసియున్నారు, బలము, పౌరుషము; క్షాత్రవీర్యము, బ్రహ్మతేజము. మన మెంతయో యాశ పడఁదగిన మన బాలుర—సౌమ్యులగు మనవత్సలు—పెండ్లియనఁబడు నీ ఘోరబలిపీఠమున నిహతులే కానిచో, వారి కేలోపమును లేకుండెడిది. ఓపరమేశ్వరా! నా మొఱాలకింపవా? చెన్నపట్టణమున నుత్తమోత్తములును విద్యావంతులు నగు యువకులు కనీస మొకవంద మంది యైనను సంసారమును త్యజించివైచి, యుజ్జ్వల దీక్షానిధులై దేశదేశాంతరములకు వెడలుచు, సత్య సమరమునఁ బోరాడ సంసిద్ధులైనచోఁ జెన్నపురి మేల్కొనును. భారతదేశము బయట పొందిన యొక విజయము దేశమందలి నూఱువేల విజయములకు సమానము....

...పదిలక్షలమంది హిందువులైనను బ్రపంచ మంతయు సంచరించినచో నెంత బాగుండెడిదో కదా! సదా మీా యాప్తుఁడు, వివేకానందుఁడు.

73

ఇంగ్లాండ్, 22-9-1896.

స్నేహాస్పద——,...జర్మనీలో డాయిసన్ (Prof. Deussen) పండితునితో నాకు మనోజ్ఞమైన కాలక్షేపము జరిగినది. తరువాత నిరువురమును లండన్ వచ్చినాము. మా కిరువురకును నిట్లచిరకాలముననే ప్రాణమైత్రి కుదిరినది.

...ఇంకను నొక క్షేత్రమున మనము విశేషమైన కృషి చేయవలసియున్నది.—కబీరు, నానక్ తులసీదాసుల యొక్కయు దక్షిణ దేశమందలి సాధుసత్తములయొక్కయు జీవిత చరిత్రమును వ్రాయవలసి యున్నది. అజాగ్రత్తగను క్రమవిహీనముగనుగాక, సమగ్రముగను పండిత పామర రంజకముగను వ్రాయవలయును.

...శక్తి సామర్థ్యములతోఁ గృషి సాగింపుఁడు. మీరెల్లరును నా కత్యంతప్రేమపాత్రులని గ్రహింపుఁడు.—

మీ వివేకానందుఁడు.

74

ఇంగ్లాండ్, 7-10-1896.

...ఒక గుహలోనికి వెడలి ప్రశాంతముగానుండుట సహజమగు నామనఃప్రవృత్తి. కాని వెనుకనుండి విధి నన్ను ముందునకుఁ ద్రోయుచున్నది, నేను పోవుచున్నాను. విధి నెవ్వ రెదుర్కొనఁగలరు?

"నిత్యసంతోషులును సంతత సదాశా పూరితులును ధన్యులు. వారిదివలనకే భగవత్సాన్నిధ్యము నొందియున్నారు

గదా'' యని కొండపైనుండి యొనర్చిన ధర్మబోధలోఁ క్రీస్తు ఏల చెప్పలేదు? యావల్లోకదుఃఖములను భరించిన యామహనీయుఁడు—పావనాత్ముఁడు బసిబిడ్డతోఁ బోల్చిన యామహాత్ముఁడు ఇట్లు చెప్పియుండవలెనని, చెప్పియే యుండెనని, నానిశ్చయము. అనుచరులు దానిని వ్రాసికొన లేదు? వేయింటి కొకటియో వారు గుర్తించి వ్రాసి, జ్ఞప్తిలో నుంచుకొనిరని నా యభిప్రాయము.

...హిందువులు, బౌద్ధులు, మహమ్మదీయులు, ''సోదర బృందములును'' మఱెవరెవరో, యొక్క పెద్ద బలగమిటు నమెరికా సంయుక్త పరగణాలను, మహాత్మాన్వేషకులు, క్రైస్తవాచార్యులు మొదలైనవారితోఁ గూడిన మఱియొక బలగమటు హిందూదేశమును ప్రవేశించినదని విన్నాను!! మంచిది, సంయుక్త పరగణాలును హిందూదేశమును ఇవి రెండే మతసంబంధమైన చొరవకుఁ దగిన దేశములని తోఁచుచున్నది....ఆశీర్వాదకుఁడు, సదా మీ యాప్తుఁడు, వివేకానందుఁడు.

75

విమ్బల్డన్, ఇంగ్లాండ్, 9 10 1896.

సహృదయ,... నా సిద్ధాంతము నీకుఁ దెలిసినదే. కామకాంచనములను జయింపనివాని నెవ్వనిని నేను నమ్మఁజాలను....పాఠములను గూర్చి ప్రచురణ చేయుచుఁ, క్రమముతప్పక ప్రసంగములను నుపన్యాసములను సాగింపుము.

...ఉజ్జ్వలదీక్షను బూనుఁడు! ఉజ్జ్వలదీక్షను

బూనుఁడు! ఉద్యమము నఖండవ్యాప్తి చేయుఁడు! మీ రందఱును నా కత్యంత ప్రేమాస్పదులు, ఆశీర్వాదములు.— వివేకానందుఁడు,

76

స్నేహాస్పద—, పురోహితులు, సైనికులు, వర్తకులు, కార్మికులు—నను నీ నాలుగు జాతులచేతను గ్రమముగా మానవసంఘము పరిపాలింపఁబడుచుండును. ఒక్కొక్క దానియందును గుణదోషములు గలవు. పురోహితులు (బ్రాహ్మణులు) పరిపాలించునపుడు పారంపర్యసంబంధమైన యుక్తులను బురస్కరించుకొని ఘోరమైన సంకీర్ణత యేర్పడుచుండును—సకలవిధ సంరక్షణోపాయములును వారిని, వారి వంశీయులను నావరించియుండును—తమకుఁ దక్క మఱెవ్వరికిని విద్యాధికారము లేదు—తద్బోధనాధికారముగూడఁ దమకే. ఇందలి గుణమేమన, ఈయుగమున సకలశాస్త్రములకును బునాదు లేర్పడును. పురోహితులు ధీశక్తిమూలమునఁ బరిపాలింతురు కావున ధీశక్తిని వికసింపఁజేసికొందురు.

సైనికుల (క్షత్రియుల) పరిపాలన నిరంకుశముగను గఠినముగను నుండును. ఐనను వీరు సంకుచితాశయులు కారు. ఈ యుగమునఁ గళలును సభ్యతయు నుచ్చస్థితి నందును.

తరువాతిది వర్తకుల (వైశ్యుల) పరిపాలన. నిమ్మదిగా నెత్తురును బీల్చివేయుచు (నెవ్వరికైనను) అణఁచుటలో ఈ పరిపాలనము ఘోరశక్తిమంతమైయుండును. వర్తకుఁడు నానా

ప్రదేశములకును వెడలుటచే ముందటి యుగములు రెంటిటి యందును కూర్పఁబడిన భావములు బాగుగా వ్యాప్తియగుటయే యీ పరిపాలనమువలని లాభము. సంకీర్ణత యనునది లేకుండుటలో క్షత్రియులను వీ రధిగమింతురు. కాని సామాజిక సభ్యత యీ యుగమున క్షీణింప నారంభించును.

కడపటిది కార్మికుల (శూద్రుల) పరిపాలనము. ఎల్లరకును శారీరసౌఖ్యము నందుపాటులో నుంచుటయే యీ పరిపాలనమువలని లాభము—(ప్రాయికముగా) సభ్యత క్షీణించుట దీనివలనఁ గలుగు నష్టము. ఈ యుగమున సాధారణవిద్య విశేష వ్యాప్తిచెందును. కాని యసాధారణ ప్రతిభావంతుల సంఖ్య విశేషముగా క్షీణించును.

బ్రాహ్మణయుగమందలి జ్ఞానము, క్షత్రియయుగమందలి సంస్కృతి, వైశ్యయుగమందలి సదాశయ సంపద్వ్యాపనము, శూద్రయుగమందలి సమత్వాదర్శము—నివన్నియు వెలయునట్లును వీని ననుసరించు దోషములు లేకుండునట్లును రాష్ట్రమును నిర్మింపఁగలిగినచో నది యాదర్శ రాష్ట్రమై యొప్పుననుటకు సందియము లేదు. కాని యిది సాధ్యమా!

ఐనను మొదటి మూఁడిటి హాయామును గడచినది. ఇపుడు నాల్గవదానికి (శూద్రపరిపాలనమునకు) సమయము—శూద్రు లుచ్ఛ్రకళ నొందితీరవలసియున్నది—దీని నెవ్వరును అడ్డుకొనఁజాలరు. వెండి బంగారపుఁ బ్రమాణములను (Gold and Silver Standards) గూర్చిన చిక్కులన్నియు

నాకుఁ దెలియదు (ఆమాటకు వచ్చిన, నెవ్వరికిని దెలిసినట్లు కనఁబడదు); కాని సువర్ణప్రమాణము పేదలను మఱింత పేదలుగను ధనికులను మఱింత ధనికులుగను జేయుచుండుట మాత్రము నాకు స్పష్టమగుచున్నది. "బంగారపు సిలువపై మేము కొఱతవేయఁబడ నొల్లము"* అని బ్రయాన్ (Bryan) చెప్పినమాట యథార్థము. రజత ప్రమాణము (Silver Standard) ఈ విషమ సమరమునఁ బేదలకుఁ గొంత సదవ కాశము నొసఁగఁగలదు. సామ్యవాదము (Socialism) న లోపములు లేవని కాదు కాని, లేనిబావకంటె గుడ్డిబావ మేలు, కాఁబట్టి నేను సామ్యవాదిని.

ఇతర విధానముల నవలంబించి చూడఁగా నవి లోప భూయిష్ఠములని తేలినది. మఱెందుకును గాకున్నను, నేవల నవీనమని యైనను ఈ మార్గ మవలంబించి చూతముగాక. ఎంతసేపును నొకరే కష్టసుఖముల ననుభవించుచుండుటకంటె నితరులును నందు భాగస్వాములగునట్లు చేయుట మేలుకదా. లోకమందలి మంచిచెడుగులు మొత్తముమీఁద నెప్పుడును నొక్కటే. వేఱేమియుఁ గానిచో, నూతన విధానము వలన బండికాడి యొక పశువుమెడనుండి మఱియొక పశువుమెడ మీఁది కెత్తఁబడినదగును.

దుఃఖాలయమగు నీలోకమునఁ బ్రతికింతేవును, ప్రతి వ్యక్తిని, దన యుచ్ఛదశ ననుభవింపనిండు,—ఈ సంసా

* "We refuse to be crucified on a cross of gold."

శాడంబరమును, ఈ ప్రభుత్వములను, ఈ బాధలను సర్వము విడనాడి తుదకెల్లరును భగవానుని ప్రేమించుటకుఁగాను సౌఖ్యమనఁబడెడి యీ యనుభవమును బొందనిండు.

మీరెల్లరును నా కత్యంత ప్రేమాస్పదులని గ్రహింపుఁడు. సదా మీ యథార్థ సోదరుఁడగు వివేకానందుఁడు.

77

లండన్, 20 11 1896.

స్నేహాస్పద . . . . భారతీయ పత్రికలు భారతీయులచేతనే పోషింపఁబడవలయును. నానాదేశీయులకును బత్రికను సమానాంగీకార యోగ్య మొనర్చుటనిన, నానాదేశీయ లేఖక సముదాయము నేర్పాటు చేయవలయునన్నమాట. అందులకుఁగాను ప్రతిసంవత్సరము కనీసము లక్షరూపాయిలు వ్యయింపవలయు నన్నమాట.

...నాసంబంధ బాంధవ్యములనునవి యొక్క భారత దేశముతో మాత్రమే కాక, సమస్త దేశములతోడను గూడుకొనియున్నవను సంగతి మీ రెన్నఁడును మఱవరాదు.... అప్పుఁడు, ఆశీర్వాదకుఁడు, వి.

78

లండన్, 28 11 1896.

ప్రియసోదరీమణులకు . . . ఆంగ్లేయు లమెరికాదేశీయు లంతటి బుద్ధికుశలులు కారు, కాని మీరు తెలుపు విషయములు వారి మనసునకు నచ్చెనా, శాశ్వతముగా మీ యధీనులగుదురు....

...ప్రతి నాగరిక దేశమునకును తత్త్వప్రచారార్థము హిందూయువకులను బంపుటయు (దేశోద్ధరణార్థము) హిందూదేశమునఁ గృషిచేయుటకు విదేశములనుండి స్త్రీపురుషులను బడయుటయు నా యుద్యమము. ఇచ్చి పుచ్చుకొనుట కిది చక్కని మార్గముగదా.... శాశ్వతప్రేమానురాగ బద్ధుఁడు, వి.

## 79

## డాక్టర్ బారోస్ అను క్రైస్తవ మతప్రచారకునకు భారతీయులు సముచిత స్వాగతము నొసఁగవలయునని తెలుపుచు, 'ఇండియన్ మిర్రర్' పత్రికాధిపతికి స్వామి వ్రాసిన లేఖ

లండన్, 1896.

...కృతజ్ఞతయు నతిథిసత్కారమును భారతీయుల ప్రత్యేకలక్షణములని మనము గుర్తింపవలయును, భూగోళమున కవ్వలితట్టునుండి వచ్చుచున్న యీ పరదేశి (Dr. Barrows) మనము దైన్యదుఃఖ దారిద్ర్యముల మ్రగ్గుచున్నను, ప్రాచీనకాలమున నేదేశ మార్యావర్తమనఁబడఁగనో, యేదేశ మైశ్వర్యమునకు నిఖిల దేశములందును (రత్నగర్భయని) పేరుగాంచెనో, అట్టి భారతదేశము నేఁటికిని తన ప్రాణశక్తిని గోల్పోలేదని (యీతఁడు) గుర్తించు రీతిని వర్తింపుఁడని నా దేశీయులను ప్రార్థించుచున్నాను.

80

## ఒక యమెరికాదేశీయ నారీమతల్లికి

లండన్, 13 12 1896.

అమ్మా! ధర్మములును నీతినియమములును మనోవికాస క్రమమున నాయా జనులకు వర్తించునను సంగతి మనము తెలిసికొనవలయును, తెలిసికొనిన యెడల సమస్తము తేట తెల్లమగును.

త్యాగము, అప్రతీకారము, అహింస యనునవి క్రమక్రమముగా లౌకికచింతను, ప్రతీకారబుద్ధిని హింసాత్మక దృష్టిని విడనాడుటచేఁ బొందఁదగిన యాదర్శములు. ఆదర్శమును దృక్పథమున నిడుకొని తత్ప్రాప్తి నిమిత్తము కృషి చేయుము. ప్రతీకారము, హింస, కోరికయు ననునవి లేనిచో లోకమున నెవ్వఁడును మనఁజాలఁడు. ఆదర్శమనునది సాంఘికముగా నవలంబనీయమై యనుభూతము కాఁదగినట్టి స్థితి కింకను లోకము రాలేదు.

దోషములవలన గుణపాఠములను గ్రహించుచు లోకము పొందెడి వికాసము నెమ్మదిగానయ్యును నిశ్చయముగా నాదర్శప్రాప్తికి దానిని యోగ్యమొనరించుచున్నది. జనబాహుళ్యము మెల్లఁగా నిట్టి వికాసము నొందుచు సాగుచుండవలయును అసాధారణులనఁదగువారు ప్రస్తుతపరిస్థితులలో నాదర్శప్రాప్తికై యావలకు రావలసియే యుందురు.

సమయోచితవిధిని — సమయోచితధర్మమును — నిర్వహించుటయే ఉత్తమమార్గము. 'ఇది నాధర్మము', 'ఇది

నా కర్తవ్యము' అను భావముతో నాచరింపఁబడిన ధర్మము మనకు బంధమునుగాని సంగమునుగాని కల్పింపదు.

గాన ముత్తమోత్తమమైన కళ, గ్రహింపఁగలవారి కిది మహోత్తమారాధన.

శక్తికొలఁదియు మనము లోకమునందలి చెడుగును అజ్ఞత్వమును తొలఁగింపఁ బ్రయత్నింపవలయును. సౌజన్య వికాసమే దౌర్జన్య వినాశకమని మనము గ్రహింపవలసి యున్నది.—ఆప్తుఁడు, వివేకానందుఁడు.

81

రీడింగ్, 1896.

ప్రేమాస్పద ,... మన దేశమంతయుఁ గేవల తమస్సున మునిఁగియున్నది. మొదట మనకుఁ గావలసినది రజస్సు, సత్త్వ మెప్పటి మాటయో!—అది తరువాత వచ్చును....
—ఆప్తుఁడు, వివేకానందుఁడు.

82

రీడింగ్, ఇంగ్లాండ్, 1896.

శక్తికొలఁదియుఁ బ్రయత్నించిననే కాని యేమైననుసిద్ధించునా? "ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః"* ఇత్యాది.

* శ్లో. "ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీ
ర్దైవం ప్రధాన మితి కాపురుషా వదన్తి,
దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా
యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః ॥"

క్రియాశూరుఁ డగువానిని, బురుషసింహుఁ డగువానిని, భాగ్యదేవత వరించును. వత్సలారా! వెనుకకుఁ జూడ నక్కఱలేదు, ముందంజ వేయుఁడు! అఖండ ధైర్యసాహసములు, అఖండదీక్ష, అఖండ సహనము ఇవి మనకుఁ గావలసినవి, వీని మూలముననే మహాకార్యములు సాధ్యమగును.
—అప్తుఁడు, వివేకానందుఁడు.

83

రామనాథము, 30-1-1897.

అభిన్నహృదయ—, అతివిచిత్రముగా, తలవని తలంపుగాఁ బరిస్థితు లేర్పడుచున్నవి...సింహళము (Ceylon)న నేను దిగిన తావగు కొలంబోనుండి దక్షిణ దేశాగ్ర మనఁదగు రామనాథమువఱకును (రామనాథరాజునకు నేనిపుడు అతిథినై యున్నాను) నా ప్రయాణము జనసమూహములతో, దీపావళులతో, స్వాగతాభినందన పత్రికలతో, ఆశ్వాదములతో—బ్రహ్మాండమైన యుత్సవముగాఁ బరిణమించినది. నేను దిగిన తావున నలుబదియడుగుల యెత్తగు విజయస్తూపము నిర్మింపఁబడినది. రామనాథరాజు తన స్వాగతపత్రమును జక్కని నగిషీతోఁ గూడిన యొక పెద్ద మేలిమి బంగారు బరిణెయందిడి, "His Most Holiness" నకు (అఖండపావనాత్మునకు) ఒసఁగెను. యావద్దేశమును నాకుఁ బ్రత్యుత్థాన మొనర్పఁబోవుచున్నదా యను నటుల చెన్ననగరవాసులును కలకత్తా పౌరులును నారాకకై యుత్కంఠతో నిరీక్షించుచున్నారు. నాకిది మహోచ్ఛ్రదశయే కాని

మనస్సు ప్రశాంతమగు నేకాంతవాసము దెసకు, చికాగోలోఁ గడపిన యాప్రేమ ప్రశాంతిమయ దివసముల దెసకు, మఱలు చున్నది. కావుననే యిపుడు నీకు వ్రాయుచుండుట. మీ కందఱకును జిరాయురారోగ్యములును శాంతియు లభించుఁ గాక ;... మీ ప్రియసోదరుఁడు, వివేకానందుఁడు.

## 84

కలకత్తా, 26 2 1897.

ప్రేమాస్పద ,...ఉత్సవములచే నేమి, ఊరేగింపులచే నేమి, దేశమంతటను మఱి యితరవిధమైన స్వాగతములచే నేమి, సామ్యము చెప్పునట్లు నాకు మరణించుటకుఁగూడ తీఱిక లేకున్నది,...(శ్రీరామకృష్ణ) జన్మదినోత్సవమైనంతనే 'బ్రదుకు జీవుఁడా' యని పర్వతములకుఁ బాఱిపోవుదును.

...నే నిపుడు రెండు కేంద్రములను—చెన్నపట్టణములో నొకటియుఁ గలకత్తాలో మఱొకటియు నెలకొల్ప వలసియున్నది. చెన్నపురి పౌరులు కలకత్తావారికంటె విశేష గంభీరహృదయులును గార్యతత్పరులును ; చెన్నపురినుండియే వలయు ధనమును వారు ప్రోగుచేయఁగలరని నా నమ్మకము. దేశభక్తిని బురస్కరించుకొని కలకత్తా పౌరులు అందు ముఖ్యముగా కులీనులు ఉత్సాహవంతులైయున్నారే కాని వారి సానుభూతి యెన్నఁడును గార్యరూపము నొందదు. పైపెచ్చు నా యుద్యమమునంతను ధ్వంసము చేయుటకై విశ్వప్రయత్నము చేయు నసూయాపరులతోడను దయావిహీనులతోడను దేశము నిండియున్నది.

కాని యాటంకములు హెచ్చినకొలఁదియు నీభావమును జెలరేఁగుచుండును. సన్న్యాసుల కొకటియు స్త్రీలకు మఱొకటియు నీరెండు కేంద్రములను నెలకొల్పకుండ నేను గతించిన, నా కర్తవ్యము నసంపూర్తిగా విడిచినవాఁడ నగుదును.... అప్పఁడు, వివేకానందుఁడు,

85

## సంస్కృతమునుండి యనువాదము

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

డార్జిలింగ్, 19 4 1897.

...నీ యభీష్టసిద్ధినొంది నిశ్చయుఁడవై నరుల నీ ఘోర సంసారసాగరమునుండి తరింపఁజేయు యథాశక్తిగాఁ బ్రయత్నింతువుగాక! తన్నిమిత్తము నీ హృదయమున వెలయుమని యుల జగద్గురుని మహాసమన్వయాచార్యుని శ్రీరామకృష్ణుని—ప్రార్థించుచున్నాను. సదా ధీరుఁడవై, వీరుఁడవై, వర్తింతువుగాక! ధీరుఁడవనకుఁ గాదు—వీరునకే మోక్ష మతిసన్నిహితము. వీరులారా! సాయుధులుకండు! కట్టెదుట మహామోహరూపులగు శాత్రవులు. ''శ్రేయాంసి బహువిఘ్నాని'' యనుటకు సందియము లేదు, ఐనను మా గమ్యప్రాప్తికై యావచ్ఛక్తితోడను కృషి చేయవలసి యున్నది. మోహగ్రస్తమగు నీ లోకము నవలోకింపుఁడు! అతిదీనమై, హృదయభేదనకరమగు వారి యార్తనాదమును వినుఁడు! బద్ధులను బంధవిముక్తులను జేయుటకై, యార్తుల దుఃఖభారము నుపశమింపఁజేయుటకై, అజ్ఞానుల హృద

యాంధకారమును బటాపంచలోనరించుటకై, యో వీరులారా! ముందంజవేయుఁడు? అగ్రసరులుకండు! "అభీః, అభీః," (భయము లేదు, భయము లేదు) అని భేరీనినాదములతో వేదాంతము ఎట్లు ఘోషించుచున్నదో ఆలకింపుఁడు! ఆ గంభీరశబ్ద మెల్లరిహృదయగ్రంథులను భేదించుఁగాక!—
సదా మీ శ్రేయోభిలాషి, వివేకానందుఁడు.

86

ఓం తత్ సత్

డార్జిలింగ్, 6-4-1897.

పూజ్యురాలగు భారతీ పత్రికాధిపురాలికి.

అమ్మా—... ఈ జీవన సమరమున నూతనభావములను బోధించువ్యక్తిని ప్రోత్సహింపఁబోవు స్త్రీల మాట యటుండ, నట్టివానికిఁ బ్రోత్సాహము నొసఁగూర్చు పురుషులు—ముఖ్యముగా మన యభాగ్యదేశమున దుర్లభులు, భారతదేశములోని పురుషులందఱి గంభీరస్తుతులకంటెను మీవంటి వంగదేశీయ విదుషీమణి యభినుతి నాకు విశేష మాన్యము.

భగవదనుగ్రహమున మీవంటి మహిళామతల్లు లనేక లీ దేశమున నుద్భవించి, మాతృదేశక్షేమార్థము జీవితము ధారవోయుదురుగాత!

భారతిలో నన్నుగూర్చి మీరు వ్రాసిన వ్యాస విషయమునఁ గొన్నిమాటలు చెప్పవలసియున్నది. భారత

దేశశ్రేయమునకుఁగాను పాశ్చాత్యలోకమున మతప్రచారమెప్పుడు జరిగినది, పాశ్చాత్యులు మనకుఁ దోడ్పడనిదే మనము పైకి రాఁజాలమని సదా నా నిశ్చయము. గుణగ్రహణము గాని, ఆర్థిక బలముగాని—యన్నిటికంటెను శోచనీయము —అణుమాత్ర మాచరణగాని యీ దేశమునఁగానరాదు,

చేయవలసిన కార్యము లనేకములు కలవు, కాని యీ దేశమున సాధనసంపద లోపము. మెదడు మనకున్నది, కాని చేతులు లేవు. మనకు వేదాంత సిద్ధాంతము కలదు, కాని దాని ననుష్ఠానమునఁ జూపు శక్తి లేదు. గ్రంథములలో సర్వసమత్వ సిద్ధాంతమున్నది, కాని క్రియలో భేదములను బ్రహ్మాండముగాఁ బాటించుచుందుము. మహోత్కృష్ట నిష్కామ కర్మము బోధింపఁబడినది భారతదేశమున; తిరిగి మనమే ఘోరక్రూరులమై, ఘోరనిర్దయాత్ములమై, మన రక్తమాంసమయశరీరము దక్క మఱిదేనిని గూర్చియుఁ జింతింపఁజాలకున్నాము.

'ఐనను ప్రస్తుత పరిస్థితులనుండియే మనము కృషి సాగింపవలసియున్నది. వేఱుమార్గము లేదు. మంచి చెడుగులనుగూర్చి విమర్శించుటకుఁ బ్రతిమానవునకును శక్తి కలదు; దుఃఖప్రమాదనిలయమగు సంసారతరంగములకు జడియక—యొకచేతితోఁ గన్నీటిని దుడుచుచు, నచంచలమైన రెండవచేతితో మోక్షమార్గము నెవ్వఁడు చూపఁగల్గునో వాఁడే వీరుఁడు, వాఁడే ధీరుఁడు. జడమైన మట్టి ముద్దవలె నొకవైపున సంకీర్ణమైన సంఘము, మఱియొక

వై పునసాందోళనములో, నాత్రములో, నూరక మండిపడు చుండు సంఘ సంస్కర్త; శ్రేయోమార్గ విరాయుభయ పక్షములకును పడుచు నున్నది. జపాన్ దేశములోని బాలికలు తమ యాట బొమ్మలను హృదయపూర్వకముగాఁ బ్రేమించిన నవి సజీవములగునని నమ్మెదరని యా దేశమున నేను విన్నాను. జపాన్ దేశీయ బాలిక తన బొమ్మ నెప్పుడును విఱుగఁగొట్టదు. ఓ మహాభాగ్యశాలులారా! సిరిసంపద్విహీనులై, యదృష్టహీనులై, వివేకభ్రష్టులై, యధఃకృతులై, క్షుత్పీడితులై యసూయాద్వేషపూరితులై యున్న యీ దేశీయుల నెవ్వరైనను హృదయపూర్వకముగాఁ బ్రేమింపఁగలిగినచో, భారతదేశము పునర్జీవితమగునని నేనును నమ్ముచున్నాను. అజ్ఞానదారిద్ర్యముల నానాఁటికిఁ గ్రుంగిపోవుచున్న తమసోదరకోటి శ్రేయమును గాంక్షించి పదులకొలఁది స్త్రీపురుషులు, ఉదారులు, ఎప్పుడు భోగవాంఛలను బూర్తిగా విడనాడి యావచ్ఛక్తితోడను గృషిచేయుదురో అపుడే భారతదేశము మేల్కాంచును. సత్సంకల్పము, నిష్కాపట్యము, అఖండ ప్రేమానురాగములు ననునవి లోకమును జయింపఁజాలునని దృఢముగు నా జీవితముననే నా కనుభూతమైనది. ఈ సుగుణములు గల యొక్క వ్యక్తి లక్షలకొలఁది వంచకుల పశుతుల్యుల కపటోపాయములను నశింపఁజేయఁజాలును.

నేను బడమటకు వెళ్లుట యింకను నిశ్చయముగాలేదు; వెళ్లుటయే తటస్థించునెడ నది భారతదేశముకోసమే

యని గ్రహింపుడు. ఈ దేశములో మనుష్య బలమేది? ఆర్థిక బలమేది? భారతీయమార్గమున, భారతీయధర్మ మూలమున నత్యంతనిమ్న జాతులకు—చండాలురకు—సైతము సేవచేయుచు, భారతదేశ హితమొనరించుటకుఁగాను పశ్చిమ దేశములందు స్త్రీపురుషుల సేనలు సంసిద్ధులైయున్నారు. ఈ దేశమున నట్టివా రెందఱున్నారు? ఇఁక నార్థికబలము! నా స్వాగతమునకైన ఖర్చులను భరించుటకుఁగాను గలకత్తా పౌరులు నాచే నుపన్యాసముచేయించి, టిక్కెట్లమ్మినారు. ఇందుకు నే నెవ్వరిని నిందింపను, దూషింపను. పాశ్చాత్య దేశములనుండి స్త్రీలును బురుషులును రానిదే మన దేశము బాగుపడుటనునది యసంభవమని తెలుపుటయే నా యభిప్రాయము.

సదా మీయెడ కృతజ్ఞుఁడై సదా మీ క్షేమార్థము భగవంతుని బ్రార్థించు— వివేకానందుఁడు.

87

డార్జిలింగ్, 24-4-'97.

అమ్మా—...నీ సమాలోచనమునకుఁగాను నా యనుభవ పూర్వకమైన యభిప్రాయములను (సంగ్రహముగాఁ) దెలిపెదను.

మనము శాశ్వతముగా బానిసలమైయున్నాము, అనఁగా జన్మసిద్ధమగు నంతర్జ్యోతిని వెలువరించుటకు భారత జనసామాన్యమున కవకాశము లేదయ్యె. కొన్ని శతాబ్దములనుండియుఁ బాశ్చాత్యలోకము స్వాతంత్ర్యముదెస పురోగ

మన మొనర్చుచున్నది. కులీనత్వము మొదలుకొని భోజన విధి నిషేధములవఱకును రాజే హిందూదేశమున శాసన కర్తయైయుండువాఁడు. పాశ్చాత్యదేశములందో, జనులే స్వయముగా సర్వకార్యములను జేయుదురు.

సాంఘికవిషయములలో రాజున కిపుడేమియుఁ బెత్తనములేదు; ఇఁక హిందువులు స్వశక్తిని నమ్ముకొను మాటటుంచి, యాత్మవిశ్వాసము లేశమైనను లేనివారై యున్నారు. వేదాంతమునకు మూలాధారమనఁదగు నాత్మవిశ్వాస మణుమాత్రమును నింకను నాచరణలోనికి రాలేదు. ...మన కాశాజనకులగు యువకుల నడుమ నిరాడంబరముగా, శాంతముగా, స్థిరముగా మనము కృషిచేయుటుత్తమము.

...జనసామాన్యమున విద్యాబుద్ధులు వ్యాప్తి చెందినకొలఁదియు దేశ మభివృద్ధిచెందుట నాకు విస్పష్టముగాఁ గాన్పించు విషయము. అభిజాత్యముతో, రాజాధికారముతో, నేకొలఁదిమందియో విద్యనంతను దమ యధీనమున నుంచుకొనుటయే—తమ హక్కుగాఁ దలఁచుచుండుటయే—హిందూదేశపతనమునకు ముఖ్యకారణము. ఎన్నఁటికైనను మఱల మనము పైకి రావలయుననిన, ఏదేవిధముగా (అనఁగా జనసామాన్యమున) విద్యావ్యాప్తి చేయుటయే మార్గము. సంఘసంస్కారమునుగూర్చి యర్ధశతాబ్దముగాఁ బెద్ద గడబిడ. పదియేండ్లనుండియుఁ బర్యటనము చేసి చూచుచున్నాను; సంఘసంస్కారసమాజములు తప్పతిప్పలుగా

బయలుదేఱియున్నవి. కాని "పెద్ద మనుష్యులు" అనిపించు కొనువారు, ఎవరి రక్తమును పీల్చి పెద్దమనుష్యులై యున్నారో యట్టి జనసామాన్యము నిమిత్తము నెలకొల్పఁబడిన సమాజమొక్కటియు నా కంటఁబడలేదు! ముసల్మానుల వలన నేమాత్రమునుండి సిపాయిలు తీసికొనిరాఁబడినారు? అణారూపాయిలకు స్వయముగాఁ దమ తండ్రుల కుత్తుకలను సోదరుల కుత్తుకలను నుత్తరించుటకు లక్షల కొలఁది మంది హిందూదేశములోఁ దక్క మఱెక్కడ దొరకుదురు? ఏడుశతాబ్దముల మహమ్మదీయ పరిపాలనమున నాలుకోట్ల మంది ముసల్మానులు, నొక్కశతాబ్దపుఁ గ్రైస్తవ పరిపాలనమున 'నిరువదిలక్షలమంది క్రైస్తవులునా? — ఎందుచేత? స్వతంత్రమైన యాలోచనాశక్తి దేశమునుండి యెందుచేఁ బలాయనమైనది? హస్తలాఘవమును నైపుణ్యమును గల మన శిల్పులు, ఐరోపావారితోఁ బోటికి నిలువలేక దినదినము నెందుచే నశించుచున్నారు? అనేకశతాబ్దములుగా నిలువఁ ద్రొక్కొనియున్న యాంగ్లదేశపుఁ బనివాని స్థానబలము నేశక్తిచే జర్మన్ దేశీయకార్మికుఁడు గదల్చి వేయఁ గలిగినాఁడు?

విద్యాభ్యాసము, విద్యాభ్యాసము, విద్యాభ్యాసము—మఱేమియుఁగాదు; ఐరోపాఖండమున వివిధపట్టణములలోఁ బయనించునపుడు, అచటి పేదలకు సైతముగల సదుపాయములును సౌఖ్యమును విద్యయు మనదేశీయుల దైన్యావస్థను దలఁపునకుఁ దెచ్చుటచేఁ గన్నీళ్లుగార్చువాఁడను. ఈవ్యత్యాస

మనకుఁ గారణమేమి? విద్యయేయని నేను బొందిన సమాధానము. విద్యవలన, ఆత్మవిశ్వాసమువలన, (మతిచేని వలననుగాదు) అంతర్గతబ్రహ్మము వారియందు మేల్కొనుచున్నది; మనయందలి బ్రహ్మమో, నిద్రపోవుచున్నది. మఱి మాన్యములనునవి లేక, చేతఁ గాసైనను లేక, యథః కృతులై, వెఱ్ఱివాలకముతో, బుద్ధిమాంద్యముతో,—నా°క్ష కఱ్ఱయు దానిచివరఁ గట్టఁబడిన చింపి గుడ్డల మూటయు—నీమాత్రపుటాస్తితో, చేలమూపులతో—నైర్గాంఘదేశము నుండి వలసవచ్చువారిని న్యూయార్కులో నేను గమనించువాఁడను. ఆఱునెలలలో వేఱుదృశ్యము—ఆ వ్యక్తియే తీవితో నడచుచుండును, దుస్తులు మాఱును. కన్నులలోఁ గాని, ముఖములలోఁగాని దైన్యమేమియుఁ గానరాదు. కారణము? స్వదేశమున సంఘముచేతను నాతఁడు దేవగించుకొనఁ బడుచుండెనని — ఏకగ్రీవముగా సమస్త ప్రకృతియు వానితో, "నోరి పుల్లయ్యా! నీకింతకంటె గతిలేదు, బానిసవై పుట్టినావు, బానిసవై నీవుండవలయును" అని చెప్పుచుండెనని వేదాంతము మనకుఁ దెలుపును. పుట్టుక నుండియు నట్లు చెప్పఁబడుటచేఁ బుల్లయ్య దానిని నమ్మి తానట్టివాఁడనని భ్రమించినాఁడు, వానియందలి బ్రహ్మము నిహితమైపోయినది. కాని యమెరికాలోఁ గాలిడినంతనే—"పుల్లయ్యా, నీవును మావలెనే మనుష్యుఁడవు, మనుష్యుఁడే సర్వము సాధించియున్నాఁడు, నిన్నుఁబోలు మనుష్యుఁడు కూడ సర్వము సాధింపఁగలఁడు; ధైర్యము నవలంబింపుము!"

అని నానాదిక్కులును ఘోషించినవి. పుల్లయ్య తల యెత్తెను. అది నిజమేయని గ్రహించెను. అంతర్గతమగు బ్రహ్మము మేల్కొనెను. "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరాన్నిబోధత*—లెమ్ము, మేల్కొనుము, గమ్యప్రాప్తి పర్యంత మాగవలదు" అని ప్రకృతియే వానికిఁ జాటెనని చెప్పనగును.

ఇదేవిధముగా మన జాతీయ విద్యాభ్యాస మంతయుఁ పెడదారిని బట్టుచున్నది. పాఠశాలలోఁ బిల్లవాఁడు నేర్చుకొనునది శూన్యము, వాని చిత్తసంస్కారమంతయు ధ్వంసమగును—ఫలితము, అశ్రద్ధ. వేదవేదాంతముల కన్నిటికిని కీలకమగు శ్రద్ధ—నచికేతుని యముని యెదుట నిల్పి, యాతనిఁ బ్రశ్నింపఁజేసిన శ్రద్ధ—లోకగమనమునకును లోకసంస్థితికిని మూలమగు శ్రద్ధ—యిట్టి శ్రద్ధ నశించుట సంభవించుచున్నది! "అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి†—అజ్ఞుఁడును శ్రద్ధావిహీనుఁడును సంశయాత్ముఁడును వినాశము పాలగుదురు." కావున మనము వినాశమున కతిసన్నిహితులమైయున్నాము. విద్యావ్యాప్తియే యిందుల కిప్పుడు నివారణోపాయము. మొట్టమొదటి దాత్మజ్ఞానము. ఈ మాటవలనఁ దోఁచునట్టి జటాజూటములు, దండకమండలువులు, కొండగుహలును నని నా యభిప్రాయము కాదు. ఇఁకనేమని నా యభిప్రాయము? సంసారబంధ

* కఠోపనిషత్తు, 1-3-4.

† భగవద్గీత, 4-40.

విమోచనము చేయఁజాలునట్టి జ్ఞాన మైహికసంపదలను గలుగఁ జేయఁజాలదా? నిస్సందేహముగాఁ గలుగఁజేయఁ గలదు. మోక్షము, విరక్తి, త్యాగము—నివన్నియు మహోత్తమాదర్శములు. కాని "స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ *—స్వల్పమైన ధర్మాచరణమైనను మహా (సంసార) భయమునుండి రక్షించును." ద్వైతి, విశిష్టాద్వైతి, అద్వైతి, శైవుఁడు, వైష్ణవుఁడు, శాక్తేయుఁడు, తుదకు బౌద్ధుఁడు, జైనుఁడు తదితరుఁడు—వీరిలో నెవ్వరు గానిండు,—భారత దేశమున నేమి సంప్రదాయస్థులు వెలువడిరో వారందఱును జీవాత్మయం దఖండశక్తి యిమిడియున్నదని యంగీకరించుచున్నారు; వ్యక్తీకరణమునఁ దారతమ్యముండుఁగాక, పిపీలికాది బ్రహ్మపర్యంతము నెల్లరయందును నొక్కే యాత్మ వెలయుచున్నది. "నిమిత్తమప్రయోజకం ప్రకృతీనాం వరణభేదస్తు తతః క్షేత్రికవత్ †—సత్కర్మములును దుష్కర్మములును స్వయముగఁ బ్రకృతియొక్క మార్పులకుఁ గారణములు కానేరవు. కాని యవి ప్రకృతి పరిణామముల యాటంకములను దొలఁగించును. వ్యవసాయి ప్రవాహమున కాటంకములను దొలఁగించిన తోడనే స్వాభావికముగా నీరు పొలములోనికిఁ బ్రవ

* భగవద్గీత. 2-40.

† పాతంజలయోగసూత్రములు, కైవల్యపాదము, 3. మూలమున స్వామి యీ సూత్రము నుదాహరింపక, భావమునుమాత్రమే తెలిపెదిగా సూచించియున్నాఁడు; అది యిచట వివరింపఁబడినది.

హించునుగదా!'' సముచిత దేశకాలపాత్రములు లభించినంతనే యీ యఖండశక్తి ప్రకాశించుచున్నది. బ్రహ్మాది స్తంబపర్యంతము సర్వమునను వ్యక్తమైయున్నను, అవ్యక్తమైయున్నను ఒకేశక్తి నెలకొనియున్నది. ప్రతివ్యక్తి వద్దకును వెడలి జనులందు మన మాశక్తిని విజృంభింపఁ జేయవలసియున్నది.

...(జనసామాన్యమున విద్యావ్యాప్తి నిమిత్తము నెలకొల్పఁబడు) ముఖ్యకేంద్రములలోఁ గ్రమముగా వ్యవసాయము, పరిశ్రమలు మొదలగునవి నేర్పఁబడుటయేగాక, శిల్పాభివృద్ధినిమిత్తము కర్మాగారములు స్థాపింపఁబడును.

...జ్ఞానదానమును గాంక్షించుచు నైరోపా, యమెరికా ఖండములు భారతదేశముదెస వీక్షణములను బఱపుచున్నవి ఇదియే . లోకహితాచరణమునకు సమయము, ఇదియే శత్రువర్గముల నాక్రమించుటకు సమయము.

...భారతఋషీశ్వర ప్రకటిత ధర్మతత్త్వములను భారతీయనారి భారతీయవేషమున వెడలి ప్రచారము చేయుచోఁ, పాశ్చాత్యలోకమును ముంచియెత్తు ధార్మిక మహోత్తుంగ తరంగము బయల్వెడలును ఇయ్యది నాకు గోచరించు దివ్యదృశ్యము. మైత్రేయి, ఖానా, లీలావతి, సావిత్రి, ఉభయభారతి మున్నగు నారీమతల్లులను గన్నతల్లియైన భారతదేశమున నీ కార్యమొనరింప సాహసించు స్త్రీ లెవ్వరు నుండరా?...మనము ఇంగ్లాండు దేశమును జయింపవలయును, ఆధ్యాత్మికశక్తివలన నింగ్లాండు మన

యధీనము కావలయును. "నాన్యః పన్థా విద్యతే అయనాయ మఱియొక మార్గములేదు." సభలవలనను సంఘములవలనను ముక్తి చేఁజిక్కునా! మన యాధ్యాత్మికశక్తివలన మన విశేషతలను మనము దేవతలుగా మార్చవలయును.... ఇంగ్లాండ్, యిరోపా, అమెరికాదేశములను జయించుట— ఇదియే నేఁడు మన మహామంత్రము కావలసియున్నది, ఇందే దేశాభ్యుదయము నెలకొనియున్నది. వికాసమే జీవన లక్షణము, మన యాధ్యాత్మికాశయములతో లోకమున మనము వ్యాపింపవలయును. ఆహా! ఇది బలహీనమైన శరీరము, పైఁగా వంగదేశీయుని శరీరము; ఈపాటి పరిశ్రమ వలన నొక ఘోరవ్యాధి దీనికి సంక్రమించినది, ఐనను నాశ లేకపోలేదు—

శ్లో॥ "ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా,
కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ"

(భవభూతి)

(అపారమైనకాలమున, బహుజననివాసమైన వసుంధరయం దీకార్యమును గొనసాగించుటకై సమానధర్ముఁ డుద్భవించియున్నాఁడు, లేనిచో నుద్భవింపఁగలఁడు.)

శాకాహారమునుగూర్చి నేఁ జెప్పవలసిన దిది, నాగురుదేవుఁడు శాకాహారి యనునది మొదటివిషయము. కాని దేవికి నివేదింపఁబడిన మాంసము నాతని కొసఁగిన పక్షమున దానిని శిరమున కద్దుకొని స్వీకరించువాఁడు. ప్రాణహాని పాపమే, సందియము లేదు; కాని రసాయన

శాస్త్రాభివృద్ధిమూలమున శాకాహారమును మానవశరీరమునకు సరిపడునట్లు చేయఁబడకుండునంతవఱకు మాంసాహారముకంటె నత్యంతరము లేదు. నేఁటిపరిస్థితులతో మానవుఁడు రాజసిక జీవనము గడపవలసియున్నంతవఱకు మాంసాశనముకంటె వేఱు మార్గము లేదు. మరణదండనచే జనులను భయపెట్టి, యశోకచక్రవర్తి లక్షలకొలఁది జంతువుల ప్రాణము కాపాడెననుమాట నిజమే. కాని వేయేండ్ల దాసిసత్వ మంతకంటె ఘోరతరము కాదా! కొన్ని మేఁకల ప్రాణము తీయుటయా, లేక భార్యాపుత్రికల ప్రాణమును గాపాడుకొనఁజాలకుండుటయు, దోపిడిగాండ్ర చేతులనుండి బిడ్డల పోషణార్థ మన్నమును రక్షించుకొనఁజాలకుండుటయునా? వీనిలో నేది విశేష పాపకృత్యము? ఇంతకంటెఁ గాయకష్టమువలన జీవనోపాధి నార్జించుకొనని యుగ్రవర్ణజాలు పదిమందియు మాంసాహారము తినకుందురుగాక, కాని యహర్నిశము కష్టపడి పనిచేసి యన్నము సంపాదించుకొనవలసియున్న వారిని బలవంతపెట్టి శాకాహారులను జేయుట మన దేశస్వాతంత్ర్య నాశనమునకుఁ గల హేతువులలో నొకటి. మంచి పుష్టికరమగు నాహార మేమి చేయఁగలదో జపానును జూచిన బోధపడును. సర్వశక్తిమయియగు విశ్వేశ్వరి మీకు మహోదారాశయములను గలిగించుఁగాక!
—వివేకానందుఁడు.*

* ఈ లేఖ శ్రీమతి మరళా ఘోషాల్ అను విదుషీమణికి వ్రాయఁబడినది.

88

డార్జిలింగ్, 28-4-1897

స్నేహితుఁడ—,... దేశమంతయు నేకీభవించి నా కిచట స్వాగత మొసఁగెను. ప్రతిచోటను లక్షలకొలఁది జనుల హర్ష ధ్వనులు, జయజయధ్వానములు, ప్రభువులు నా శకటమును మూఁపున వహించుటలు, ముఖ్యపట్టణవీథులం దంతటను దివ్యస్వాగత వాక్యాలంకృత తోరణములు, ఇంకను నేమేమో!!!...

పాపము,—ఈపాటికి అమెరికా చేరెనని తలంతును! శుద్ధ దురభిమానగ్రస్తుఁడు తన క్రైస్తవమత బోధచే భారతీయుల నాతఁ డుద్ధరింపవచ్చెను. అతని బోధల నెవ్వఁడును చెవియొగ్గి వినలేదఁట! కాని వారాతనియెడ విశేషాదరముఁ జూపిరి. అందులకుఁ గారణము నా లేఖయేసుమీ. కాని యాతనికి వివేకమును గలుగఁ జేయఁజాలనైతిని! ఆతఁడు విచిత్రవ్యక్తివలెఁ గనిపించుచున్నాఁడు. నా స్వదేశాగమన సందర్భమందలి జాతీయోత్సాహమును నుత్సవములను జూచి యాతఁడు మనోవైకల్యము నొందెనని వింటిని....ఆధ్యాత్మిక విషయములలో భారతదేశము నెదుట నిలువఁగలిగిన దేశము ప్రపంచమున మఱి లేదు; అది యేమి చిత్రమో కాని క్రైస్తవదేశమునుండి యిచటికి వచ్చు వ్యక్తులందఱను బురాతనమైన పిచ్చి యభిప్రాయమొకటి యావేశించియున్నది. క్రైస్తవు లధికారవంతులు, ధనవంతులు నఁట, హిందువులు కారఁట; అందుచే హిందూమతముకంటెఁ గ్రైస్తవమతము మిన్నయైయుండవలయునని వారి వాదము. సరిగా నీ

హేతువుచేతనే హిందూమతము ధర్మమనిపించుకొనఁదగు ననియుఁ గ్రైస్తవమతము తగదనియు హిందువులు తగినట్లు వారికి సమాధానము చెప్పుదురు. ఇంతకును నీ మర్త్య లోకమున మోసమే యెప్పుడును ముందునకు వచ్చునది, సౌజన్య మెప్పుడును దెబ్బతినుచుండును, నాకిట్లు తోఁచు చున్నది — భౌతికవిజ్ఞానమునఁ బాశ్చాత్యు లెట్టి ఘనత వహించినను పారమార్థికవిషయములలో వారికింకను నక్ష రాభ్యాసము కాలేదు. భౌతికవిజ్ఞానము క్షణిక భౌతిక సంపత్తి హేతువు, పరవిద్య శాశ్వత బ్రహ్మానందదాయకము. అమృతత్వమను నది లేదనుకొన్నను, ఆదర్శములుగా గ్రహింపఁబడిన యాధ్యాత్మికాశయములచేఁ గలుగు నను భవము బహుసూక్ష్మము, విశేషానందదాయకమునై యొప్పును, లౌకిక చింతావ్యాప్తమో, ఆర్పరాని తృష్ణను స్పర్థను బుట్టించి, తుదకు వ్యక్తిని సంఘమునుగూడ నశింపఁ జేయును.

ఈ డార్జిలింగు మనోహరమైన ప్రదేశము, (28,146 అడుగుల యెత్తున) మహావైభవాన్వితమై యొప్పు కాంచన గంగ మేఘము లెడ మిచ్చుచో, నప్పుడప్పుడు కాన్పించు చుండును, మఱియు (29,001 అడుగుల యెత్తగు) గౌరీ శంకర (శిఖర) మును సమీప పర్వతాగ్రమునుండి చూచా యగాఁ గనవచ్చును....

నాకిచట హాయిగా నున్నది, సమతలములకు వచ్చి మనుట యనిన యమయాతన, గడప దాఁటి కాలు వీథిలోఁ

పెట్టితినా, నన్ను విస్తారముగాఁ జూడవచ్చు జప సమూహము!! ప్రఖ్యాతి యనునది నిర్విచారముగా నను భవించుచుఁ గూర్చుండుటకుఁ దగిన వస్తువు కాదు!! కేశములు నెరియుచున్నవి కావునఁ బెద్దగడ్డము పెంచఁబోవుచున్నాను. అది గౌరవనీయమైన యాకృతిని గలుగఁజేసి యెవరినైనను నమెరికాదేశపుటపవాదకులనుండి కాపాడును! ఓ పలిత కేశములారా! మీరెన్నిదోషములనైనను గప్పిపుచ్చఁ గలరు, మీకు జయము!

తపాలాసమయము దాఁటుచున్నది, కావున ముగించు చున్నాను. సన్మనోరథములు, చిరాయురారోగ్యములు, సమస్తశుభములును నీ కొనఁగూడుఁగాక!

అమ్మయు బాబును మీరందఱును నా కఖండ ప్రేమాస్పదులని గ్రహింపుఁడు,—వివేకానందుఁడు.

89

కలకత్తా, 5 5 1897.

అభిన్నహృదయ ,... నేను మఱికొన్ని సంవత్సరములు జీవించినను, జీవింపకున్నను సరియే భారతదేశ మీ వఱకే రామకృష్ణునిది.

* * *

అసహ్యమైన యీ నవీన హిందూమతము (Modern Hinduism) అనఁబడునది మూలఁబడిన బౌద్ధమతముకంటె మఱియొకటి కాదని నా దృఢనిశ్చయము. ఈసంగతి స్పష్ట ముగా హిందువులను గ్రహింపనిండు, కిక్కుఱుమనకుండ,

వారు దాని ననాయాసముగా విడనాడఁగలుగుదురు. కాని పూర్వము బుద్ధుఁడు బోధించిన ధర్మమనినను బుద్ధుఁడనినను నా కఖండగౌరవము, హిందువులమగు మన కాతఁ డవతారమూర్తియగుట యీ రెంటఁగల విషయమే. సింహళము లోనున్న బౌద్ధమతమైనను సరియైనది కాదు. నేను సింహళము వెళ్లినప్పుడు నా భ్రమ పూర్తిగాఁ దొలఁగినది. అచట సజీవులై యున్న జనులు హిందువు లొక్కరే. బౌద్ధులందఱును నాచారవ్యవహారములలో విశేషముగా వైదేశిక సంప్రదాయముల నవలంబించినారు....ఎల్లెడలను "కసాయిదుకాణములను" నెలకొల్పుటయే తమ పరమధర్మమగు నహింసయెడ బౌద్ధులు చూపుచున్న గౌరవభావము!...

అమెరికాలో నేనొక వ్యక్తిని, ఇచటఁ గేవలము మఱియొక వ్యక్తిని. దేశమంతయు నిచట నన్నుఁ దన ప్రమాణ పురుషునిగాఁ బరిగణించుచున్నది—అచటనో, విశేషముగా దూషింపఁబడిన ప్రచారకుఁడను. ఇచట ప్రభువులు నాశకటమును మూఁపున వహింతురు, అచటనో, శుభ్రమైన హోటలు (Hotel) లోనికిఁ గూడ నన్ను రానిచ్చువారు కారు. కాఁబట్టి యిచటి నామాటలు—కొలఁదిమంది కెంత యరుచిగాఁ దోఁచినను—దేశక్షేమాదిష్టములై యుండవలయును....

...గమనింపుఁడు, భారతదేశ మీనాఁటికే రామకృష్ణునిది; హిందూ ధర్మసంస్కారణార్థము నా యుద్యమమును గొంత కట్టుదిట్టము చేసినాను.—వివేకానందుఁడు,

90

అల్మోరా, 29-5-1897.

సహృదయ—,...ఉదయ సాయంసమయములందు గుఱ్ఱపు స్వారీరూపమున విశేషమైన వ్యాయామము నారంభించి నాను. నాఁటినుండియు నిజముగా శరీరస్థితి బాగుపడినది.... నాకిపు డఖండబలము చేకూఁరినది. హిమాలంకృతములగు పర్వత శిఖరముల ప్రోల పద్మాసనస్థుఁడనై,—

శ్లో. న తస్య రోగో న జరా న మృత్యుః,
ప్రాప్తం హి యోగాగ్నిమయం శరీరమ్.*

అను నుపనిషద్వాక్యము నుచ్చరించుచు ధ్యానస్థితుఁడ నగు నన్ను, డాక్టరుగారూ! మీ రొకసారి వచ్చి చూచిన నే నెట్టి స్థితిలో నున్నానో తెలియఁగలరు... —అప్పుఁడు, భగవదేకశరణుఁడు, వివేకానందుఁడు.

91

అల్మోరా, 30-5-1897.

మహాశయ—...అట్టి భగవానుని—అవతారమూర్తిని—నా జీవితమునఁ గాంచియున్నాను, అతని యాజ్ఞలను బాలించుటకే జీవించియున్నాను. పరిమిత జ్ఞానవంతులై హేత్వాభాసములతో, భ్రమలతో, అభిజాత్యములతో, అసూయాద్వేషములతోఁ, గూడినవారివలన స్మృతులును బురాణములును వెలువడినవి. ప్రేమను, ఔదార్యమును

* "యోగాగ్నిమయమగు శరీరముఁగల యోగికి రోగ జరా మరణ దుఃఖము లేవియూ సమీపింపఁజాలవు."

—శ్వేతాశ్వతరోపనిషత్తు, 2. 12.

ప్రకటించు భాగములు మాత్రమే యుండుండి స్వీకరింపఁ దగినవి, మిగిలినవి త్యాజ్యములు. ఉపనిషత్తులు, గీత— ఇవియే నిజమైన శ్రుతులును, ప్రామాణిక శాస్త్రములును. రాముఁడు, కృష్ణుఁడు, బుద్ధుఁడు, చైతన్యుఁడు, నానక్, కబీరు—ఇత్యాదులే నిజమైన యవతారమూర్తులు; ఏలన వారిహృదయము లాకసమువలె సువిశాలములు, జగద్వ్యాప్తములు;—అందుచేతనే నిన్న రామకృష్ణుఁడు, రామానుజుఁడు, శంకరుఁడు మొదలైనవారు విశేషసంకుచిత దృష్టితోఁ గూడిన కేవల పండితులని తోఁచుచున్నది. పండితుని శుష్కపాండిత్య ప్రకర్ష—హూదాపుడిగాఁ దానొక్కఁడే మోక్షపదవిఁ బొందవలయునని యాకాంక్ష! కాని, అయ్యా, అది సాధ్యమా? ఎన్నఁడైనను నట్టిది సంభవమయ్యెనా, ముందుఁ గాఁగలదా? అహంభావావేశమున్నంతవఱ కేమైనను ప్రాప్తించునా?

మఱియొక యసందర్భము: జాతిభేదములు జనులలో లేనిపోని భేదభావమునకుఁ గారణమని— మాయామూలమని—జన్మముపై నాధారపడినది కానిండు, గుణకర్మములపై నాధారపడినది కానిండు — సమస్తమైన జాతివిభజనయును బంధహేతువని—నానాఁటికి నాకు బాగుగా ధ్రువపడుచున్నది. కొందఱు మిత్రు లిట్లు హితోపదేశము చేయుదురు: "నిజమేనోయి, దానినంతను నంతరంగమున నుంచుకొనుము, బయట వ్యావహారిక జగత్తులోమాత్రము జాతిభేదములు తప్పక పాటింపబడవలయును."...అంత

రంగమున నైక్యభావము (బలవంతముగాఁ దెచ్చి పెట్టుకొనినదని భావము); బయట ఘోరరాక్షస తాండవము దారుణహింస కొను, పేదలపాలిటి యముఁడు కాని 'యస్పృశ్యుఁడు' ధనికుఁడైన పక్షమునను, "ఓహో, యాతఁడు ధర్మరాజు!"

వీని యన్నిటికంటెను నియమములును నిష్ఠలును శూద్రున కుద్దేశింపఁబడినవి కావని నా చదువులవలన నాకుఁ దెలియుచున్నది; ఆహారవిషయమునఁగాని, విదేశయాత్రావిషయమునఁగాని, శూద్రుఁడు విచక్షణ చేసినచో, నది నిష్ప్రయోజనము, వ్యర్థకాలక్షేపము. శూద్రుఁడను, మ్లేచ్ఛుఁడనునగు నాకా గొడవలతోఁ బనిలేదు. మ్లేచ్ఛాహారమైన నాకేమి, చండాలాహారమైన నాకేమి! జాతిభేదాదిమతిభ్రమములు మతాచార్యబ్రువులు వ్రాసిన గ్రంథములలోనే కాని భగవదావిష్కృతములగు వానిలోఁ గనఁబడవు. మతాచార్య బ్రువులను వారి పూర్వులు చేసిన ఘనకార్యముల ఫల మనుభవింపనిండు, నే నీశ్వరాదేశము ననుసరింతును, నాకదియే శ్రేయస్కరము.

నేను గ్రహించిన మఱియొక తత్త్వమిది: పరహితార్థమగు సేవయే పరమధర్మము, మిగిలిన కర్మకలాపములన్నియు మతిభ్రమములు స్వీయమోక్షమునకై ప్రాఁకులాడుటయుఁ దప్పు, పరహితార్థము సర్వము సమర్పించువానికే మోక్షము, "నాముక్తియో, నాముక్తియో" యని దేవులాడువా రిహపరభ్రష్టులై తిరుగాడుచుందురు.—

ఇది చే ' ననేకపర్యాయములు ప్రత్యక్షముగాఁ గాంచియున్నాను. ఈ చిల్లర విషయముల నన్నిటిని గూర్చియు నాలోచించుచుండ మీకు లేఖవ్రాయ మనసు రాలేదు. ఈ యసందర్భము లన్నియు నిటులున్నను నాయెడ మీ యనురాగము చలింపనిచో నది నా కాహ్లాదకరము.* మీ

వివేకానందుఁడు.

92

అల్మోరా, 1 6 1897.

మహాశయ, వేదములనఁగా సంహితలని మనము భావింపఁ

గలిగినచో వేదవిషయమున మీరు చేసిన యభిక్షేపము చెల్లును. వేదమను శబ్దము సంహితలు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు నను మూడు భాగములకునుకూడ నన్వయించును. భారత దేశమున నిదియే సర్వజన సమ్మతమైన యభిప్రాయము. ఇందు సంహితలు బ్రాహ్మణములు నను మొదటి రెండు భాగములును కర్మకాండాత్మకము లగుటచే నించుమించుగా నలక్షితములై సమస్త తత్త్వజ్ఞులచేతను సంప్రదాయ కర్తలచేతను నుపనిషత్తులే ప్రమాణభూతముగా స్వీకరింపఁబడినవి.

* మహాపండితుఁడు, పూర్వాచార పరాయణుఁడునగు శ్రీ ప్రమదాదాసమిత్రున కిది స్వామి వ్రాసిన కడపటి లేఖ. స్వామి తనయాశయములయెడ మిత్రుని సానుభూతిని సమన్వయదృష్టినిఁ గాంక్షించుటయే యాంతరంగికమైన యీ లేఖయం దించుక కఠిన వాక్యములను గొంతవఱ కతిశయోక్తులను బ్రయోగించుటకుఁ గారణమని తోఁచుచున్నది.
అనువాదకుఁడు.

సంహితలు మాత్రమే వేదము లను భావము మొన్న మొన్నటిది — దయానందస్వామి దానిని వెలువరించి యున్నాఁడు. సనాతనుల కిది యెంతమాత్రము మాన్యము కాలేదు.

సంహితలకు తన నూతన వ్యాఖ్యానము నాధార ముగాఁ గొని వేదమున కంతటను సమంజసమై యనువర్తించు నొక సిద్ధాంతమును గనుఁగొందమను తలంపున దయానంద స్వామి యీ మార్గమును ద్రొక్కెను, కాని చిక్కులెప్పటివే, అవి వచ్చి బ్రాహ్మణముల పైఁ బడినవి. ప్రక్షిప్త వాదము, వివరణవాదము మొదలైన వాదము లెన్ని బయలు దేఱినను సమన్వయింపవలసిన భాగ మింకను గావలసినంత యున్నది.

సంహితల నాధారముగా గ్రహించి సుసంగతమైన మత మును స్థాపించుట యనునది సాధ్యమైనచో, నుపనిషత్తుల నాధారముగాఁ గైకొని సుసంగతము, శ్రుతిసంప్రదాయ ములకవిరుద్ధమునగు మతమును స్థాపించుట యంతకంటె వేయిరెట్లు సులభతరమని నా నిశ్చయము; మఱియు నిందు శిష్టజనసమ్మతమైన యభిప్రాయమునకు విరోధమేమియుఁ గలుగదు. పూర్వాచార్యులందఱు నిందు మాతో నేకీభ వింతురు; మఱియు నూతన వికాసమునకు విశేషమైన యవకాశము గలుగును.

హిందూ ధర్మమున కీవఱకే గీత యత్యంత ప్రామా ణిక గ్రంథమై యున్నది. గీత కట్టి పరిపూర్ణమైన యర్థ

తెయుఁ గలదు: కాని కృష్ణుని వ్యక్తిత్వమతిగూఢమై యస్పష్టమై యుండుటవలననే యా జీవితమునుండి ప్రాణ ప్రదమగు భావములను గ్రహించుట దుస్తరము. మఱియు నూతనచైతన్యమును నూతన దృక్పథములును ప్రస్తుత యుగమున కావశ్యకములై యున్నవి. ఈ మార్గమునఁ బర్యాలోచించుటకు మీ కీలేఖ తోడ్పడునని నమ్ముచున్నాను. ఆశీర్వాదములు.—మీ వివేకానందుఁడు.

## 93

### సంస్కృతమునుండి యనువాదము

### ఒకశిష్యునకు

అల్మోరా, 1-6-1897.

...ఈ శ్లోకార్థమునకు * నీవు శంకరు ననుసరింపవలయును.

లేదా, ఈ క్రింది విధముగా నర్థము చెప్పవచ్చును :-

పెద్ద పెద్ద భూభాగములు జలమయములై యున్నను చిన్న కొలఁకులు దప్పిగొనినవాని కెట్లు మహోపయుక్తములో —(అనఁగాఁ గొంచెము నీరే తనకుఁ జాలుటచే వాఁ డిట్లు చెప్పవచ్చును, "ఈ పెద్ద జలాశయము నటుండ నిమ్ము, కొంచెము నీరే యా యక్కఱను దీర్చును.")— అట్లే

* శ్లో. యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః.
—గీత, 2. 46.

విద్వాంసుఁడగు బ్రాహ్మణునకు సమస్త వేదములు నా ప్రయోజనమునే నెఱవేర్చును. నేలయంతయు జలమయమై యుండఁగాక, తనకు వలయునది నీరు త్రాగుటయే యైయుండునట్లు సమస్త వేదములందును తత్త్వజ్ఞానమే పడయఁదగినది.

ఈ శ్లోకాభిప్రాయమునకు విశేషానుగుణమగు మఱియొక వివరణము తెలిపెదను :

నేలయంతయు జలమయమైయున్నను పానయోగ్యమగు నీటినే జను లన్వేషింతురు. భూమి జలావృతమై యుండఁగానే — ఆధారభూతమగు నేలను బట్టి వేర్వేఱు ధర్మములు గల వేర్వేఱు జలము లుండవచ్చును. అట్లే నిపుణుఁడగు బ్రాహ్మణుఁడును సంసారపిపాసానివృత్త్యర్థము నానావిద్యాసమన్వితమైన వేదములనెడి శబ్దసాగరమునుండి యేది మోక్షమును బ్రాపింపఁజేయఁగలదో, యట్టి విద్యనే గ్రహించును. బ్రహ్మవిద్యయే గదా మోక్షదాయకము. ఆశీస్సులు, శుభాకాంక్షలు,—వివేకానందుఁడు.

94

అల్మోరా, 3-6-1897.

శ్రీ ప్రతీక్షాజన—, . . . నామట్టునకు సంతృప్తుఁడనై యున్నాను. దేశీయులలో ననేకులను మేల్కొల్పినాను. అదియే నాకు వలయునది. కర్మానుసార మింక నేమి జరిగినను సరియే. నేను బంధవిముక్తుఁడను, సంసారధోరణి గమనించినాను— "మనకాయుష్యము, మనకారోగ్యము." తనకే యాయువు, తనకే ప్రేమ, తనకే ప్రతిష్ఠ, అంతయుఁ దనకే, తనకొఱకే.

దృష్టి సారించి వెనుకకుఁ జూతునుగదా, స్వార్థపరమైన కార్యమేదియు నాకు గోచరించుటలేదు — నా దుష్కృతములు సైతము నా నిమిత్తము చేసినవి కావు. కావున నేను సంతృప్తుఁడను, నే నేమియో ఘనకార్యములుగాని, విశేష సత్కార్యములుగాని చేసియుంటినని కాదు, ప్రపంచమత్యల్పము, సంసారమతి నికృష్టము, మనుగడ యతి హేయము మానవులు, యుక్తాయుక్తులు, అతినికృష్టమగు నీ స్వప్రయోజనము నిమిత్తము దొర్లాడుచుండుటఁ జూచిన నాకు నవ్వు వచ్చుచుండును.

విషయమిది : మన మొక బోనున బంధితులమై యున్నాము, ఎంత శీఘ్రముగాఁ దప్పించుకొనిన నంత మంచిది. బ్రహ్మానుభూతి నందినాను, ఇఁక శరీర మెటు కొట్టుకొని పోయిన నాకేమి?

* * *

ఏకాంతముగాఁ బ్రశాంతముగా, గ్రంథావలోకన మొనరించుచుఁ బండితుఁడనై మనుట నా సహజ ప్రవృత్తి. కాని యమ్మ వేఱువిధముగా నడపుచున్నది ఐనను చిత్తవృత్తి యదియే.—అప్పుఁడు, వివేకానందుఁడు.

**95**

అల్మోరా, 14 6 1897.

స్నేహాస్పద, (విక్టోరియా) మహారాణికిఁ బంపఁబోవు సభినందన పత్రికలో నీ క్రింది విషయములను గమనించెదు గాక.

1. అతిశయోక్తు లుండరాదు, అనఁగా నామె భగవత్ప్రతినిధియని, మఱియేమేమోయని, మన దేశీయులకుఁ బరిపాటియగు నతిశయోక్తు లుండరాదు.

2. ఆమె పరిపాలనమున సర్వమతములును సురక్షితములైయుండ, స్వదేశమునను నింగ్లాండునందునుగూడ నిర్భయముగా మన వేదాంత తత్త్వములను ప్రచారము చేయఁ గలిగితిమి.... —మీ వివేకానందుఁడు.

96

ఆల్మోరా, 15-6-1897.

అభిన్నహృదయ—....ఔదార్యమే, జయించునది, నీశక్తి కాదు. పుస్తకములు, పాండిత్యము, యోగము, ధ్యానము, జ్ఞానము — నివన్నియుఁ ప్రేమతోఁ బోల్చిచూచినచోఁ దృణప్రాయ మనిపించును, ధూళి యనిపించును. ప్రేమయే నీకు దివ్యశక్తులను జేకూర్చును, ప్రేమయే భక్తి నొసఁగును, జ్ఞానము నొసఁగును; ప్రేమయే ముక్తి నొసఁగూర్చును, మానవుఁడనెడి యాలయమున మాధవు నుపాసించుటయే యుపాసన—"నేదం యదిద ముపాసతే—జను లుపాసించు భగవదితర విషయము లుపాస్యములు కావు."...

...ఇట్టి యుద్యమమును సాగింపుము, నిన్ను నా భుజములపై నెత్తుకొని మోయుదును—సెబాసు! చూతువుగాక—క్రమముగాఁ బ్రతి జిల్లాయును నొక కేంద్రమై—వెలయును...నేను యోధుఁడను, యుద్ధరంగమున మరణిం

తీను. ఇచట రాణీవాసస్త్రీవలె నూరక కూరుచుండుట నాకుఁదగదు.... — అప్పుఁడు, వివేకానందుఁడు.

97

## ఒక యాంగ్లేయ మిత్రునకు

ఆల్మోరా, 20-6-1897.

...ఒక విధముగాఁ జూచినయెడల నిచటి జనులకుఁ ద్యాగము చేయుట కేమియు లేదనుమాట వాస్తవము— ఐనను, త్యాగము భారతీయుల రక్తనాళములలో స్పందించుచున్నది. మతమున శిక్షణము నొందుచున్న వత్సలలో నొకఁడు డిస్ట్రిక్ట్ ఎగ్జిక్యూటివ్ ఎంజినియరు (District Executive Engineer) అనఁగా నిచట నది గొప్పపదవి. దాని నాతఁడు తృణప్రాయముగాఁ బరిత్యజించినాఁడు!

98

ఆల్మోరా, 20-6-1897.

ప్రేమాస్పద—,...గుఱ్ఱపు స్వారిలో మంచి నైపుణ్యము సంపాదించుచున్నాను, బాధగాని, యలసటగాని లేశమును బొందక యెకాయెకీ నిరువది, ముప్పది మైళ్లదూరము స్వారిచేయఁగలుగుచున్నాను....

...వంగభాషలోనున్న మంచిమంచి విజ్ఞానశాస్త్ర గ్రంథములను (Scientific books) అన్నిటిని గొని వానిని పఠింపుఁడు. —మీ ప్రియసోదరుఁడు, వివేకానందుఁడు.

99

ఆల్మోరా, 30 6 1897.

ఆయుష్మంతుఁడగు నఖండానందునకు ...మన మూర్ఖులెంత సేపు జనుల నెరసులనే వెదకెదరు, ఈ ఛంద్రాన్వేషణము మాని, కొలఁదిగా సుగుణములను గూడ వారు గ్రహింతురుగాక.

...రాజకీయ విషయములలో నెంతమాత్రము జోక్యము కల్పించు కొనకుము, ఐనను నెవ్వరితోడను నీవు వివాదపడ నక్కఱలేదు. కార్యసాధనార్థము నీవు త్రికరణశుద్ధిగాఁ బనిచేయవలయును.

ఇచట నేను...ఆంగ్లమున నొక యుపన్యాసమును ...హిందీలో మఱియొక యుపన్యాసమును జేసినాను....

...శరీర మెప్పుడో యొకప్పుడు నశింపక తప్పదు. అగుచో నలసులమై గతింపనేల? "త్రుప్పుపట్టి చెడిపోవుట కంటె నఱిగిపోవుట మేలుకదా?" ఆందోళనపడకు, నేను గతించినను నాయస్థులే స్వయముగా నద్భుతకార్యములను జేయఁగలవు. పదియేండ్లలోపున మనము భారతదేశమంతటను వ్యాపింపవలయును, లేనియెడల లాభములేదు. రాక్షసునివలెఁ బని చేయవలయును! జయ గురుదేవ! ధనాదులు వానియంతట నవియే వచ్చును, మనకుఁ గావలసిన వారు మనుష్యులు, ధనము కాదు....—నీ ప్రియసోదరుఁడు, వివేకానందుఁడు.

# 100

## సంస్కృతమునుండి యనువాదము

## ఒక శిష్యునకు

ఆల్మోరా, 3 7 1897.

శ్లో. యస్య వీర్యేణ కృతినో వయం చ భువనాని చ,
రామకృష్ణం సదా వన్దే శర్వం స్వతన్త్రమీశ్వరమ్. *

ఆయుష్మంతుఁడవగు శరచ్చంద్రా!

ఉద్యోగశీలురుకాని శాస్త్రకారులందఱును విధియే బలీయమందురు; ఉద్యోగవంతులును కర్మకుశలులు నగువారో, పురుషకారమునే శ్రేష్ఠముగా నెంతురు. పురుషకారమును దుఃఖప్రతీకారోపాయముగాఁ దలఁచి దానిపై నిర్భరపడువారు కొందఱు; దైవబలముపై నాధారపడి యుండువారు మఱికొందఱు. ఈ యుభయపక్షములవారి వివాదమును కేవల మజ్ఞానజనితము ఇట్లు గ్రహించి మహోన్నత జ్ఞానశిఖరము నధిరోహింపఁబూనుము.

...కావున స్వతస్సిద్ధముగా జీవేశ్వరు లభిన్నులు. జీవసేవ, ఈశ్వరప్రేమ ఇవి రెండును నొక్కటే. విశేష మేమన, జీవుని జీవబుద్ధితో సేవించినయెడల నది దయ, ప్రేమ కాదు. ఆత్మబుద్ధితో జీవుని సేవించినచో నది ప్రేమ.

---

* ఎవ్వని ప్రభావమున లోకములు, మనమును ధన్యులమైతిమో యట్టి స్వతంత్రుఁడు, సర్వుఁడు, మంగళస్వరూపుఁడు నగు శ్రీరామకృష్ణునకు సదా ప్రణామములు.

ఆత్మయే ప్రేమాస్పదమని శ్రుతిస్మృతి ప్రత్యక్షాది ప్రమాణము లన్నిటివలనను దెలియుచున్నది. కావున చైతన్య భగవానుఁడు, "ఈశ్వరునియెడఁ ప్రేమ" యనియు, "జీవుని యెడ దయ" యనియు నుపదేశించియుండుట యుక్తమే. ఆయన ద్వైతవాది. కావున జీవేశ్వర భేదమును సూచించు నాతని యీ సిద్ధాంతము సమీచీనముగనే కానిపించును. కాని యద్వైతనిష్ఠులమగు మనకు జీవుఁ డీశ్వరునికంటె భిన్నుఁడనుబుద్ధి బంధకారణము ; కావున మన కవలంబనీయము ప్రేమ, దయ కాదు. జీవుని విషయమున దయ యను మాట నాకు సాహసపూర్వకముగను నహంభావ సంజనితముగను దోఁచును. మనము దయ చూపుటలేదు, కాని సేవించుచున్నాము. ఒరులయెడ ప్రేమ, సర్వత్ర యాత్మానుభవము—ఇదియే మన యనుభవము—అంతియే కాని కనికరము కాదు.

...—శాశ్వత ప్రేమబద్ధుఁడు, వివేకానందుఁడు.

101

ఆల్మోరా, 9-7-1897.

స్నేహాస్పద—,...నా క్షేమమునుగూర్చి మీరు భయపడ నక్కఱలేదు. నాయపవాదకు లెంత గగ్గోలు చేసినను సువిశాలమగు నీ విశ్వమున నాకుఁ చావు లేకపోలేదు. ఏమైనను నా యుద్యమము నాకుఁ దృప్తికరముగా నున్నది. ప్రాప్తానుసారము వర్తించితినేకాని యీ కార్యమిట్లు జరుగ వలయునని సంకల్పించిన వాఁడనుగాను. భారతజనసామా

వ్యము నుద్ధరించు టెట్లనియే నేఁ బరితపించితిని. నేటికిఁ గొంతవఱకందు జయము గాంచితిని. దేశమున జనులు కాటకముచే, మహావ్యాధులచే, బాధల నొందుచున్న తత్తి నా వత్సలెట్లు విషూచిగ్రస్తులగు మాలలపజ్జను నిరాహారులై మరణించు పంచముల పంచను సేవచేయుచున్నారో చూచిన మీకు బ్రహ్మానందమగును. సర్వేశ్వరుఁడే నాకును వారికిని దోడ్పడుచున్నాఁడు. "మానవు లేపాటివారు? నా ప్రియతముఁడు, సర్వేశ్వరుఁడు నాచెంత నున్నాఁడు; అమెరికాలో, ఇంగ్లాండులో నే నుండినప్పుడు, అజ్ఞాతముగా భారతదేశమున సంచరించుచుండినప్పుడు నాచెంతనుండినవాఁ డల సర్వేశ్వరుఁడే. బోద్ధాదనివారి పలుకులనా నేను పాటించువది! ఏమేమి! పరతత్త్వమును సంసార సారహీనతను గ్రహించిన నేనా, పసిపాపల ప్రలాపములను విని నా మార్గమునుండి చలించుట! ఇదియా నన్నుఁగూర్చి మీ యభిప్రాయము?

స్వవిషయమున విశేషముగాఁ జెప్పుకోవలసివచ్చినది —అది యీవలననే. నావిధ్యుక్త కర్మము సమాప్తమైనదని తోఁచుచున్నది—కాకున్న మూఁడు నాలుగేండ్లకంటె నే నెక్కువ జీవింపను. స్వీయమోక్షేచ్ఛ నమసిపోయినది. ప్రాపంచిక భోగముల నెన్నఁడును గాంక్షించిన వాఁడను గాను. లోక శ్రేయమునకై నేనారంభించిన యుద్యమము జయప్రదముగా సాగటొక్కటే నాకు వాంఛనీయము. నా యుద్యమ మప్రతిహతము. కాకున్న భారత దేశమందైనను

నా కృషి కొనసాగుటఁ జూచి గుండెలపైఁ జేయి వైచుకొని నిద్రింతును. సమస్త జీవస్వరూపుని, అద్వితీయుని, విశేషము నా యార్తనారాయణుని, నా దీన నారాయణుని, సమస్త దేశీయులకెల్లఁ జెందిన నా భారత నారాయణుని, నా యిష్టదేవత నర్చించుటకై యెన్నిజన్మములైన నెత్తెదను గాక, యెన్నివేల బాధలనైన ననుభవింతునుగాక.

"ఎవ్వఁడల్పుఁడుగను పతితుఁడుగను, కీటకముగను గిరీటాధిపతిగను, పాపిగను పుణ్యాత్ముఁడుగను వెల్గొందునో యా సర్వేశ్వరుని భజింపుఁడు, ఇతరవిగ్రహములను విచ్ఛిన్నము చేయుఁడు.

"ఎవ్వఁడు జననమరణాతీతుఁడో, గమనాగమన విరహితుఁడో, ఎవ్వనియందు మనము నెలకొనియుంటిమో, యెవ్వఁడు సదా యద్వితీయుఁడో, ఆసర్వేశ్వరుని భజింపుఁడు, ఇతరవిగ్రహములను విచ్ఛిన్నము చేయుఁడు."

నా నియమితకాల మల్పము. ఒకరికిఁ జులుకవనుఁ గాక, మఱియొకరిని జీకాకుపఱచుఁగాక, నాయంతరంగమున నున్నమాట చెప్పక తప్పదు. కావున నాయనా!...నా నోటినుండి యేమి వెలువడినను భయపడకుము. నా కాధారభూతమైయున్న వ్యక్తి సర్వేశ్వరుఁడుగాని వివేకానందుఁడు కాఁడు. వాఁడు సర్వజ్ఞుఁడు. లోకమును నేను సంతుష్టిపఱుపవలసివచ్చినచో లోకమునకు హానిచేసినవాఁడ నగుదును. ఏ విషయమునైనను బహుజనులు చెప్పినంతనే యది సమంజసమని భావింపరాదు, అనేకులు పరిపాలించుచున్నను

లోకులదురవస్థ యథాప్రకారముగనే యుండుట ప్రత్యక్షమే కదా. ప్రతినూతనభావమును ప్రతిఘటనమును కలిగించి తీరును—నాగరికలోకమున హేళనయు నసాగరికలోకమున పఱపులు, అసహ్యమైన నిందలును దలయెత్తితీరును.

...అర్భకులు సైతము విశ్వాసము నందవలయును. అమెరికాదేశీయులు నషమంత్రపుసిరిచేఁ గన్నును మిన్నును గానకున్నారు. నా దేశమునకు వేయిసార్లు, లక్ష్మీకటాక్షము కలిగినది, పోయినది. మనము నేర్చిన గుణపాఠము లింకను నేయర్భకునకును బోధపడవు. జగము మిథ్య. ఈ ఘోర మాయాజగమును — నిస్సారమగు నీ సంసారమును — త్యజించి సుఖింపుఁడు. కామకాంచనములను బరిత్యజింపుఁడు. పెండ్లి, కామకాంచనములు — ఇవియే నిజమైన పిశాచములు. శరీరమే, శరీరాభిమానమే, మోహము. కామకాంచనమమత తొలఁగినచో మోక్షము కరతలామలకము. ...—చిరస్నేహాస్పదుఁడు, వివేకానందుఁడు.

## 102

ఓం నమో భగవతే రామకృష్ణాయ!

ఆల్మోరా, 10-7-1897.

ఆయుష్మంతుఁడగు నఖండానందునకు—నీవు నాకంపిన మన సంఘోద్దేశముల చిత్తుప్రతులను (Proofs) దిద్ది మరల నేఁడు పంపుచున్నాను. అందు (మన సంఘసభ్యులచేఁ జదువఁబడిన) నియమావళీభాగము తప్పులకుప్పగా నున్నది.

దానిని జాగ్రత్తగా దిద్ది పునర్ముద్రణము చేయుఁడు, లేని యెడల లోకులు నవ్వుదురు.

(వంగదేశమందలి) బరం(బ్రహ్మ)పురము (Berhampore) లోసాగుచున్న పని చాలఁజక్కఁగానున్నది. అట్టిపనులే దిగ్విజయము సందఁగలవు—వాదములును సిద్ధాంతములును మానవహృదయమును వశపఱచుకోఁగలవా? కృషి చేయుఁడు, దీక్షతోఁ గృషిచేయుఁడు—ధర్మముల నాచరణమునఁ జూపుఁడు—వాదములును సిద్ధాంతములును నేమి చేయఁగలవు? వేదాంతము, యోగము, తపస్సు—పూజామందిరము—మీ సన్న బియ్యపు టన్నపు నైవేద్యములు, మీ శాకోపహారములు—ఇవన్నియు నేయొకానొకనిధర్మమో ఏదేశధర్మమో యైనఁ గావచ్చును; పరహితాచరణ మొక్కటియే సార్వజనీన మహావ్రతము. స్త్రీలు, పురుషులు—పిన్నలు, పెద్దలు—ఆబాలగోపాలము,—వేయేల, జంతువులు సైత మీధర్మమును గ్రహింపఁగలవు. కేవల నిషేధాత్మక ధర్మముల * వలన ఫలమేమి? ఱాయి యెప్పుడును వ్యభిచరింపదు, అది యెన్నఁడును నసత్యము చెప్పదు. చెట్లు దొంగతనము చేయవు, దోపిడులను జేయవు—ఐన నేమి ప్రయోజనము? నీ వెన్నఁడును దొంగతనము చేయకుండ, వ్యభిచరింపకుండఁ, బ్రతిదినము నాలుగు గంటలసేపు ధ్యానించుచు, దానికి రెట్టింపుసేపు శాస్త్రోక్తముగా గంట వాయించు

---

* "న పరదారాం గచ్ఛేత్" (పరస్త్రీసంగమము కూడదు). "నానృతం బ్రూయాత్"(అసత్య మాడరాదు) మొదలగు నిషేధములు.

చున్నావనుకొందము—ఐన నేమి విశేషము? అల్పమైనను నీవు చేసిన యీ కార్యము, బరంపురమును నీకుఁ బాదాక్రాంత మొనర్చినది—ఇపుడు జనులు నీవేమి చెప్పినను-శిరసావహింతురు. "రామకృష్ణుఁడు సాక్షాద్భగవంతుఁడు" అని నీవిక జనులతో వాదింపనక్కఱలేదు, ఆచరణహీనమైన శుష్కోపన్యాసములవలన నేమి ప్రయోజనము?—మంత్రములకుఁ జింతకాయలు రాలునా? పది జిల్లాలలో నీ పట్టు చేయఁగలిగినమొదల నా పనియును నీ చెప్పుచేతలలో నుండును. నీవు ప్రాజ్ఞుఁడవు, కావునఁ బ్రస్తుతము కార్యశాఖయే ప్రధానమని చూపుచు, తద్వినియోగమును శక్తికొలఁదియు వృద్ధిచేయఁ బూనుము. యువజనసంఘము నేర్పఱిచి, యింటింటికి వెళ్లి, ధనము, ప్రాఁతబట్టలు, బియ్యము, భక్ష్యములు—ఏవి దొరికిన వానిని 'అలాఖియా సాధువుల' వలె వారిని యాచించి తీసికొనిరానిమ్ము, అపుడు వానిని బంచిపెట్టుము. కృషియనఁగా, నుద్యమమనగా, నిది. అంతట జనులకు నమ్మకము కలుగును, అపుడు మీ మాట విని మీరేమి చెప్పినను జేయుదురు.

కలకత్తాసభకైన ఖర్చులకు పోఁగా మిగిలిన దానిని క్షామనివారణార్థము జమకట్టుము, లేదా, కలకత్తాలోని గొందులు, గూడెములు మొదలగు వానిలోనుండు పేదలకాధనమును వినియోగించి సాయము చేయుము; స్మారకభవనములు మొదలైన వాని మాట జేవ్రఁ జెఱుఁగును. ప్రస్తుతము నా యారోగ్యము దివ్యముగా నున్నది....

దరిద్ర నారాయణసేవార్థ మిటువంటి శాఖ నొక దానిని నెలకొల్పుమని...వ్రాయుము.

...పూజకగు వ్యయము నెలకొకటి రెండు రూపాయిలు మించనీయకుఁడు. ఈశ్వర సంతానము తిండి లేక మాడుచున్నది....తులసీపత్రములతోడను జలముతోడను బూజచేసినఁ జాలును. నైవేద్యములకగు సొమ్ము దేవల యందు నెలకొనియున్న ప్రత్యక్షదైవమున కాహార నివేద నార్థము వినియోగింపఁబడుఁ గాక—అప్పుడు సర్వము భగవదనుగ్రహపాత్రమై యొప్పును....—నీ ప్రియ సోదరుఁడు, వివేకానందుఁడు.

## 103

అల్మోరా, 11-7-1897.

ప్రేమాస్పద—,...ఇంతవఱకు జరిగిన పని నాకుఁ దృప్తికరముగ నేయున్నది, కాని దానిని వృద్ధి నొందింపవలయును. రాసాయనిక శాస్త్రోపకరణములను భౌతిక శాస్త్రోపకరణములను గొన్నిటిని సంపాదించి, ప్రాథమికము, పరిశోధనాత్మకము నగు భౌతిక రాసాయనిక శాస్త్రములందును (Elementary and Experimental Chemistry and Physics) ముఖ్యముగా శారీరశాస్త్రమునందును (మఠసోదరునకుఁ) బాఠముల నేర్పుఱచుట మంచిదని తెలిపియున్నానే—ఆ విషయమున మీరేమి చేయుచున్నదియు నాకింకను దెలియకున్నది.

వంగభాషలోని కనువదింపఁబడిన భౌతిక శాస్త్రగ్రంథముల నన్నిటిని గొన్ని జతలను కొనవలయునని నేను సూచించితినే—దానిమాటయేమి?

ఒకేసారి ముగ్గురు మహాంతుల (మఠాధిపతుల) నెన్నుకొనవలయుననియు నందొకరు వ్యవహారశాఖను మఱియొకరు పరిశోధనశాఖను నింకొకరు విజ్ఞానశాఖను బరిపాలింపవలయుననియు నాకిపుడు తోఁచుచున్నది.

కలకత్తాలోని బాబులు 'మాత్రమే మతమునకు వచ్చునట్టి జనులని వినుట నాకు విచారకరము. వారివలన లాభములేదు. మనకుఁ గావలసినవారు ధైర్యసాహసాన్వితులగు యువకులు, కార్యదీక్షాపరులు, వట్టి యవివేకులు కారు.

...మాహాలాలో...అద్భుతముగాఁ బనిచేయుచున్నాఁడు. ఒక క్షుగ్రామములో — నదియు సేవలము బియ్యము పంచిపెట్టుచు—వారు తమతమ శక్తిసామర్థ్యములను క్రమముగా వ్యర్థముచేసికొనుచున్నట్లు కనిపించుచున్నది, ఈ సాయముతోఁబా టేవిధమైన ప్రచారమును జరిగినట్లు కనిపించుటలేదు. స్వయంసాహాయ్యమును జనుల కలవడఁజేయనిచోఁ బ్రపంచైశ్వర్యమంతయు హిందూదేశములోని యొక చిన్నయూరికి సాయము చేయుటకుఁ జాలదు. మనధార్మికోద్యమమును వైజ్ఞానికోద్యమమును ముఖ్యముగా స్వయంసాహాయ్య బోధకమై యుండవలయును. ఈ విషయమున మీరేమి చేయుచున్నారో నాకుఁ దెలియుటలేదు. ఎంతసేపు 'ఇంతలు బిచ్చగాండ్రకు సాయముచేసితి' ననుమాటయే! మనవద్దనున్న స్వల్పాదాయముతో మీరైనంతవఱకు విస్తీర్ణ

ప్రదేశమునకుఁ బోవ్వాటుండు బాటులో నుండున ట్లాయాజిల్లాలలోఁ గేంద్రములను నెలకొల్పుమని... తెలియఁజేయుము.

*　　　*　　　*

అత్యంత సులభమైన మార్గమిది: ఒక కుటీరముఁ గైకొని దానిని గురుదేవుని యాలయము నొనరింపుఁడు. సాయము గోరియే కాక, పూజించుటకును జనుల నచటికి రానిండు. అచట నుదయసాయంసమయములందుఁ బురాణము జరుపుచుండుఁడు. తన్మూలమున జనులకు మీరు బోధింపఁ దలఁచిన దానినంతయు బోధింపవచ్చును. క్రమముగా జనుల కభిరుచి కలుగును, ఆలయమును స్వయముగా వారే నిర్వహింతురు, కుటీరాలయము కొన్ని యేండ్లలో నొక మహాసంస్థగాఁ బరిణమింపవచ్చును. క్షామనివారణార్థము వెళ్లిన వారు ప్రతిజిల్లాలోను నిట్టి కుటీరాలయములను నెలకొల్పు నిమిత్త మొక కేంద్రస్థానము నెన్నుకోవలయును—అందుండి మన కృషియంతయు సాగుచుండును.

తనకు వచ్చినయెడలఁ బరమమూర్ఖుఁడైనను గార్యమును గొనసాగింపగలఁడు. కాని ప్రతికార్యమును దనకు నచ్చునట్లు రుచించునట్లు చేసికొనఁగలవాఁడే ధీమంతుఁడు. ఏకార్యమును హీనముకాదు. అల్పారంభములే మహాకార్యములుగాఁ బరిణమించుచుండును. రవంత మఱ్ఱిగింజయందు మహావటవృక్షము నిమిడియున్నది. లోకమందలి ప్రతివిషయమును నిట్టిదే. ఈ తత్త్వమును గ్రహించి, ప్రతి

కార్యమును నిజముగా ఘనకార్యముగా నొనర్పఁగలుగు వాఁడే ధీమంతుఁడు.

దీనజనసేవావిషయమున పంచకుల కర్తలగువారి యన్నము చేఁజిక్కకుండునట్లు మీరు చూడవలయును. హిందూదేశము శుద్ధసోమరిపోతులతో నిండియున్నను, విచిత్రము, ఆఁకలిచే వారెన్నఁడును జనిపోరు, ఏదో వారికి దొరకుచునే యుండును. క్షామనివారణోద్యమమున నున్న ప్రతివ్యక్తికిని ఈ విషయములను దెలియఁజేయుమని... వ్రాయుము. వారు ధనము నిరర్థకముగా వ్యయింపరాదు. అధమాదాయముతో సాధ్యమైనంతవఱకు శాశ్వతసత్కార్యమును మనము సాధింపవలయును.

ఎంతసేపు ప్రాఁతపుంతలనే పట్టుకొని ప్రాఁకులాడక, మీరిఁక స్వతంత్రమైన దారులను ద్రొక్కఁ బ్రయత్నింపవలయును తెలిసినదా? లేనిచో నాయనంతర మంతయు విచ్ఛిన్నమై పోవును. ఉదాహరణమునకు "మనవద్దనున్న స్వల్పాదాయముతో శాశ్వత సత్ఫలములను బడయు టెట్లు?" అను విషయమును బర్యాలోచించుటకుఁగాను మీరొక సభ చేయుఁడు. ముందుగా నెల్లరకును గరపత్రములు పంపి, ప్రతివ్యక్తిని దనకుఁదోఁచిన విషయములను దెలుపనిండు, ఇటులందఱి సూచనలను గూర్చియుఁ జర్చించి, విమర్శించి, సారాంశమును నాకుఁ దెలియఁజేయుఁడు.

నా సోదరశిష్యులకంటెను నావత్సలే విశేషము సాధింపఁగలరని యాశించుచున్నానని మీరు గుర్తింపవలసి

యున్నది. నావత్సలలోఁ బ్రతివ్యక్తియు 'నాకంటె నూఱు రెట్లధికులు కావలయునని నాకోరిక, మీలోఁ బ్రతివ్యక్తియు వీరాధివీరుఁడు కావలయును ఐతేనవలయునని నాయభిప్రాయము. విధేయత, సంసిద్ధత, ఉద్యమమున శ్రద్ధాభక్తులు ఇవి మూఁడును మీవద్దనున్న పక్షమున మీ రప్రతిహతులై వెలయుదురు. ఆప్తుఁడు, ఆశీర్వాదకుఁడు, వివేకానందుఁడు.

## 104

ఆల్మోరా, 28 7 1897.

స్నేహస్వరూపురాలగు నోబుల్ కన్యామతల్లికి ఇప్పుడీ కొలఁది పంక్తులు వ్రాయుచున్నందులకు నన్ను మన్నింపుము, పర్వత ప్రదేశములనుండి సమతలములకు వెడలుచున్నాను గావున నేదేని యొకతావును జేరినంతనే వివరముగా వ్రాయుదును.

'చనవు లేకుండునట్టి నిష్కాపట్యము' (Frankness without familiarity) అనఁగా నీయభిప్రాయమేమో నాకు బోధపడుటలేదు ప్రాచ్యుల లాంఛనమనునది లేశమును నావద్ద లేకుండునట్లు మోమోటము విడిచి, బాలునివలె సహజసరళరీతిని నా భావములను వెల్లడింతును. ఒక్కనాఁడైనను సంపూర్ణ స్వాతంత్ర్య తేజమున, నిష్కాపట్యమనెడి స్వచ్ఛంద వాయువును పీల్చుచు మనుట, యాహా! ఎంత బ్రహ్మానంద దాయకము! ఇదియేకదా మహోత్తమ నైర్మల్యము!

ప్రపంచమున మనమెంతసేపు లోకులకు జడిసి కార్య ములను జేయుచుందుము, జడియుచు మాటలాడుచుందుము, జడియుచునే యాలోచించుచుందుము, అహా! శత్రుభూమిలో మనము జన్మించియున్నాము! ప్రతివ్యక్తియుఁ బ్రత్యేకముగాఁ దన్నుఁ గనిపెట్టి చూచుటకే నియమింపఁబడిన చారుఁడో యనునట్లు కనిపించెడి యీ జనుపునుండి విముక్తుఁడు కాఁగలి గిన వాఁడేఁడి? ఈ జనుపును ఈ భయమును— జీర్ణి చెందాడి, ముందునకుఁబోవువాని పాట్లు పరమాత్మున కెఱుక! ప్రపంచ మెన్నఁడైనను మిత్రభూమి యగునా? ఎవరు చెప్పఁగలరు? ప్రయత్నించుటయే మనవంతు.

ఉద్యమ మీవఱకే ప్రారంభమైనది, తేనామనివారణ మిప్పుడు చేయవలసిన కార్యము. అనేక కేంద్రములు నెల కొల్పఁబడినవి. ఉద్యమము తేనామనివారణము, కొలఁదిగా ధర్మప్రచారమును సాగుచున్నవి. ఐన నిదియంతయు నత్యల్పమనుటకు సందియము లేదు. శిక్షణమందుచున్న వర్ప లవసరమువెంబడి నాయా కార్యములకై పంపఁబడుచున్నారు. చెన్నపురి కలకత్తాలు ప్రస్తుత కార్యాంగణములు. గుడ్విన్ మహాశయుఁడు చెన్నపురిలోఁ బనిచేయుచున్నాఁడు. మఱి యొకడు కొలంబో వెళ్లినాడు. నీ కీవఱకే యందియుండని మొదల మనుసటివారమునుండి మాసకార్య నివేదిక నీకుఁ బంపఁబడుచుండును. కార్యాంగణమునుండి నేను దూరమున నున్నాను, గావునఁ జూచితివా? పనికొంచెము మెల్లగా సాగుచున్నది. ఐనను మొత్తముమీఁద సంతృప్తికరముగనే యున్నది.

ఇచటికి వచ్చి చేయుదానికంటె నింగ్లాండులో నుండియే నీవు మా నిమిత్తము విశేషముగాఁ గృషి చేయఁ గలుగుదువు. పేదలగు భారతీయుల నిమిత్తము నీవు మహాత్యాగ మొనరించితివి భగవానుఁడు నిన్ననుగ్రహించుఁ గాక!

నే నింగ్లాండులో నున్న పక్షమున నచటి యుద్యమము వికాసము నొందునను విషయమునఁ బూర్తిగా నీతో నే నేకీభవింతును. ఐనను యంత్రము కొంత వేగముగా నడుచు వఱకును భారతదేశమును నేను విడుచుట భావ్యముకాదు, అదిగాక నేను చేయనున్న కార్యమును సాగించువా రచట ననేకులు గలరని నా నిశ్చయము. ముసల్మాను లనున ట్లల్లా సంకల్పించినయెడల నే నచటికి వచ్చుట కొలఁది నెలలలో సమకూడును.…మాకు నీవు శాశ్వత ప్రేమపాత్రురాలవని గ్రహింపుము.—ఆశీర్వాదకుఁడు, వివేకానందుఁడు.

## 105

ఓం నమో భగవతే రామకృష్ణాయ!

ఆల్మోరా, 24 7 1897.

ప్రేమాస్పద ,…అనాథశరణాలయ విషయమున నీయాశయములు చాలఁ జక్కనివి…అచట శాశ్వతమైన దొక కేంద్రమును నెలకొల్పుటకుఁగాను యథాశక్తిగాఁ బ్రయత్నింపుము. … ధనవిషయమై బెంగపెట్టుకొనకు. … క్షామనివారణార్థము నేను చందాలను వసూలుచేయుదును. …కలకత్తాలోని మన మఠమువంటిది ప్రతిజిల్లాలోను

నొకటి తెలిసిన నాయకత్వము నెఱవేఱును. ప్రచార కార్యమును నిలిచిపోనీయకు, ప్రచారముకంటెను ముఖ్యమైన విషయము పేదలకు విద్యాబోధనము. ...

సర్వశక్తిసామర్థ్యములును నీలోనున్నవి, విశ్వాసమును బూనుము. అవి వ్యక్తము కాకపోవు... ధైర్యోత్సాహములతో నెల్లరును కృషిసాగించుచుండుటకుఁగాను భావోద్దీపకములగు లేఖల నపుడపుడు మఠమునకు వ్రాయుచుండుము, జయ గురుదేవ! నీప్రియసోదరుఁడు. వివేకానందుఁడు.

106

అల్మోరా, 29 7 1897.

స్నేహాస్పదురాలగు నోబుల్ కన్యామతల్లికి భారతదేశమునకు వచ్చి స్వయముగా విషయములను బరిశీలించుటకై నీవు నిశ్చయించుకొన్నట్లు ... వద్దనుండి నిన్న నాకొక లేఖ వచ్చినది. ...

మనఃపూర్వకముగాఁ జెప్పుచున్నాను భారతదేశాభ్యుదయార్థము నీవు చేయవలయు కృషి కెంతయో నదవకాశము గలదని నా నమ్మకము. కావలసిన వ్యక్తి పురుషుఁడుకాదు, స్త్రీ; సింహబల సాహసాన్వితురాలగు స్త్రీ; ముఖ్యముగా స్త్రీలే హిందూదేశాభ్యుదయార్థము కృషి చేయవలసియున్నది.

హిందూదేశమింకను మహాస్త్రీలను వెలువడఁ జేయఁ జాలదు, భారతమాత వారిని విదేశములనుండి కైకొని 'దత్తత చేసికొనవలసియున్నది.' నీ విద్యాబుద్ధులు, భావ

సంశుద్ధి, అఖండ ప్రేమానురాగములు, అన్నిటికంటెను నీ (Celtic) మనస్తత్త్వము నివన్నియు నిన్నిపుడు సరిగా మాకుఁ గావలసిన వ్యక్తి నొనరించుచున్నవి.

ఐనను చిక్కు లనేకములు. ఇచటి జనులదుఃస్థితి, మూఢవిశ్వాసములు, దాస్యమును ' నిట్టివని నీ వూహింపఁ జాలవు. ఇఁక జాతివిషయకమగు విచిత్రభేదభావములతో, భయముచేఁ గానిమ్ము, తెల్లవారనిన నేవగించుకొనుచు, వారివలనఁ దీవ్రముగా నేవగించుకొనఁబడుచు, నిచట మసలు ననాగరిక స్త్రీ పురుషులనడుమ నీవు మనవలసియుందువు. దీనికిఁదోడు తెల్లవారు నిన్నుఁ గేవల విపరీతవ్యక్తిగాఁ దలపోయుచుందురు, నీ ప్రతిచలనమును ననుమానముతో బరిశీలించుచుందురు.

తరువాత నిచటి శీతోష్ణస్థితి ప్రచండము, పలుతావులలో మాశీతకాలము మీ వేసవిని బోలియుండును, ఇఁక దక్షిణదేశమున వేసవి సదా నిప్పులు కురియుచుండును.

ఐరోపాదేశీయసౌఖ్యముగాని, సదుపాయముగాని యిచటి పట్టణములను దాఁటినచో మచ్చునకైనను గానరావు. వీనిని గణింపక కార్యాంగణమునఁ బ్రవేశింప సాహసించితివా, నీకు మాస్వాగతము, మనఃపూర్వకమగు స్వాగతము. నేనోయనిన, నిచటఁ గానిమ్ము, మఱెచ్చటఁ గానిమ్ము, అనామధేయుఁడను, కాని నా కే మాత్రము పరపతి యనునది యున్నను దానిని నీసేవకై వినియోగింతును.

ఈ యుద్యమమున దిగుటకుముందు నీవు బాగుగా నాలోచించుకోవలయును, నీవిందు విజయమునందఁజాలకున్నను, నీకు విసుగు జనించినను, భారతదేశ క్షేమార్థము నీవు కృషి చేసినను చేయకున్నను, వేదాంతమును నీవవలంబించినను విడనాడి వైచినను సరియే ఆమరణము నేను నీకు బాసటయై నిల్చెదనని వాగ్దానము చేయుచున్నాను. "ఏనుగు దంతములు ముందునకు వచ్చునే కాని వెనుక కెన్నఁడును బోవు, ఇట్టివే మానవుని వచనములు. ఐన నీ వాగ్దానముతోఁ బాటొక హెచ్చరిక చేయవలసియున్నది. .. వారియండనుగాని, మఱెవ్వరియండనుగాని మసలక స్వశక్తి మీఁదనే నీవు నిర్భరపడవలయును. అనేకులతోఁ దగు మాత్రము దూరముననే మైత్రి కలిగియుండుట మేలు, స్వశక్తిపై నిర్భరపడువారి కంతయు సక్రమముగనే నడచును. ... మాకు నీవు శాశ్వతస్నేహాస్పదురాలవని గ్రహింపుము. భగవదేకశరణుండగు మీ వివేకానందుఁడు.

## 107

బేలూరుమఠము, 19 8 1897.

స్నేహాస్పద ,... మీరిరువురును హిందూ దేశమునకు వచ్చుటనిన నిజముగా నాకపరిమిత సంతోషము; ఐనను మొదట మీ రీవిషయమును గమనింపవలసియున్నది: పెద్ద పెద్ద ముఖ్యపట్టణములలో వినా, ఐరోపా దేశీయ సౌఖ్యముగాని సదుపాయముగాని లేక, యత్యంత మలినము, ననారోగ్య కరముసగు బిలము హిందూదేశము.

(ఇచటికి వచ్చుచో) ఆఫ్రికాఖండాంతర్భాగమునకు బయలుదేఱుచున్నారనియు వంతకంటె మేలైనను దట స్థించునెడల వది మీ యదృష్టమనియు భావించుకొనవల యును.... —సదా మీ వివేకానందుఁడు.

## 108

## ఒక వంగదేశీయ నారీమతల్లికి

1897.

అమ్మా ... ఈ కాశ్మీరము భూతలస్వర్గము. ఇట్టి ప్రదే శము లోకమున మఱెచ్చటను లేదు. కొండలు, నదులు, చెట్లు, లతలు, మృగములు, పక్షులు, స్త్రీలు, పురుషులు సర్వము రామణీయకమున నొండొంటిని మించు చుండును. ఇంతవఱకీ దేశమును దర్శింపనైతినే యని నా కెంతయో పరితాపము గలిగినది. తల్లీ, నీ యోగక్షేమ ములనుగూర్చి వివరముగా నాకు వ్రాయుము, నీకు నా యాశీర్వచనములు. సదా నీ శ్రేయోభిలాషినని నిశ్చయ ముగా గ్రహింపుము విశ్వసనీయుఁడగు వివేకానందుఁడు.

## 109

శ్రీనగరము, కాశ్మీరము, 30 9 1897.

స్నేహాస్పద ,... తన లేఖలో నోబుల్ కన్య వెలువరించిన ప్రశ్నలకు నా సమాధానము లివి

1. ఇంచుమించుగాఁ గార్యశాఖలన్నియుఁ బని సాగించుచున్నవి, కాని యుద్యమ మింకను ప్రారంభావస్థలో నున్నది.

2. సన్న్యాసులలో ననేకులు విద్యావంతులు, విద్యావంతులు కానివారికి విద్య గఱపఁబడుచున్నది. కాని యన్నిటికంటెను బరహితాచరణమునకు స్వార్థత్యాగ మత్యావశ్యకము కావున దానిని బలపఱచుటకుఁగాను ముందుఁగాఁ బారమార్థికసాధనల విషయమున విశేషశ్రద్ధ వహింపఁబడుచున్నది.

3. విద్యాబోధకులు : మతముఁ జేరువారిలో ననేకు లీవఱకే స్వయముగా విద్యావంతులై యుందురు. శీలమును బెంపొందించుచు మనవిధానము ననుసరించి వారికిఁ దగు శిక్షణగఱపుటయే మనము చేయవలసిన పని. వారిని వినయవిధేయులుగను నిర్భయులుగను నొనరించుటయే యీ శిక్షణోద్దేశము. పేదలకు మొదట జీవయాత్రకు వలయు సాయము నొసర్పవలయును, అనంతర ముత్తమ మానసికవికాసమును గలుగఁజేయవలయును—ఇదియే మన కార్యక్రమము.

కళలు, పరిశ్రమలును : తగిన మూలధనము లేమిఁ గార్యక్రమమందలి యీ భాగము మాత్రమే ప్రారంభింపఁ బడఁజాలకున్నది. స్వయముగాఁ దాము తయారుచేసిన వస్తువుల నుపయోగింప భారతీయులను బ్రోత్సహింపవలయును, భారతీయ శిల్పచిత్రాదులు విదేశీయ విక్రయశాలలలో నమ్ముకుపోవుటకుఁ దగిన సదుపాయముల నరయవలయును—ఇదియే ప్రస్తుతము మన మవలంబింపఁదగిన యతి సరళమైనమార్గము. ఈ కార్యమును నిర్వహించు

నట్టివారు స్వయముగాఁ దాము దలారులు కాకుండుట మాత్రమేకాక, యీ శాఖవలన వచ్చు నికరాదాయము నంతయు శిల్పుల యభ్యుదయార్థము వినియోగించునట్టివారై యుండవలయును.

4. విద్యనేర్పుటకు జనులు తమంతతాము వచ్చువఱకును మనమే పలుతావులందు సంచరింపవలసియుండును. పరివ్రాజకుల పారమార్థికశీలము తపస్త్వములుననే విశేషముగా శోభించును.

5. సర్వజాతులందును మన ధార్మికోద్యమము కార్యకారి కాఁగలదు. ఇంతవఱ కగ్రజాతులందుమాత్రమే మన యుద్యమము ఫలప్రదమైయున్నది. ఆయా తావులందలి క్షామనివారణ కేంద్రములలోఁ గార్యశాఖ బాగుగాఁ బని చేయుచుండుటవలన నధోజాతులవారు క్రమముగా వశులగుచున్నారు.

6. ఇంచుమించుగా హిందువులందఱును మా యుద్యమము నామోదించుచున్నారు, కాని యిట్టికార్యములలో నాచరణపూర్వకమగు సహకారమునకు వా రలవడినవారు కారు.

7. ఔను, ఆదినుండియు దానధర్మాదికమగు మా లోకహితకార్యములందు హిందూదేశములోని వివిధమత సంప్రదాయముల నడుమ మేమెట్టిభేదమును బాటించుట లేదు. ... —వివేకానందుఁడు.

## 110

## ఒక యాంగ్లేయ మిత్రునకు

శ్రీనగరము, కాశ్మీరము, 1-10-1897.

ఇతరులు తమ్ము నడుపునప్పుడే కొంత అత్యుత్తమముగాఁ బనిచేయుదురు. ప్రతివ్యక్తియు నాయకుఁడు కాఁజాలఁడు— జన్మసిద్ధముగా నొకానొకఁడు నాయకుఁ డగుచుండును. ఎట్లైనను "బసిబిడ్డవలె నడపువాఁడు" ఎవ్వఁడో వాఁడే నాయకోత్తముఁడు. ప్రతివ్యక్తిమీఁదను నిర్భరపడియున్నట్లు పైకిఁ గాన్పించినను బసిబిడ్డఁ డింటికంతకును రాజు, ఏమైనను నామట్టునకు నాకిదియే రహస్యమని తోఁచుచున్నది. ... అనేకులు సానుభూతి నొందుదురు, కాని ప్రకటింపఁగలవా రేకొలఁదిమందియో. ఒరులయెడఁదన ప్రేమానురాగములను, సానుభూతిని, గుణగ్రహణమును బ్రకటింపఁగలుగు శక్తియే యొకానొకనిని దనయాశయముల నితరులకంటె విశేష జయప్రదముగా వ్యాప్తిచేయు సమర్థు నొనరించుచుండును.

కాశ్మీరమునుగూర్చి నీకు నేను వర్ణింపఁ బ్రయత్నింపను. ఈ భూతలస్వర్గమునువినా మఱే దేశమును విడనాడుటకైనను నే నెన్నఁడును బరితపింపలేనని చెప్పినఁ జాలును. ఇచట నొక కేంద్రమును నెలకొల్పుటకుఁగాను కాశ్మీరరాజును యథాశక్తిగాఁ బ్రోత్సహింపఁ బ్రయత్నించుచున్నాను. ఇచటఁ జేయవలసిన దెంతయో యున్నది, పరిస్థితులును నాశాజనకముగా నున్నవి.

కాని గొప్పచిక్కిది: నాయం దించుమించుగాఁ దమ యావత్ ప్రేమానురాగములను జూపు వ్యక్తులను గను చుందును, కాని నాప్రేమనంతయుఁ దిరిగి వారియందుఁ జూపరాదు, చూపితినో, ఉద్యమ మూనాఁడే ధ్వంసమై పోవును. ఏనను వ్యక్తిగతదృష్టి నతిక్రమించు నుదారబుద్ధి లేనివా రట్టిప్రతిఫలమును గాంక్షించుచుందురు. అనేకులు నన్ను మనఃపూర్వకముగాఁ బ్రేమింపవలయును. ఏనను నాప్రేమ యెంతమాత్రము వ్యక్తిగతము కారాదు— ఉద్యమనిర్వహణమున కిది యత్యావశ్యకము. లేనిచో నసూయాద్వేషములును వివాదములును జెలరేఁగి యన్ని టిని జెఱుచును. నాయకుఁడగువాఁడు వ్యక్తిగతదృష్టి కతీతుఁడై యుండవలయును. వీకిది బోధపడునని నానమ్మ కము. ఒరుల శ్రద్ధాభక్తులను స్వప్రయోజనార్థము వినియో గించుకొనుచుఁ, దన తెలివికిఁ దాను సంతసించుచు, మానవుఁ డవివేకియై యుండవలయునని నాయభిప్రాయముకాదు. వ్యక్తులయెడ గాఢమైన ప్రేమానురాగములను గలిగి యున్నను, అవసరమగుచో, బుద్ధుఁడు వచించిన చందమున, "బహుజన హితార్థము, బహుజన సుఖార్థము" స్వహస్త ములతో నా హృదయమును నేను బెఱికివేసికొనఁగలిగి యుండుటయే యని నా యభిప్రాయము. ప్రేమోన్మత్తత, కాని యందు బంధరాహిత్యము. ప్రేమ ప్రభావమున జడ మాత్మగా మాఱవలయును. ఇదియే మన వేదాంతతత్త్వము. అద్వితీయమగు నాత్మనే యజ్ఞులు జడముగను విజ్ఞు లాత్మ గను గాంచుచున్నారు. క్రమక్రమముగా జడమున నాత్మను

దర్శింపనేర్పుటయే విజ్ఞాన వికాసము. అజ్ఞుఁ డాత్మను వ్యక్తిగాఁ గాంచును. విజ్ఞుఁడో, వ్యక్తియం దాత్మను దర్శించును. రాగద్వేషముల మూలమునను సుఖదుఃఖముల మూలమునను మనము నేర్చుకొనుచున్న గుణపాఠమిదియే...

(మరల నీయాంగ్ల మిత్రునకే)

అభిమానమువలనఁ గార్యములు చెడును. "వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి—వజ్రముకంటెను కఠోరముగను కుసుమముకంటెను మృదులముగను నుండవలయును" ఇదియే మన వ్రతము.

**111**

ముర్రీ, 10-10-1897,

ప్రేమాస్పద—, నీలేఖ యందినది, చాల సంతోషము.

ప్రస్తుతము పెద్ద కార్యక్రమమును గూర్చి నీవు చింతింప నక్కఱలేదు, ప్రస్తుత పరిస్థితులలో సాధ్యమైనదానినే చేయుము. క్రమముగా మార్గ మేర్పడును. అనాథశరణాలయము మనకావశ్యకము—సంశయింపఁ బనిలేదు. దిక్కులేక యల్లాడుచున్న బాలికలను మనము విడువరాదు. ఐనను, అనాథబాలికా శరణాలయమునకు మనకొక నిర్వాహకురాలు కావలయును. ఇందుకు—అమ్మ తగియున్నదని తలఁతును. లేదా, సంతానములేని వితంతువును—వయసు చెల్లిన యామెను—ఎవ్వరినైనను గ్రామములో నిందులకై నియోగింపుము. బాల బాలికలకు వేర్వేఱుతావు లుండవలయును. సెవియరు సేనాని (Captain Sevier) ఇందులకు

ధనసాహాయ్యము చేయుటకు సంసిద్ధుఁడై యున్నాఁడు. . .—
మీ వివేకానందుఁడు.

మఱియొక సంగతి. మహమ్మదీయ బాలురనుగూడ మీరు చేర్చుకొనవలయును, కాని వారి మతధర్మములతో మీరు జోక్యము కలుగఁజేసికొరాదు. వారి భోజనాదులకుఁగాను ప్రత్యేకవసతుల నేర్పఱిచి, నీతిని ధైర్యసాహసములను బరహితాచరణమును వారికిఁ గఱపుటయే మీరు చేయవలయునని. ధర్మమనఁగా నిదియే.

మీ ధర్మసూత్రములను మీసిద్ధాంత రాద్ధాంతములను బ్రస్తుతమటుంచుఁడు. వి.

మానవత్వము, దయ—ఇవియే ప్రస్తుతము మన దేశమునకుఁ గావలసియున్నవి. "స ఈశః అనిర్వచనీయ ప్రేమస్వరూపః ఆ యీశ్వరుఁ డనిర్వచనీయ ప్రేమస్వరూపుఁడు." (నారదభక్తి సూత్రము.) కాని "ప్రకాశ్యతే క్వాపి పాత్రే—ప్రత్యేక వ్యక్తులందాతఁడు ప్రకాశించుచున్నాఁ" డనుటకు బదులు, "స ప్రత్యక్ష ఏవ సర్వేషాం ప్రేమరూపః సర్వభూతములందును నాతఁడు ప్రేమరూపుఁడై వెలయుచున్నాఁ" డని మనము చెప్పవలయును. ఇంతకంటె మఱియే యితరదైవమును—మీ మనః కల్పితమును—మీ రారాధింపఁబోయెదరు! వేదములు, ఖురాను, పురాణములు మొదలగు తత్త్వశాస్త్రపు బలగమునంతయుఁ బ్రస్తుతము కొంతకాలమువఱకును విరామము నొంద నిండు—ప్రత్యక్ష దేవుని—ప్రేమదయా స్వరూపుని — యారా

ధన మిప్పుడు నెలకొల్పఁబడవలయును. లౌకికచింతా మగ్న పాప మత్తుల ప్రలాపములను విని మీరు జడియకుఁడు. “అభీరభీః — నిర్భయులు కండు!” — వారు మానవులు కారు, కీటకములు! హిందూ బాలురను, మహమ్మదీయ బాలురను, క్రైస్తవ బాలురను—మఱియెవ్వరిని గానిండు —చేర్చుకొనుఁడు. కాని తొందరపడక మెల్లఁగాఁ బని సాగింపుఁడు—వారియన్న పానములు కొంచెము వేర్వేఱుగా నుండునట్లు మాత్రము చూడుఁడని నా యభిప్రాయము. వారికి మతధర్మములందలి విశ్వజనీనాంశములనే బోధింపుఁడు.—వి.

ఈ విషయమున మీ రున్మత్తులు కావలయును, ఈ యున్మాదముచే జనులను మీరు వశపఱచుకొనవలయును! ఇదియే జీవితపరమార్థము. గురుదేవుని నామమును ప్రచారము చేయుఁడు, ఆతని బోధలు లోకమున దశదిశలందును మూలమూలలందును వ్యాపింపవలయును. అప్రమత్తులై యుండుఁడు. మీ నిత్యకృత్యములలో, మీ యంతరంగమున నీ మంత్రమును బురశ్చరణ మొనర్చుకొనుచుండుఁడు. —మీ వి.

112

రావల్పిండి, అక్టోబరు, 1897.

మహాశయ——...సరిగా మీరిప్పుడు చేయవలసిన పని చేయుచున్నారు. ప్రకటింపుఁడు, ప్రకటింపుఁడు, మీ శక్తి సామర్థ్యములను! యావజ్జీవము నిద్రయేనా? కాలము పరుగిడుచున్నది. సెబాసు! ఇదియే పద్ధతి!

మీరు ప్రకటించిన మంజరికిఁగాను మీకనేక వందనములు—చిన్న పొత్తమైయుండుటచేఁ గట్టుబడి యుండదేమోయని నా భయము...కట్టుబడి యుండనిండు, ఉండక పోనిండు,—లోకమున దానిని వ్యాప్తి కానిండు, సంకోచింపకుఁడు. దీనివలన మీకనేక భూషణలును వానికి మించిన దూషణలును కూడఁ గలుగును — అదియే గదా లోకుల ధోరణి!

ఇదియే తరుణము.—భగవదేకశరణుఁడు, మీ వివేకానందుఁడు.

## 113

## వంగదేశీయురాలగు నొక శిష్యురాలికి

లాహోరు, 15-11-1897.

అమ్మా—కరాచీ వచ్చి నిన్నుఁ జూడవలయునని మనః పూర్వకముగా వాంఛించుచున్నాను, అవకాశము గాన్పింపకున్నందులకుఁ జాలఁ జింతించుచున్నాను....

మూత్రపిండ సంబంధమైన బాధలనుబట్టి చూచిన, నేను జిరకాలము జీవింతు ననుకొనఁజాలను. కలకత్తాలో నొక మఠమును నెలకొల్పవలయునని యిప్పటికిని నా కోరిక; ఇంతవఱకు నా విషయమై యేమియుఁ జేయఁజాలకున్నాను. మన దేశీయులు మఠమున కింతవఱకుఁ జేయుచుండిన యల్ప సాహాయ్యము కూడ నిటీవల విరమించినారు. ఇంగ్లాండు నుండి కావలసినంత డబ్బు తీసికొని వచ్చియున్నానని వారి యభిప్రాయము!! వీనియన్నిటికంటెను విశేషము, నేను

పాశ్చాత్యదేశమునకు వెళ్లి యుండుటచే, రాసమణివనమున
కధికారులు నన్ను రానీయరు, కావున నీవేఁడు శ్రీరామ
కృష్ణుని జన్మదినోత్సవము జరుపుట యసంభవము!!...తల్లీ!
చింతింపకు, మిమ్ముల నెవ్వరిని, ఎన్నఁడును, నేను మఱవను,
కాని, కర్తవ్యమును మొదట నిర్వహింపవలయును గదా,
కలకత్తాలో మఠము నెలకొల్పఁబడినంతనే నామనస్సు
కుదుటఁబడును. దేని నిమిత్తము యావజ్జీవమును బడరాని
పాట్లు పడితినో, యట్టికార్యము నాయనంతరము నమసిపోవని
మఠస్థాపనానంతర మాశింపఁగలుగుదును.... ఆశీర్వచన
ములు.—విశ్వసనీయుఁడగు మీ వివేకానందుఁడు.

## 114

## శ్రీరామకృష్ణ సందేశామృతము (Gospel of Sri Ramakrishna) అను గ్రంథమునుగూర్చి 'ఎమ్' అను మహాశయునకు

డెహ్రాడూన్, 24 11 1897.

మహాశయ , మీ రెండవసంపుటమునకుఁగాను మీ
కనేకవందనములు, అది నిజముగా నద్భుతముగా
నున్నది. పోకడ పూర్తిగా స్వతంత్రము, మీ రొన
రించు రీతిని రచయిత మానసముచే నణుమాత్రమును
గలుషితముగాకుండునట్లు మహనీయుఁడగు నాచార్యుని
జీవితము లోకమున కింతవఱకెన్నఁడును బ్రదర్శితముకాలేదు.
నవ్యనూతనము, సునిశితము, అతులయ్యును నతిసరళము,
సుబోధమునై భాష వర్ణనాతీతమై యొప్పుచున్నది.

ఇది నా కెంతటి మోదము నొసఁగూర్చినదో తెలుపఁ దగు పదములు నాకు దొరకకున్నవి. దీనిని జదివి నిజముగాఁ బారవశ్యము నొందితిని. విచిత్రముకాదా? మన గురుదేవుఁడు పక్షావిలసితుఁడు — అతినూతనమార్గావలంబకుఁడు; మనలోఁ బ్రతివ్యక్తియు భావములందేమి, క్రియలందేమి, నూతనమార్గావలంబకుఁడు కావలయును, లేనిచో లాభము లేదు. మాలో నెవ్వరును నాతని జీవితము నింతవఱ కెందుచే రచింపఁ బ్రయత్నింపలేదో నాకిపుడు బోధపడుచున్నది. ఈ మహాకార్యము మీ కుద్దిష్టమైయున్నది. గురుదేవుఁడు నిజముగా మీ దండనున్నాఁడు. మీకు నా ప్రేమపూర్వకనమస్కార పరశ్శతము—వివేకానందుఁడు.

మఱియొకమాట. సోక్రటీస్ (Socrates) సంభాషణలన్నియు ప్లేటో (Plato) మయము; మీరు పూర్తిగా దాఁగుకొనియున్నారు. విశేషము, రచనమునందలి కావ్యాంశము (Dramatic Part) దివ్యసుందరముగా నున్నది; ప్రాచ్యులకును పాశ్చాత్యులకును నెల్లవారికిని హృదయంగమమై యొప్పును.

115

## ఒక వంగదేశీయ మహిళామతల్లికి

వైద్యనాథము, 3-1-1898.

అమ్మా—నీ లేఖలో నతిముఖ్యమైన కొన్ని ప్రశ్నలు వెలువఱిచితివి. చిన్న లేఖలో వాని కన్నిటికిని సమాధానించుట

దుర్లభము, ఐనను సాధ్యమైనంతవఱకు సంగ్రహముగాఁ దెలిపెదను.

(1) బలాత్కారముగా సంఘములో నొకయాచారమును ప్రవేశపెట్టుటకు ఋషికిఁ గానిమ్ము, మునికిఁగానిమ్ము —అధికారములేదు. పరిస్థితులనుబట్టి యావశ్యకమైనపుడు సంఘమే ప్రత్యేకముగ కొన్ని యాచారముల నవలంబించుచుండును. ఋషులు కేవలము వానిని స్మృతులలో లిఖించినారు. భావికాలమున హానికరమగుఁగాక,—ఆత్మరక్షణమున కావశ్యకమగు నుపాయములను మానవుఁ డవలంబించునట్లు తాత్కాలికోపాయములచే సమాజము తఱచుగా రక్షణమందుచుండును; తాత్కాలికముగా సమాజమునకివి క్షేమకరములయ్యుఁ గాలక్రమమున మహోపద్రవహేతువు లగుచుండును.

ఉదాహరణమునకు దేశమందలి స్త్రీపునర్వివాహనిషేధమును గైకొందము. ఏ దుర్మార్గులో, ఋషులో, ఈ శాసనమును దెచ్చిపెట్టిరని తలంపకుము. స్త్రీలను బూర్తిగాఁ దమ యధీనలను జేసికొనవలయునను పురుషుల యిచ్ఛ యటుండ, నాఁటి సాంఘికావశ్యకత వారికిఁ దోడ్పడనిదే వా రెన్నఁడును పట్టి నియమముల నేర్పఱుపఁగలిగియుండెడివారు కారు. ఇందు ముఖ్యముగా గమనింపవలసిన విషయములు రెండు.

(అ) స్త్రీపునర్వివాహములు శూద్రులలో (అధోజాతులందు) జరుగుచున్నవి.

(ఆ) అగ్రజాతులలోఁ బురుషులసంఖ్యకంటె స్త్రీల సంఖ్య హెచ్చుగా నుండును.

ఇట్టిపరిస్థితులలో విధిగాఁ బ్రతిబాలికకును వివాహము చేయవలయునన్నచో, ఒకబాలిక కొక భర్త దొరకుటయే దుర్లభము. ఇఁక నొక్కొక్కతె కిద్దఱు ముగ్గురమాట చెప్ప నేల! అందుచే సంఘ ముఖ్యులలో నొకరికిఁ బ్రాతికూల్యము గల్పించినది—అనఁగా నొకసారి పెండ్లియైన స్త్రీకి రెండవ వివాహమున కొప్పుకొనలేదు. ఒప్పుకొనినచో, నొక స్త్రీకి భర్త దొరకకుండఁబోవును. ఇకఁ స్త్రీల సంఖ్యకంటెఁ బురుషులసంఖ్యయే హెచ్చుగానుండు జాతులలో నీ బాధ లేకుండుటచే స్త్రీపునర్వివాహము లందు జరుగుచున్నవి. పాశ్చాత్యదేశములలోఁగూడఁ గన్యలకు భర్తలు దొరకుట నానాఁటికిఁ గష్టసాధ్యమగుచున్నది.

వర్ణవ్యవస్థయొక్కయు నితర సాంఘికవ్యవస్థలయొక్కయు విషయముకూడ నిట్టిదే.

అందుచే నేసాంఘికాచారమునైనను మార్చవలయునన్నచో మొట్టమొదట నది యెంతవఱ కావశ్యకమో కనుఁగొనవలయును. అప్పుడు దానిని మార్చినయెడల నా యాచారము దానియంతటదియే యంతరించును. అంతేకాని యూరక ఖండనమండనములవలన నేమియుఁ బ్రయోజనములేదు.

(2) 'సాంఘిక నియమములు ప్రజాభ్యుదయమునకై యేర్పఱుపఁబడినవా, లేక సంఘమే యీ నియమముల

నిమిత్త మేర్పడినదా?' యనున దిపుడు వెలువడు ప్రశ్న. అనేకులు (మొదటిరీతిని) పొందుదురు, కొందఱు మఱల (రెండవరీతి నవలంబించి) కాదని చెప్పవచ్చును. ఇతరుల కంటె బలవంతులై మెల్లఁగా వారిని వశపఱచుకొనుచుఁ గొందఱు శక్తిచేతనో, యుక్తిచేతనో, స్వకార్యములను సాధించుకొనుచుందురు. ఇదియే సత్యసమ్మతము, న్యాయము నగునో, అజ్ఞులకు స్వాతంత్ర్యమిచ్చుట హానికరమనుట కర్థ మేమి? మఱియు స్వాతంత్ర్యమనఁగా నేమి?

ధనాదులను మీరు నేను బంచుకొని యనుభవించుట కెట్టి యాటంకము నుండరాదనికాదు, స్వాతంత్ర్య మను పదమున కర్థము. కాని యితరుల కెట్టి హానియుఁ గల్గింపకుండ మన శరీరమును బుద్ధిని సంపదను వినియోగించుకొనుటకు మనకు సహజమైన యధికారము కలదు. మఱియు ధన విద్యార్జనములను బడయుటకు సంఘమునందలి ప్రతివ్యక్తికిని సమానమైన యవకాశముండవలయును. అజ్ఞులకును పేదలకును స్వాతంత్ర్య మిచ్చినచో, ననఁగా శరీరము, సంపద మొదలైనవానిని యథేష్టముగా వినియోగించుకొననిచ్చినచో —శ్రీమంతుల బిడ్డలవలెనే వారి బిడ్డలకును విద్యాభ్యాసాదుల కవకాశమున్నచో—వారు పెడదారి త్రొక్కుదురనియు దుర్మార్గులగుదురనియుఁ గొంద ఱందురే—వాస్తవమా? యని మఱియొక శంక. ఇట్లు చెప్పువారు సంఘ శ్రేయోభిలాషులో, స్వార్థపరాయణులో, గమనింపుఁడు. "అందఱు పల్లకి నెక్కిన మోయువారెవరు!"—"జనసామా

న్యమునకు విద్యనేర్పిన నీకు మనకు సేవచేయు వారెవరు ?''
అని యాంగ్లదేశమునను ననేకులు శంకించుచుండఁగా వింటిని.

పదుగురు ధనికుల భోగముల నిమిత్తము లక్షలకొలఁది మంది స్త్రీలను బురుషులను 'అలో లక్ష్మణా' యనుచు, నజ్ఞానాంధకార పంకమునఁ గూలఁబడియుండనిండు, కారణమేమన, వారికి విద్యాసంపదలు చేఁజిక్కినచో సంఘ మంతయుఁ దలక్రిందై పోవును!

సంఘమనఁగా నేమి ? జనసామాన్యమా, లేకమీరు, నేను, అగ్రజాతులయందలి మఱి యేపదిమందియునా ?

మఱియు నొకవేళ రెండవ పక్షమే యథార్థమనుకొన్నను, ''ఇతరులను, నడపుచున్న వారము మనము'' అనుకొనుట యర్థరహితాహంభావము. మనమేమి సర్వజ్ఞులమా ? ''ఉద్ధరేదాత్మ నాత్మానమ్ ప్రతివ్యక్తియుఁ దన్నుఁదానే యుద్ధరించుకొనవలయును.'' సర్వవిధములను స్వాతంత్ర్యము, అనఁగా ముక్తియే మానవుని మహోత్తమలాభము. శారీరికముగను మానసికముగను నాధ్యాత్మికముగను స్వయముగా ముక్తిమార్గమునఁ జరించుచుఁ, బరులకును సంఘములకుఁ దోడ్పడుటయే మానవుని పరమపురుషార్థము. ఇట్టి స్వాతంత్ర్యమునకుఁ బ్రతికూలములగు సాంఘికనియమములను శీఘ్రముగా నిర్మూలింపవలయును. స్వాతంత్ర్యాభివృద్ధి నొనఁగూర్చునట్టి సంప్రదాయములనే ప్రోత్సహింపవలయును.

అసాధారణ గుణసంపద లేవియు లేని యొకానొకరి యెడఁ బ్రథమదర్శనముననే మనము ప్రేమబద్ధులమైనచో,

అందులకుఁ గారణము పూర్వజన్మ సంసర్గమని మనదేశ మందలి విజ్ఞులు చెప్పెదరు.

సంకల్పమునుగూర్చి నీ వడిగిన ప్రశ్న నాకు వచ్చినది—అది తెలియఁదగిన విషయమే. ప్రత్యేకమైన సంకల్ప పరిణామమునకే యిచ్ఛయని పేరు: కావున నేయిచ్ఛానాశనముతోఁబాటు నిశ్చయముగా సంకల్పనాశనమును గలుగునో, యట్టి యిచ్ఛానాశనమే సమస్త మత ధర్మములకును బరమార్థము. ...

ఆరంభావస్థలో శిష్యుఁడు గురునిరూపమును ధ్యానింప వలయును. క్రమముగా, ఆరూపము నిష్టదేవతయందు లయ మొనరింపవలయును. ...

మానవునియందు దేవత్వము నారోపించుట దుర్లభమే, కాని పలుసారులు ప్రయత్నించుటచే నిందు తప్పక విజయము నందవచ్చును. తనకుఁ దెలిసినను దెలియకున్నను, ప్రతిమానవునియందును దేవుఁడు కలఁడు; 'ప్రేమభక్తి' వానియందలి దేవత్వమును బ్రకాశిత మొనర్చిలేదును.—చిర శ్రేయోభిలాషి, వివేకానందుఁడు.

## 116

ఆల్మోరా, 20-5-1898.

ప్రేమాస్పద—, ...కర్తవ్యమనుదాని కంతు లేదు, లోక మత్యంత సారభూయిష్ఠము.

ధైర్యోత్సాహవంతుఁడవై యుండుము. "నహి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి—వత్సా!

శుభ మొనరించువాఁ డెన్నఁడును దుర్గతి నొందఁడు.'' (గీత) ... సదా మీ వివేకానందుఁడు.

## 117

## నైనిటాలులోని యొక మహమ్మదీయునకు

ఆల్మోరా, 10 6 1898.

ప్రియమిత్రునకు మీ లేఖయందలి విషయములు విశేషముగా నామోదింపఁదగినవి, మన మాతృదేశక్షేమార్థము భగవంతుఁడు మెల్లఁగా నద్భుతసంఘటనలను గలుగఁజేయుచున్నాఁడు. మనము వేదాంతమతమన్నను మఱి యే మతమన్నను, అద్వైతమే సమస్తమతతత్త్వములకును తుది మాట, సమస్త మతసంప్రదాయములను ప్రేమతో లక్షించుటకుఁ దగిన యద్వితీయస్థానము. ఇదియే విజ్ఞానవంతమగు భావి మానవకోటి మత మగునని మా నమ్మకము. హీబ్రూలకంటెను నరబ్బులకంటెనుగూడ పూర్వులైన హిందువు లితర జాతులకంటె ముందుగా నీ సిద్ధాంతమునకు వచ్చినందులకుఁ బ్రశంసనీయులు కావచ్చును; ఐనను సమస్త మానవకోటిని దన యాత్మగనే కాంచునట్టి యనుష్ఠానాద్వైతము హిందువుల నడుమ సార్వజనీనముగాఁ బెంపొంద వలసియున్నది.

ఇఁకఁ బ్రత్యక్ష వ్యావహారికజగత్తునఁ జెప్పఁదగినంత వఱ కే మతావలంబులైనను నీ సమత్వము నెన్నఁడైనను సమీపింపఁగలుగుచో—సర్వసాధారణముగా నిందలి తత్త్వ

మును — అంతరార్థమును — హిందువులు గ్రహించినట్లు గ్రహింపకయే యనుకొందము—వారు మఱెవ్వరునుగారు, ఒక్క యిస్లాము మతావలంబులేయని మా యనుభవమును బట్టి తోఁచుచున్నది.

కావున వేదాంత సిద్ధాంతము లెంత యోగ్యమైనవియు సద్భుతమైనవియు నగుఁగాక, 'అనుభవసిద్ధమగు నిస్లాముయొక్క తోడ్పాటు లేనిదే జనబాహుళ్యమునకుఁ గేవల నిరుపయోగములని మా నిశ్చితాభిప్రాయము. బైబిలునకును ఖురానునకును వేదములకును నతీతమగు గమ్యమును మానవకోటికిఁ జూపుటయే మా యభిమతము; ఐనను బైబిలును ఖురానును వేదములను సమన్వయించుట చేతనే యీ కార్యమును సాధింపవలసియున్నది. మతము లన్నియు నేకధర్మమును నానావిధములుగా వ్యక్తీకరించుచున్నవని మానవకోటికి బోధింపవలయును. అపుడు ప్రతి వ్యక్తియుఁ దన కత్యంత మనుకూలించు మార్గము నెన్నుకొనఁగలును.

హిందూమహమ్మదీయమహామత సమ్మేళనమే— వేదాంతధీశక్తి యిస్లాము శరీరపాటవముతో సంయోగ మొందుటయే—యెన్నఁటికైనను మన మాతృదేశాభ్యుదయోపాయము.

ఈ యల్లకల్లోలమునుండియు నీ వివాదములనుండియు భావిభారతవర్షము వేదాంతవైభవముతోడను, నిస్లాముమత శరీరదార్ఢ్యముతోడను పరిపూర్ణప్రభాకలితమై, యప్రతి

హాలతమై వెలువడు చందమున నామనోవీథిని భాసించు చున్నది.

మానవాభ్యుదయమునకు, ముఖ్యముగా మన పేద భారతీయుల నిరుపేదభారతీయుల యభ్యుదయమునకు, భగవానుఁడు మిమ్ము మహాసాధనభూతునిఁ జేయుఁగాతమని నిరంతరము ప్రార్థించు మీయాప్తుఁడు, వివేకానందుఁడు.

## 118

కాశ్మీరము, 25-8 1898.

స్నేహాస్పద ,...పరమేశ్వర నిర్మిత ప్రపంచమందలి మహోజ్జ్వల దృశ్యముల నడుమ భూమి, భూరుహములు, మారుతము, హిమము, మానవాకృతులు మున్నగు వానిమూలమున జగదీశ్వర సౌందర్యమును బాహ్యముగనే కానిమ్ము ప్రకటించుచుఁ బ్రకృతిసీమంతినీ విహారము సలుపు తావులందు మనోహరమగు జీలమ్‌నదీ తోయములలో, నానివాసమగు నావయందు దటునిటు మెల్లఁగాఁ దేలియాడుచు,—'నా' యనునది, యెుదకొక లేశనిక్షైవను, లేకుండ, ఎపుడెచట ననుకూలించునో యపుడచటఁ గుకుచుచు, రెండునెలలుగా సోమరినై, సాక్షాత్తు రిప్ వాన్ విన్‌కిల్ (Rip van Winkle) వ కాదర్శప్రాయుఁడనై మనుచున్నాను!...

మితిమీరి పనిచేయుచు మనశ్శరీరములను బాడుచేసికొనకుము. దానివలన లాభములేదు; "కర్తవ్యమును

మధ్యందిన మార్తాండుఁడు తన ప్రచండకిరణములచే మానవాత్మను దహించుచున్నాఁడు” అని సదా మది నెంచుకొనుము. కర్తవ్యాచరణమనునది శిక్షారూపమున, సాధనరూపమునఁ, గొంతవఱ కావశ్యకమే, అటుపైన నది పీడకల. మనము తోడ్పడినను, తోడ్పడకున్నను సరియే, ప్రపంచము సాగుచునే యుండును, ఆఁగిపోదు. భ్రాంతిమతులమై మనమే మనశ్శరీరములను బాధ చేసికొనుచుందుము. “లోకులు తనయెడ సలుపు ప్రతి దుష్కార్యమునకును లోఁబడుచు, వారిని బాధచేయునట్టి స్వార్థరాహిత్యము” మితిమీఱిన దురభిమానము కాని మఱియొకటి కాదు. మన స్వార్థరాహిత్యముచేఁ బదులను స్వార్థపరులను జేయు మనకధికారము లేదు; కలదా?... మీ వివేకానందుఁడు.

## 119

బేలూరుమఠము, 15 12 1898.

ప్రేమాస్పద ,....జగన్మాతయే మనకందఱకును మార్గదర్శకురాలు; ఏది జరిగినను, జరుగనున్నను నామె నియమాధీనమే.... మీ వివేకానందుఁడు.

## 120

వైద్యనాథము, 29 12 1898.

అభిన్నహృదయ ,..ఊరకే కాలయాపన చేయుచు బలవంతముగానైనను విశ్రాంతి నొంద యత్నించుచున్నాను.
...—సదా నీ ప్రియపుత్రుడు, వివేకానందుఁడు.

**121**

బేలూరుమఠము, 11 4 1899.

ప్రీతిభాజన , ... రెండేండ్ల శరీరదుర్గతి నాయిరువదేండ్ల యాయువును హాని కూర్చినది. కాని యాత్మ మారదు, మారునా? ఈ వెఱ్ఱియాత్మారాముఁ డింకను భల్లూకపుఁ బట్టుతో నొక్కటే భావము నంటిపట్టుకొనియున్నాఁడు....

మీ వివేకానందుఁడు.

**122**

రిజ్లీ, సెప్టెంబరు, 1899.

ప్రేమాస్పద , ... అల జగన్మాత కెఱుక, నన్నుఁ గూర్చి నేఁ జెప్పవలయున దిదియే. ... మీ వివేకానందుఁడు.

**123**

న్యూయార్క్, 15 11 1899.

స్నేహాస్పద , ... మొత్తముమీఁద శరీరస్థితినిగూర్చి నే నాందోళన మొందవలసిన దేమియు లే దనుకొందును. నాడీదౌర్బల్యముతోఁ గూడిన యిట్టి శరీరమే యొక్కొక్కప్పుడు దివ్యగానము నాలపించుటకును మఱియొకప్పు డంధకారమున మూలుగుటకును సరిగాఁ దగిన సాధనము.

... మీ వివేకానందుఁడు.

**124**

రిజ్లీ, 18 11 1899.

ప్రియవర—, ... నీవు వ్యాకులచిత్తుఁడవై యున్నట్లు తోఁచు చున్నది. చింతింపకు, ఏదియుఁ గలకాలము ఉండఁబోదు. ఏమైనను సంసారము శాశ్వతముకాదు. ఇందులకు నాకుఁ

చాల సంతోషము, లోకమున సత్తమోత్తములును ధీరాగ్రేసరులును బాధపడవలసివచ్చుచుండును ఐన ననేక యుగముల పర్యంతము, సాధ్యమగుచో లోకము చక్కఁబడు పర్యంతము, ఇహమున ఈ సంసార స్వప్నమును భేదించుటకైనను ఇది యొకసాధన. ప్రసన్నచిత్తుఁడనై యున్నంతటి నేను నా బాధల కానందించుచుందును. ఎవరోయొకరిచట బాధపడవలయును: ప్రకృతి సాగించు మహాయజ్ఞమున నావంతు వచ్చినందుకును నాకానందము, మీ వివేకానందుఁడు.

**125**

లాస్ ఏంజలిస్, 6 12 1899.

స్నేహాస్పద , ఆఱవతేదినాఁటి నీలేఖ యందినది, కాని నాయదృష్టమున నింకను ఏమార్పును గలుగలేదు. మార్పు మంచిదనియేనా నీ యభిప్రాయము! ఈ విధముగా దుఃఖానుభవము నాస్వాదించుటయే కొందఱినైజము. స్వదేశీయుల నిమిత్తము నేను తాపత్రయపడియుండనిచో మఱి యెవ్వరి నిమిత్తమో తాపత్రయపడియుందును, సందియము లేదు. ఇది కొందఱికి మార్గము — అని నాగట్టి నమ్మకము. మనమందఱము సౌఖ్యమును గోరుదుము, నిజమే, కాని కొందఱు దుఃఖానుభవమున సుఖమందుచున్నారనుట విచిత్రము, కాదా! ఐనను బాధలేదు. కాని సుఖదుఃఖములు రెండునుగూడ సాంక్రామికములే. నేనే భగవంతుఁడైనచో రోగమునకు బదు లారోగ్యమును సాంక్రామికముగాఁ జేసియుండునని ఇంగర్ సాల్ (Ingersoll) ఒకప్పుడు చెప్పినాఁడు.

అధికముగాఁ గానున్న తుల్యముగానైనను నారోగ్య మనారోగ్యమంతటి సాంక్రామికమేయని, పాప మాతఁ డెఱుఁగఁడు! ఇదియే ప్రమాదము. లోకమున నేను సుఖినై యున్నచో బాధలేదు, దుఃఖితుఁడనై యున్నను బాధలేదు, —ఇతరులకుమాత్ర మది సంక్రమింపరాదు. ఇదియే గొప్ప నేరిమి. ప్రవర్తక ఆచార్యుఁడు — లోకులస్థితినిగూర్చి పరితాపపడ నారంభించినంతనే మొగము ముడుచుకొని గుండెలు బాదుకొనుచు, నిఁకఁ బ్రతివారితోడను, "చేను మేయుఁ" డనియు, "బూడిదె బుస్సన్నలుకం" డనియుఁ, "బెంట కుప్పలపైఁ గూర్చుండుఁ" డనియు, "మూలుగుఁ" డనియు, "విలపింపుఁ" డనియు బోధింప నారంభించును! ఇట్టి వారందఱును దోషభూయిష్ఠులని నాకుఁ దోఁచుచున్నది. కాను. దోషభూయిష్ఠులే. లోకుల భారమును నీతలపైఁ బెట్టుకొన నీవు సంసిద్ధుఁడవైనఁ దప్పక పెట్టుకొనుము. కాని నీమూలుగులను శాపములనుమాత్రము మాకు వినఁబడనీయకుము. నీబాధలచే మమ్ము భయపెట్టకు, భయపెట్టితివా, మాభారములన్నిటితో మేమే నీకంటె మేలైనవారమని భావింపఁగలము. నిజముగా లోకుల భారమును దాను వహించువాఁడు వారల నాశీర్వదించి తన దారిని దాను బోవును. లోకమునఁ జెనుగు లేదని కాదు, కాని దానిని దాను స్వయముగా, ఇచ్ఛాపూర్వకముగాఁ దన మాఁపున వహించుచున్నాఁడు కావున నాతఁడు నిందాపూర్వకముగాఁ గాని, ఖండనపూర్వకముగాఁగాని, ఒక్క మాటనైనను

బలుకఁడు. ‘‘ఆనందించుచుఁ దనదారిని బోవలయువాఁడు’’ రక్షకుఁడు కాని రక్షితుఁడు కాఁడు.

ఇదియే నేఁటి యుదయము నేను బొందిన మహోవికాసము. ఈ వికాసము నా హృదయాంతర్గతము, నాకుఁ దోఁచు నీవరైయున్నఁ జాలును.

రండు, దుఃఖభారమునఁ గ్రుంగుచున్న మీరు మీ భారమంతయు నాపై విడి, మీ యిచ్చవచ్చినట్లుచేసి సుఖించుచు, నా మనుగడమాటయు మఱచిపొండు. మీరు నాకు శాశ్వత ప్రేమపాత్రులని గ్రహింపుఁడు. మీ తండ్రి వివేకానందుఁడు.

**126**

12-12-1899.

అమ్మా మీ యభిప్రాయమే సరియైనది, నేను క్రూరుఁడనుఁ నిజముగా నతిక్రూరుఁడను. కాని మార్దవమనునది యేమైనను నావద్దఁగాన్పించిన, అది నాదోషము. అది యింకను స్వల్పముగా, బహు స్వల్పముగా నుండియుండవలె నని కోరెదను అది నా దౌర్బల్యము ఆహా! నా బాధ లన్నియుఁ దన్మూలముననే. .. నా వత్సలయెడఁ గలిగినవాత్సల్యల నుపయోగించుచున్నందులకుఁ జాల చింతిలుచున్నాను, కాని లోకమున మఱి యే యితరులకంటెను నేను వారిని విశేషముగాఁ బ్రేమింతునను సంగతియు వారెఱుఁగుదురు. నాకు దైవసాహాయ్య ముండియుండవచ్చును నిజమే, కాని, యాహా! ఆ దైవసాహాయ్యమునఁ బ్రతిలేశమును నా రక్తమాంసములను బలిగా గ్రహించినది!! అట్లు కానియెడల

విశేషముగ సంతసించెడివాఁడను, విశేషధార్ఢ్యము గలిగి యుండెడివాఁడను. వర్తమాన పరిస్థితులు నిజముగా నతి విషాదకరముగాఁ దోఁచుచున్నవి, కాని నేను యోధుఁడను, రణరంగమున యుద్ధమొనర్చుచు మరణింతును—అధైర్య పడను—అందువలననే నా వత్సలను జూచి వెఱ్ఱియావేశముఁ జెందుచుందును. పోరాడుఁడని నేను వారికిఁ జెప్పను, కాని నాపోరాటమున కష్టపడకుఁడని మాత్రము చెప్పుదును.

...గొప్ప తప్పిదములు చేసియున్నాను, కాని యవి యన్నియు మితిమీఱిన ప్రేమమూలముననే సంభవించినవి. ఇస్సీ! ప్రేమ యెంత నింద్యమో! అసహ్యమో! భక్తియను నది నాకు లేకుండిన నెంత బాగుండెడిదో కదా! నిశ్చయ ముగా! శాంతచిత్తుఁడను గతినాత్ముఁడను నగు నద్వైతినై యుండిన నెంత మేలైయుండెడిదో కదా! సరి, యీ జీవితము గడచినది; ముందుజన్మమునఁ బ్రయత్నింతును. నామిత్రులకు నావలన నాశీస్సులకంటె విశేషముగా బాధయే సంప్రాప్త మైనదని ముఖ్యముగా నిపుడు విచారించుచున్నాను. నే నన్వేషించుచున్న శాంతి—ప్రశాంతి—నా కెన్నఁడును జిక్కలేదు.

పక్కెండ్లక్రితము హిమాలయములకు, అటనుండి మఱల రాకుండు సంకల్పముతో వెళ్లినాను; నా సోదరి యాత్మహత్యచేసికొనినది, ఆ వార్త నా చెవినిఁ బడినది, హృదయదౌర్బల్యము ప్రశాంతినొందు నా యునశాశమును

గంగపాలుచేసినది!! నా ప్రేమాస్పదులకుఁ దోడ్పడుమార్గము నన్వేషించు నిమిత్తము హృదయదౌర్బల్యమే నన్ను భారత దేశమునుండి బయటికిఁ దఱిమినది, ఇపు డిచట నున్నాను! శాంతిని బడయఁ బ్రయత్నించియున్నాను, కాని భక్తికిఁ దావలమగు హృదయము నన్ను దానిని గననీయకున్నది. ఎంతసేపు పోరాటము, వేదన; వేదన, పోరాటము! కానిమ్ము, ఇది నావిధి కావున నెంత త్వరితముగా సమాప్తమైన నంతమేలు. లోకులు నన్ను "ఎంత తోఁచిన నంత చేయువాఁడు" అందురు, కాని పరిస్థితులను గమనింపుఁడు!!! నాయం దింతటి ప్రేమానురాగములుగల మీకు, అఖండ దయామయురాండ్రగు మీకు. నావలన బాధ కలిగినదని చాల చింతించుచున్నాను. ఐనదేవో యైనది, ఇఁక సమస్యను బరిష్కరింతును, లేదా, తత్ప్రయత్నమునఁ బ్రాణములు విడుతును. —సదా మీ పుత్త్రుఁడు, వివేకానందుఁడు.

మఱియొకమాట....మీ లేఖ యందినపిమ్మట నే నిపు డెంతో యుల్లాసముగా నున్నాను, అనేకసంవత్సరములుగా నిట్టి యుల్లాసమును—సంతోషమును—పొందలేదు—"వా గురుకీ ఫతె!"* ఔను, ప్రపంచమెదురై రానిండు, పాతాళ మెదురై రానిండు, దేవత లెదురై రానిండు, జగదీశ్వరినే రానిండు. నేను పోరాడెదను, విడువను. స్వయముగా భగవానునితోడనే పోరాడుటచే రావణుఁడు మూఁడుజన్మములలో ముక్తుఁడైనాఁడు! జగ

* అనఁగా, "జయ గురుదేవ!" యని భావము.

దీశ్వరితోఁ బోరాడుట మహోత్కృష్టముగదా,...
వివేకానందుఁడు.

**127**

లాస్ ఏంజిలిస్, 23 12 1899.

స్నేహాస్పద—,...ఏమైనను నే నారోగ్యముగనే యున్నాను. శరీరవిషయమున భయపడవలసినదేమియు సంభవింపలేదు — నాడీదౌర్బల్యము, అజీర్ణము — ఇవియే నన్ను బాధించినవి.

భోజనమునకు ముందుగాఁగాని, తరువాతఁగాని ప్రతిదినము మైళ్ళకొలఁది నడచుచుందును. ఇప్పుడు పూర్తిగా నారోగ్యవంతుఁడనై యున్నాను ఇఁకనిట్లే యుందునని నానమ్మకము.

పరిస్థితులు శుభసూచకముగా నున్నవి. అమ్మయే యిట్లొనరించుచున్నది. తనపని కానిదే, అమ్మ నన్ను విడువఁజాలదు ఇదియే రహస్యము...

ఇంగ్లాం డెట్లు ముందంజవేయుచున్నదో చూడుఁడు. రక్తపాతప్రియులగు వీరు యుద్ధమునుగూర్చి కలవరించుటకు బదు లిటుపైన నుత్తమాశయములనుగూర్చి చింతించుట కవకాశము గలుగును. అదియే మనకుఁ దరుణము. పరుగున వెడలి, మనము పదులకొలఁది జనులను జేపట్టి, భారతోద్యమమును చకచక నడిపింపవలయును... — వివేకానందుఁడు.

128

లాస్ ఏన్జలిస్, 24-1-1900.

స్నేహాస్పద—, నే నన్వేషించు శాంతియు విరామమును నా కెన్నఁడును లభింపవేమో యని నాశయము, ఐనను అమ్మ నా మూలమున నిలదులకు, నా మాతృదేశమున నధమము కొండలకై నను మే లొనఁగూర్చుచున్నది; ఇది యొక యజ్ఞమను భావమున—ఆత్మసమర్పణ భావమున—నేమి సంభవించినను సరియే యని మనస్సమాధానము నొందుట సులభముగదా! ఒకవిధముగాఁ బ్రతివ్యక్తియు బలియే—ఆహుతియే — మనమందఱము నాహుతులమే. మహారాధన సాగుచున్నది—ఇది మహాయజ్ఞమని భావించి ననే యిందలి పరమార్థము బోధపడును. మనఃపూర్వక ముగా నాత్మార్పణమునకు సంసిద్ధులగువారికి విశేషముగు బాధ తొలఁగును. సంసిద్ధులుకాక, ప్రతిఘటించువారో, విధి బలాధీనులై విశేషబాధ ననుభవింతురు. ఇచ్ఛాపూర్వక ముగా బలియగుటకై నే నిపుడు నిశ్చయించుకొనియున్నాను.

—మీ వివేకానందుఁడు.

129

లాస్ ఏన్జలిస్, 15-2-1900.

ప్రేమాస్పద—,...నీవు నీ గుణపాశములను నేర్చుకొను చున్నావు—అదియే నేను గోరునది. నేనును నేర్చుకొను చున్నాను; మన మర్హులమైనంతనే ధన మానవ సాధన సంపదలు స్వయముగా మనవద్దకువచ్చి ఁడును. నా నాడీ దౌర్బల్యమునకును నీ వీరావేశమునకును జత కుదిరినచో,

నిపుడంతయుఁ ప్రాయికముగా నల్లకల్లోలమగును. అమ్మ యందుచే నా దౌర్బల్యమును ద్రోలఁగించి నీకు సమభావమును నేర్పుచున్నది. ఇఁక మనకు భయములేదు. ఈసారి మనకు సుస్థిరముగు మే లొనఁగూడును అని నా నిశ్చయము. ఇఁకఁ బురాతనప్రపంచము నుట్టూఁతలూఁపివేయుదము.

ఆందోళనపడక ధైర్యమున నన్నిటికిని సంసిద్ధుఁడ నగుచున్నాను—ఏమి జరిగినను జరుగనిమ్ము, సిద్ధముగా నున్నాను తరువాతి మెట్టు ఒక్కటియుఁ దప్పి పోరాడు విజయము నొందితీరవలయును — ఇది తరువాతి కథ. నీవు నాకు అత్యంత ప్రేమాస్పదుఁడవని గ్రహింపుము.

వివేకానందుఁడు.

## 130

కాలిఫోర్నియా, 21-2 1900.

స్నేహాస్పద , నీ లేఖ మూలమున వార్తలను వివరముగాఁ దెలిసికొనఁగలిగినందులకుఁ జాల సంతోషము. పాండిత్యము జ్ఞానమును కేవలము పైపై మెఱుఁగులు, కాని సర్వశక్తినిలయము హృదయము. ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తి యుతమగు నాత్మకు నిలయము హృదయమే కాని మెదడు కాదు. "శతం చైకాచ హృదయస్య నాడ్యః హృదయ నాడులు నూట యొక్కటి," ఇత్యాది. హృదయముదాపున నుండు (Sympathetic Ganglia అనఁబడు) ప్రధాన నాడీ గ్రంథియే యాత్మమర్గము. హృదయము నెంతవిశేషముగా వ్యక్తమొనర్పఁ గలుగుదుమో యంతటి ఘన విజయమును

సాధింపఁగలుగుదువు. ధీసముద్భవ భావముల నే కొందఱో గాని గ్రహింపజాలరు, కాని యాబాలగోపాలము, ఎల్ల వారును హృదయసంజనిత భావములను ప్రేమానురాగా దులను గ్రహింపఁగలరు. కాని మన దేశమున మనము మృతప్రాయులై యున్నవారిని మేల్కొల్పవలసియున్నది. ఇందులకుఁ గొంత కాలము పట్టును, కాని యఖండసహాన మును దీక్షయు మీకున్నచో, అచిరకాలముననే విజయము నంది తీరుదురు.

*　　*　　*　　*

కాటకము, వఱదలు, వ్యాధులును జెలరేఁగుచున్న యీ రోజులలో మీ 'కాంగ్రెస్‌వారు' ఏరీ? ఎక్కడ నున్నారో నాకుఁ జెప్పుఁడు! "ప్రభుత్వమును మా యధీనము చేయుఁడు, మాకు స్వారాజ్యము కావలయును" అనుట తోడనే సరిపోయినదా? మీ మాటలను విను వారేరీ? పనిచేసినయెడల నోరు తెఱచి యడుగవలయునా? వేర్వేఱు జిల్లాలలో నీవంటివారు రెండువేలమంది నడుము కట్టుకొని పనిచేయుచున్న ఆంగ్లేయులు తమంత తాము వచ్చి ముఖ్య రాజకీయ విషయములలో మీతో సంప్రతింపరా? "స్వకార్య ముద్ధరేత్ప్రాజ్ఞః। ప్రాజ్ఞుఁడగువాఁడు స్వకార్యము నుద్ధ రించుకోవలయును,"...."ఒక్కొక్క తాయి తీయుచు వచ్చిన, కొండయినను దఱుఁగును." ఒక మహాకార్యము జరుగు సమయమున, రాజమార్గము నిర్మింపఁబడునెడ, అమానుషశక్తి యావశ్యకమగు పరిస్థితులందు బ్రహ్మాండ

మగు నాటంకములను గష్టములను నెదుర్కొనుచు, నేనొక రిద్ద అసాధారణ వ్యక్తులో నిశ్శబ్దముగా, నిరాడంబరముగాఁ బనిచేయుచుందురు. వేలకొలఁది జనులు లబ్ధినొందినపుడు కోలాహల ముదయించును, దేశమున నప్పు డెచటఁ జూచి నను హర్షధ్వనులే, జయజయ ధ్వానములే. రథము బయ ల్వెడలినది. యంత్రము చకచక పనిచేయసాగినది. ఇఁక నొకపిల్లవాఁడైనను దానిని నడుపవచ్చును, అర్భకుఁడైనను దానివేగము నొకించుక హెచ్చింపవచ్చును. ఒకటి రెండు గ్రామముల కొనర్పఁబడిన యీ తోడ్పాటు, ఇరువదిమంది యనాథవ్యక్తులతోఁ గూడిన యీ శరణాలయము, ఆ పది పదునేనుగురు కార్మికులు వీరే యనశ్వరమగు బీజమును నాటఁజాలుదురని గ్రహింపుము. వీరిమూలమున సకాలమున వేలకొలఁదిమంది, లక్షలకొలఁదిమంది, లబ్ధినొందుదురు. మన కిపుడైదాఱుగురు సింహసాహసాన్వితులు కావలసియున్నారు. వీరు దొరకినచో వీరి తోడ్పాటున వందలకొలఁదిమంది యల్పులైనను నద్భుతకార్యములను గొనసాగింపఁగలరు.

రక్షణ గోరుచు, నీవద్ద కనాథ బాలికలు వచ్చుట తటస్థించుచో, నన్నిటికంటెను ముందుగా వారికి నీవు చేయూఁత నీయవలయును. లేకున్నచో, ఆ నిర్భాగ్య రాండ్రను క్రైస్తవ ప్రచారకు లెత్తుకొనిపోవుదురు! వారి రక్షణార్థము ప్రత్యేకమైన వసతులును దగిన యేర్పాట్లును సిద్ధముగా లేకున్న నేమి? జగజ్జనని కృపవలన నన్నియు సమకూరును. ఏనుఁగు దొరకినపు డంకుశముకోసము తాప

శ్రేయస్కరము...నీ చేతికి దొరకినవా రెవరైనను సరియే, వారిని చేఁదీయుము, లేనిపోని యెన్నికల కిది సమయము కాదు—కాలక్రమమున నన్నియుఁ జక్కఁబడును. ప్రతి మహాకార్యమునను అనేకమైన యాటంకముల నెదుర్కొన వలసియుండును, కాని క్రమముగా దారి తిన్నఁబడును.

...నిర్భయముగాఁ బని సాగింపుము—నీవే వీరుఁడవు! సెబాసు! దివ్యముగా — మహాత్మునికిని దివ్యముగా నున్నది—నీవు సాగించుచున్న యుద్యమము! భాగల్పూరమున కేంద్రమును నెలకొల్పుట—బడిపిల్లలకు బోధించుట—ఇవన్నియు సత్కృష్టాశయములు—లేశమును సందేహము లేదు. కాని దీనులకు, పేదలకు, చదువుసంధ్య తెలియఁగని రైతుబిడ్డలకు, కార్మికులకు—వీరి పురోవృద్ధి నిమిత్తమే—మన యుద్యమము; మొదట వీరి యభ్యుదయమునకుఁగాను చేయవలసినదంతయుఁ జేయవలయును— తరువాత, వ్యవధి యున్నచో సంపన్నులమాట చూడవచ్చును. ఈ రైతులును ఈ కార్మికులును వీరిపై మనము చూపు ప్రేమ సానుభూతులవలన మనమాటను దలఁదాల్తురు. తమ గ్రామములలోఁ గొంచెము కొంచెముగా ధనము ప్రోగుచేసి కాలక్రమమున సేవాశ్రమమును నెలకొల్పువారు వీరే, క్రమముగా వీరియందుండియే బోధకులు బయలు దేఱుదురు.

పొలముకాపుల బాలబాలికలకుఁ జదువుట, వ్రాయుట మొదలైనవానిని నేర్పి, వారిహృదయమున సదాశయములను నెలకొల్పుము....తమ స్థితిగతులనుగణించి, తోడ్పా

టును నభివృద్ధియుఁ దమ కెంతయావశ్యకములో వారు గ్రహింపసాగినంతనే నీ యుద్యమము ఫలప్రదమగుచున్నదని, సక్రమమార్గమున సాగుచున్నదని, గుర్తింపుము. ధనికులును నగ్రవర్ణజులును దయాధర్మభిక్షగాఁ బీదలకుఁ జేయు నల్పమగు తోడ్పాటు చిరస్థాయిగాదు, పైపెచ్చు తుదకది యుభయులకును హానికరమై పరిణమించును... కాని ధనికులకును కార్మికులకును నడుమ కక్షలను, కార్పణ్యములను మాత్రము నీవు వెలువడఁ జేయరాదు—ఈ విషయమున నీవు జాగరూకతతో మెలఁగవలయును. సంపన్నజాతులను మాపింపఁ బోకుము—''స్వకార్యముద్ధరేత్ ప్రాజ్ఞః—ప్రాజ్ఞుఁడగువాఁడు స్వకార్యమును జక్కబెట్టుకోవలయును.''

జయ! గురుదేవ! జయ! జగన్మాత! భయమేమి! అవకాశము, ఉపాయము, తద్వినియోగము—అన్నియు స్వయముగనే వచ్చును. ఫలమును నేను లెక్కసేయుదును. ఈ మాత్రము నీవు చేయఁగలిగితివా, నాకు బ్రహ్మానందము. గ్రంథములు, వాదోపవాదములు, సిద్ధాంతరాద్ధాంతములు—ఇవన్నియు వయఃపరిపాకమున నా కిప్పుడు రోఁతగా—విషతుల్యముగాఁ—దోఁచుచున్నవి. కార్యశూరులను నేను శిరసావహింతును. ఇది నిశ్చయమని గ్రహింపుము. వ్యర్థవాగ్వాదములును లేనిపోని యట్టహాసమును జగద్ధితాచరణము నిసుమంతయు సాగనీయక, మన కాలమును శక్తిసామర్థ్యములను హరించివేయుచున్నవి. ''మాభైః—భయములేదు.'' వహావా! వీరుఁడవఁగా నీవే! గురుదేవుఁడు నీ హృదయమున

నధివసించుఁగాక! జగజ్జనని నిన్ను నడిపించుఁగాక! — మీ స్నేహాస్పదుఁడు, వివేకానందుఁడు.

## 131

శాన్ ఫ్రాన్సిస్కో, 4-3-1900.

ప్రేమాస్పద—, పనిచేయవలయునని నేను గోరను. ప్రశాంతముగా నుండి విశ్రాంతి నొందవలయునని కోరెదను. ఇందులకుఁ దగు దేశకాలములును నాకుఁ దెలియును. కాని, విధి నన్ను "పనిచేయుము, పనిచేయుము" అని ముందునకుఁ ద్రోయుచున్నట్లు తోఁచుచున్నది. వధశాలకుఁ గొనిపోఁబడుచుండ, బాటప్రక్కనున్న పచ్చికను బట్టుచు తొందర తొందరగాఁ గొఱికి నములుచుండునట్టి పశువులవంటివారము మనము. శోకమూలము, రోగమూలము, మఱియెన్నిటికో మూలమునగు భయము—ఇదియంతయు మన కర్మము. ఒరుల కెక్కడ హాని చేయుదుమో యను మితిమీఱిన భయమువలననే వారికి మఱింత హానిచేయుచుందుము. చెడుగును గీడును దొలఁగించుకొనవలయునని విశ్వప్రయత్నము చేయుచు వానిబారినే పడుచున్నాము.

ఏమి యర్థరహితమైన యభిమానమున కధీనుల మగుచున్నాము!! ఈ యభిమానాదులవలన మన కేమియు లాభములేదు. దేనిని మనము తొలఁగించుకొనఁగోరు చుందుమో, యా దుఃఖమునకే యవి మనలను గుఱిచేయు చుండును.

నిర్భయులమై, సాహసాన్వితులమై, దేనిని లక్ష్యపెట్ట కుండుట — ఓహో! ఎంతటి మహాభాగ్యము!...—మీ వివేకానందుఁడు.

**132**

శాన్ ఫ్రాన్సిస్కో, 25 3 1900.

ప్రేమాస్పద , నాకిపు డారోగ్యమును విశేషమైన బలమును గలుగుచున్నవి. మోక్షు మతిసన్నిహితమై యున్నట్లు నాకొకొక్కప్పుడు తోఁచుచుండును, రెండేండ్లనుండి నే ననుభవించుచున్న యాతనలన్నియు నా కనేకవిధముల గొప్పగుణపాఠములైనవి. అనుభవకాలమున మన కేక తరణోపాయములేనట్లు తోఁచినను, పర్యవసానమున మే లొనఁగూర్చుటకే వ్యాధియు దురదృష్టమును సంభవించు చుండును.

నే నఖండ నీలాకాశమును; నాపై నెన్నిమబ్బులు గుమికూడినను నే నఖండ నీలాకాశమనే.

నాకును బ్రతివ్యక్తికిని స్వభావసిద్ధమని నే నెఱింగి యున్న ప్రశాంతి ననుభవింపఁ బ్రయత్నించుచున్నాను. పైపై మెఱుఁగులతోఁ గూడిన యీ యస్థిపంజరములవలనను సుఖదుఃఖాత్మకమైన యీ మాయాస్వప్నములవలనను నేమి ప్రయోజనము?

నా స్వప్నము లంతరించుచున్నవి. ఓం తత్ సత్! —మీ వివేకానందుఁడు.

133

శాన్ ఫ్రాన్సిస్కో, 23-3-1900.

ప్రీతిభాజన—, నీ యుత్తరమును గని బ్రహ్మానందపడు చున్నాను. మనము చలింపనిచోఁ బరిస్థితు లనుకూలపడి తీరును.... తీవ్రముగాఁ బనిచేయుచున్నాను — తీవ్రముగాఁ బనిచేసినకొలఁదియు దేహస్థితి బాగుపడుచున్నట్లు తోఁచు చున్నది. ఈ యనారోగ్యము నాకుఁ జాల మేలు చేసినది— నిశ్చయము. అనాసక్తి యనఁగా నేమో నిజముగా నాకు బోధపడుచున్నది. అచిరకాలముననే పరిపూర్ణముగా ననా సక్తుఁడను గాఁగలనని నా యాశయము.

ఒకే కార్యమునం దాసక్తులమగుటకై మన శక్తి సామర్థ్యముల నన్నిటి నేకాగ్రమొనర్చి ప్రయోగించు చుందుము, కాని దానితో సమముగాఁ గష్టమగు మిగిలిన యంశమున—ఏ కార్యమున నిమగ్నులమై యున్నను క్షణ ములోఁ దద్విషయమున ననాసక్తులము కాఁగలుగుటకై— ఎన్నఁడును శ్రద్ధవహింపము.

ఆసక్తియు ననాసక్తియు రెండునుగూడ పూర్ణ వికా సము నొందినప్పుడే మానవుఁడు మహాత్ముఁడును సుఖియుఁ గాఁగలఁడు.

...ప్రతిదినము, ఉదయ సాయం సమయములందుఁ బనిచేయుచు, నెప్పు డేది ప్రాప్తించునో యపుడు దానిని భుజించుచు—రాత్రి పండ్రెండు గంటలకుఁ బండుకొను చుందును—కాని యేమి గాఢ నిద్ర!! ఇంతకు ముం దెన్నఁ

డును నిట్టి నిద్రపోయియెఱుఁగను!! ఆప్తుఁడు, ఆశీర్వాదకుఁడు, వివేకానందుఁడు.

## 134

చికాగో, 6 4 1900.

ప్రేమాస్పద ....మనస్సు సర్వగతము, ఎచట నుండి యైనను నొరుల మనోభావములను గ్రహింపవచ్చును, స్వయముగా వినవచ్చును.... మీ వివేకానందుఁడు.

## 135

## అమెరికా దేశీయుఁడగు నొక మిత్రునకు

శాన్ ఫ్రాన్సిస్కో, 7 4 1900.

కాని యిపుడు నెమ్మదిగా, ప్రశాంతముగా నున్నాను
మును పెన్నఁడును నిట్టి ప్రశాంతి ననుభవించి యెఱుఁగను. స్వశక్తినే నమ్ముకొని తీవ్రముగా, మహానందముగాఁ బని చేయుచున్నాను. పని చేయుటకే నా కధికారము, మిగిలిన దంతయు జగన్మాత కెఱుక.

నేననుకొనినదానికంటె విశేషకాల ముండి యిచటఁ బనిచేయవలసియుండునని మీరు తెలిసికొనవచ్చును. కాని కలవరపడకుఁడు. నాసమస్యల నన్నిటిని నేనే పరిష్కరించుకొందును. నా కిపు డేలోటును లేదు; మఱియు యథార్థము గ్రహింప నారంభించుచున్నాను. విజయము నన్నుఁ బెడదారిని బెట్టియుండెడిది, నేను సన్న్యాసినను సత్యమును విస్మరించి యుండెడివాఁడను. కావుననే అమ్మ నా కీ యనుభవమును గూర్చుచున్నది.

నా నాక శాంతిసందీప్త రక్షణస్థానమును—ఎందుండి పునరావృత్తి లేకుండునో యట్టి గమ్యమును—సమీపించుచున్నది. జయ! మాత! జయ! జగన్మాత! నా కిపుడే కోరికయు నే యాశయును లేదు. జగన్మాతృకటాక్షము! రామకృష్ణుని దాసుఁడను నేను; కేవల యంత్రమను. మఱేమియు నాకుఁ దెలియదు, తెలిసికొనవలయుననియు లేదు. జయ! శ్రీగురుదేవ! జయ! శ్రీగురుదేవ!

## 136

## అమెరికాదేశీయుఁడగు నొక మిత్రునకు

అలమేడ, కాలిఫోర్నియా, 12-4-1900.

అమ్మ మఱల ప్రసన్నురాలగుచున్నది. పరిస్థితులు శుభసూచకములై యున్నవి, ఉండితీరవలయును.

కర్మ మెప్పుడును దోషభూయిష్ఠము. అనారోగ్యరూపమున నీ దోష సంచయ ఫల మనుభవించినందులకు నాకు సంతోషము. తన్మూలమున మఱింత మనఃప్రసాదము లభించినది. ఇదివఱ కెన్నఁడును ననుభూతముకాని యొక విధమైన మార్దవమును బ్రశాంతియు నిపుడు జీవితమున భాసించుచున్నవి. ఏ కార్యమునకైనను నాసక్తుఁడ నగు విధానమును ననాసక్తుఁడనగు విధానమును నిపుడు నేర్చుకొనుచున్నాను, సంపూర్ణ మనోనిగ్రహము లభించుచున్నది....

స్వకార్యమును అమ్మయే చేసికొనుచున్నది; కావున నే నిపు డంతగాఁ దాపత్రయపడుట లేదు. నావంటి మిడుతలు వేలకొలఁది యనుక్షణము నంతమొందుచుండును. ఐనను

నామె కార్యము సాగుచునేయుండును. జయ! మాత!... కేవలుఁడనై మాతృసంకల్పప్రవాహమునఁ గొట్టుకొనిపోవుచున్నాను—ఇదియే నా జీవిత కథ. ఏ క్షణమున నిందులకు భిన్నముగా వర్తింపఁ బ్రయత్నించితినో యా క్షణముననే హానిపొందియున్నాను. మాతృసంకల్పమే నెఱవేఱుఁగాక!

ఆత్మశాంతి నందుచు, నానందమయుఁడనై మునుపటి కంటె విశేషముగా సన్న్యాసినై మనుచున్నాను. ఆప్తప్రేమ యనునది నానాఁటికి క్షీణించుచున్నది, మాతృప్రేమ వికసించుచున్నది. దక్షిణేశ్వరవన వటవృక్షముక్రింద శ్రీరామకృష్ణునితో జాగరమునఁ గడపిన దీర్ఘరాత్రములు తలఁపునకు వచ్చుచున్నవి. ఇఁక నుద్యమమా? ఉద్యమ మేమి? ఎవరి యుద్యమము? ఎవరినిమిత్తము నేను కృషి చేయవలయును?

నేను ముక్తుఁడను, జగన్మాత యొడిలోని బిడ్డను. కర్మ మొనరించుచున్నదియుఁ గ్రీడించుచున్నదియు నామెయే. నా సంకల్పము దేనికి? ఎందులకు? నా సంకల్పమును గార్యాలోచనలును లేకయే, కేవల మామె యిచ్ఛానుసారము విషయములును బరిస్థితులును సమకూడినవి, పోయినవి. మనము ఆమె చేతిలోని కీలుబొమ్మలము.

## 137

## మిస్ మెక్లౌడ్ (Miss MacLeod) అను శిష్యురాలికి

అలమేడ, కాలిఫోర్నియా, 18-4-1900.

...కర్మ మొనర్చుట కష్టసాధ్యము. నా విధ్యుక్త కర్మ మిఁక శాశ్వతముగా నంతమొందుఁ గాక యని, నా

మానసము జగన్మాతృభావమున లీనమగుఁ గాక యని, నా నిమిత్తము ప్రార్థింపుము. ఆమె యుద్యమ మామెకే తెలియును.

*   *   *

నా కఖండ మనశ్శాంతి లభించినది. శారీరవిశ్రాంతి కంటె నాత్మశాంతిని నే నెక్కు డనుభవించుచున్నాను. జీవితయుద్ధములోని జయాపజయములు సమాప్తములైనవి. మాటకట్టుకొని ప్రయాణమునకు సిద్ధముగా నున్నాను. అల జగద్రక్షకుని యాజ్ఞకై నిరీక్షించుచున్నాను.

శివా! సర్వేశ్వరా! ఈ నా నౌక నద్దరిఁ జేర్పుము!

...దక్షిణేశ్వరవన వటవృక్షముక్రిందఁ గూర్చుండి, రామకృష్ణవచనామృతమును సమ్మోహితుఁడనై గ్రోలు బాలుఁడనే కదా నేను! అదియే నా సహజస్థితి. కర్మము, ఉద్యమము, జగద్ధితము మున్నగునవన్నియు నవాంతరముగా నామీఁదఁ బడినవి. అతని కంఠస్వరమే, నన్నుఁ బులకిత గాత్రు నొనర్చు నాతని కంఠస్వరమే, నా కిపుడు వినవచ్చు చున్నది. బంధములు సడలుచున్నవి. ప్రేమానురాగము లింకిపోవుచున్నవి. కర్మము రసహీనముగాఁ దోఁచుచున్నది. జీవితవ్యామోహము తొలఁగిపోయినది. అదిగో, సర్వేశ్వర వాణి వినవచ్చుచున్నది! "వచ్చుచున్నాను. తండ్రీ! వచ్చు చున్నాను," "గతార్థములను దలఁపక నన్ననుసరింపుము" అనుచుంటివా! "తండ్రీ! ఇదిగో, వచ్చుచున్నాను!"

…నిర్వాణము నా యెదుట దీపించుచున్నది. అనంతము, నిస్తరంగము నగు నా యనంత శాంతిసాగరమే న న్నావరించియున్న దనేకపర్యాయములు.

జన్మించినందులకు నే నానందించెదను, కష్టములనుభవించినందుల కానందించెదను; మహాప్రమాదములఁ బాల్పడినందుల కానందించుచున్నాను; శాంతిసాగరమున లీనమగుట కమందానందము నొందుచున్నాను. బద్ధునిగా నొక్క ప్రాణినైనను విడువను, బంధములు నాపై వైచుకొనను. విదేహముక్తి కలిగినను జీవన్ముక్తియే లభించినను సరియే; ఈ శరీరమందలి పూర్వ పురుషుఁడు వెడలిపోయినాఁడు. మఱల రాఁడు!

ఇందున్న గురువు, నాయకుఁడు, ఆచార్యుఁడు, వెడలిపోయినాఁడు;—బాలకుఁడు, విద్యార్థి, సేవకుఁడు మాత్రమే నిలిచియున్నాఁడు.

…ఎవ్వరితోడను నాకు జోక్యము వలదు. నాకేల? నాయకపదవిని విడిచిపెట్టి చాలకాలమైనది. ఇఁకఁ గంఠమెత్తుటకు నా కధికారములేదు. కాలప్రవాహమునందుఁబడి కొట్టుకొనిపోవునపుడే నా కఖండానందము, అట్టినిమేషములే నా జీవితమున మహోత్తమానందసమయములు. … కాలప్రవాహమును నా చేయివైచి కలఁచి యీ మహాద్భుత ప్రశాంతిని, ఇదియంతయు మహామాయ యని తోఁపించెడి యీ యఖండప్రశాంతిని, ఛేదింప నే సాహసింపను!

నా కర్మమునకు ముందు వాంఛకలదు, నా ప్రేమ ముందు వ్యక్తిభావమున్నది, నా పవిత్రతముందు భయ మున్నది, నా గురుత్వమునకు ముందున్నది యధికారతృష్ణ! ఇప్పుడివి యన్నియు నశించిపోవుచున్నవి. కాలప్రశాంతివాహి నీతరంగములయందుఁబడి కొట్టుకొనిపోవుచున్నాను. తల్లీ! వచ్చుచున్నాను. నన్ను నీ యొడిలోఁ గూర్చుండఁబెట్టు కొనుము! లోకాతీతలోకమున నీయిచ్చవచ్చినచోటికి నన్నుఁ గొనిపొమ్ము. నే నిఁక కర్తనుగాను, సాక్షిభూతుఁడను. తల్లీ! వచ్చుచున్నాను!

ఆహా! ఏమి ప్రశాంతిమయము! నా భావము లతి దూరమునుండి, హృదయాంతరాళమునుండి, వెలువడు చున్నట్లు తోఁచుచున్నది. ఆ ధ్వను లస్పష్ట రహస్యములవలె వినవచ్చుచున్నవి. ప్రసుప్తినొందుటకు ముందు కొలఁది నిమేషములు విషయములు ప్రేమానురాగ భయోద్వేగాది రహితములై ఛాయామాత్రముగాఁ దోఁచులతి ననుభూత మగు ప్రశాంతి,—ఏకతమునఁ జిత్రప్రతిమాది పరీవృతుల మైయున్నయెడ ననుభూతమగు శాంతి—యఖండశాంతి—మధురప్రశాంతి మెల్లెడలను భాసించుచున్నది....ప్రభూ! వచ్చుచున్నాను.

జగము ఉన్నది, కాని మనోహరముగ నున్నదా? —లేదు; అసహ్యముగను లేదు. ఎట్టి రాగద్వేషములను గల్గింపని బాహ్యస్వరూపమాత్రముగ నున్నది. ఆహా! ఏమి

యీ యానందము! సమస్తము యోగ్యమై, మనోజ్ఞమై భాసించుచున్నది. సుఖదుఃఖాది ద్వంద్వములు తొలఁగిపోవు చున్నవి, శరీరస్పృహయే తొలఁగిపోవుచున్నది. ఓం తత్ సత్!……—ఆప్తుఁడు, విశ్వసనీయుఁడు, వివేకానందుఁడు.

## 138

## ఆంగ్లేయుఁడగు నొక శిష్యునకు

శాన్ ఫ్రాన్సిస్కో, 26-5-1900.

సమస్త శుభములును నీ కొనఁగూడుఁగాక! ఎంతమాత్ర మధైర్యపడకుము. "శ్రీ వా గురు! శ్రీ వా గురు!" (శ్రీ గురునకు జయము! శ్రీ గురునకు జయము!) నీవు క్షాత్రపరాక్రముఁడవు. రణరంగమున మృత్యువేమము మన కాషాయము. ఉద్యమార్థము ప్రాణసమర్పణమే—విజయము కాదు—మనగమ్యము. 'శ్రీ వా గురు!!!'

దుష్టవిధి కల్పించెడి యావరణ మంధకారబంధురము. కాని నే నధీశుఁడను. నా చేయి యెత్తినంతనే, అదిగో, చూడు, అది పటాపంచలై పోవుచున్నది! ఇదంతయు వట్టి భయము. భయమునకు నేను భయహేతువను, భీతికి భీతి కారకుఁడను, నిర్భయుఁడను, అద్వితీయుఁడను, విధినియామకుఁడను, కర్మనిర్మూలకుఁడను. 'శ్రీ వా గురు!' వత్సా! సుస్థిరుఁడవై యుండుము, కాంచనాదులకు దాసుఁడవు గాకుము, ఇటు లుంటివా, మనదే విజయము!

139

న్యూయార్క్, 2-7-1900.

ప్రేమాస్పద—,...నే నెప్పుడును తెప్పిదిలీతిని జగదీశ్వరికే మెఱుక. జగదీశ్వరినిఁ బ్రార్థింపుము. నాయకత్వము వహించుట మహాకష్టము—సంఘమునకు నాయకుఁడు తన యాత్మను బలి యీయవలసియుండును....—మీ వివేకానందుఁడు,

140

ప్యారి, 25-8-1900.

ప్రేమాస్పద—,... ఉద్యమమున నే నధికారమును పదవియు నిలుపుకొనలేను కావున నే నిపుడు బంధవిముక్తుఁడను. రామకృష్ణ సేవా సంఘము (Ramakrishna Mission) నకు అధ్యక్షపదవిని వదలుకొన్నాను.

మఠాదు లిపుడు నేనుదక్క మిగిలిన (రామకృష్ణ) శిష్యులకు చెందును. అధ్యక్షత యిపుడు బ్రహ్మానందునిది, అనంతరము క్రమముగా ప్రేమానందాదులకు సంక్రమించును.

భారమంతయు నాపైనుండి తొలఁగిపోయినందులకు నాకు మహానందము, నా కిపుడు హాయిగానున్నది....

ఎవ్వరిపక్షమునను నే నిఁక వ్యవహరించునట్టివాఁడను గాను. ఎవ్వరితోడను నా కిఁకఁ జేఁపీగాని, పూఁచీగాని లేదు.

...ఒకవేళ మతి యే దుర్గుణములతో జన్మించితినని భావించినను, అసూయ, దురాశ, అధికారవాంఛయు నను

వని నాకు జన్మమునుండియు లేదని నీవు రూఢిగాఁ దెలిసికొన వలయును.

...హృదయపూర్వకముగా నీ వుపాసించుచున్నచో, అమ్మయే నీకు దారిచూపును ఇంతవఱకే నాకుఁ దెలియును.

...నీకు క్షేమ లగున దొరకులకుఁ గాకపోవచ్చును ఈ సంగతి మఱచి, పాశ్చాత్యులు, అది యేమి చిత్రమోకాని, తమకు మేలుగాఁ దోఁచినదాని నవలంబింపఁ బరులను బలాత్కరింపఁ జూచుచుందురు....

మిత్రులు కానిమ్ము, శత్రువులు కానిమ్ము సుఖ దుఃఖాదుల మూలమునఁ గర్మానుభవమునొంద మనకుఁ దోడ్పడుటకు వారందఱును నిమిత్తమాత్రులు, జగదీశ్వరి కధీనులు. కావున నెల్లరను నామె రక్షించుఁగాక!

సకల శుభములును నీకొనఁగూడుఁగాక! ఆప్తుఁడు, విశ్వసనీయుఁడు, వివేకానందుఁడు.

## 141

పారిస్, 28 8 1900.

స్నేహాస్పద ....దేవుని ధర్మమా యని సంసారము మిథ్య, అశాశ్వతము. భావిప్రపంచము వర్తమాన ప్రపంచముకంటె మేలై యుండు నెట్లు? అదియు దీని ఫలితమే కావున నింతకంటె నధ్వానముగానిచో, నధమము దీనివలెనే యుండవలయునుగదా!

స్వప్నములు, ఓహో! స్వప్నములు! సంసార స్వప్నమును గనుచునే యుందుము! స్వప్న మనెడి యింద్రజాలమీ సంసారకారణము, సంసారవిమోచనకారణమును....

ఇచట...వీరిలో మాటలాడుచు పరాసు భాష (French) నేర్చుకొనఁ బ్రయత్నించుచున్నాను. కొందఱిప్పుడే మెచ్చుకొనుచున్నారు. అనంత జగద్రహస్యమును—తలయుఁ దోఁకయు లేని కర్మమనెడి దారపుఁగండెను—దేని కొన నెవ్వరును గనుఁగొనరో, వినను బ్రతివ్యక్తియుఁ దనవట్టు నకుఁ దాను, అర్థమును కొంతసేపటివఱకైనను—క్షణకాలము తనపెత్తికిఁ దా నానందించుట కనుఁడు—కనుఁగొని వల్లె తలఁచుచుందునో, యట్టి కర్మరహస్యమునుఁగూర్చి లోకమంతటితోడను ముచ్చటింపవలయును.

సరి, యిపుడు ఘనకార్యములను జేయవలసియున్నది—కాని ఘనకార్యము లెవరికిఁ గావలయును? అదేరీతి నల్పకార్యముల నేల చేయరాదు? అవి యెట్టివో యివియు నట్టివే. అల్పకార్య మహత్త్వము—ఇదియే గీతోపదేశము. ఆ పురాతన గ్రంథమునకు జయము!!

శరీరమునుగూర్చి చింతించుటకు నాకంతగా వ్యవధి లేకపోయినది. కావున నది బాగుగానే యుండవలయును. ఇచట శాశ్వతముగా బాగుగా నుండున దేదియు లేదు. మన మపుడపుడు శరీరములను మఱచియుందుము — ఆరోగ్యమన్నను సౌఖ్యమన్నను నదియే.

ఈ జగన్నాటకమున మనము మన పాత్రలను అవి మంచివగుఁగాక, చెడ్డవగుఁగాక—నిర్వహించుచుందుము.

మనస్వప్నము ముగిసినంతనే, రంగమును వీడినంతనే, మనఃపూర్వకముగా నవ్వుచుందుము ఇదియే నా నిశ్చయము. మీ వివేకానందుఁడు.

## 142

బేలూరుమఠము, 11 12 1900.

స్నేహాస్పదుఁడాలగు—,... సెవియరు సేనాని (Captain Sevier) కొలఁది దినముల క్రితము గతించెను ఈ రీతిగా నిరువు రాంగ్లేయులు * మనకోసము, హిందువులకోసము, తమ జీవితములను సమర్పించినారు. స్వమతార్థము ప్రాణత్యాగమనఁగా నిదియే.... సత్యైకశరణుఁడు, సదా మీ వివేకానందుఁడు.

## 143

## ఒక వంగదేశీయ నారీమణికి

వైద్యనాథము, 23 12 1900.

అమ్మా నీ లేఖ యందినది. బ్రహ్మానందము. నీ యభిప్రాయము సరియైనదే. "స ఈశః అనిర్వచనీయ ప్రేమస్వరూపః ఆ యీశ్వరుఁ డనిర్వచనీయ ప్రేమస్వరూపుఁడు." నారదునిచేఁ జెప్పఁబడిన యీ భగవల్లక్షణము

---

*మరియొకరు జె. జె. గుడ్విన్. ఈతఁడు స్వామి యుపన్యాసములకు సంక్షిప్త లేఖకుఁడు. స్వామి యితనిఁ గూర్చి "నా కుడి భుజము" అని వచించియున్నాఁడు.

ప్రత్యక్షగోచరమనియు సర్వవిధములను నెల్లరచే నంగీకరింపఁ బడినట్టిదనియు నా నిశ్చయము.—నా జీవితానుభవము.... వ్యష్టి యనుదానికి వ్యక్తిగతస్వాతంత్ర్యము కలదా? కల దనిన నది యెంతవఱకుండవలయును? వ్యష్టి తన యిచ్ఛను సౌఖ్యమును సమష్టి నిమిత్తము సమర్పింపవలయునా? వలదా? అనునవి ప్రతి సమాజమును గలవరపఱచుచున్న సమస్యలు....ఆధునిక పాశ్చాత్య సమాజము నివి యెల్ల కల్లోల మొనర్చుచున్నవి. వ్యక్తిగతస్వాతంత్ర్యమును సమాజాధిపత్యమునకుఁగాను భారపోయవలయునని తెలుపు వాదము సామ్యవాదము(Socialism)అనియు వ్యక్తిపక్షమును బ్రకటించు వాదము వ్యక్తివాదము (Individualism)అనియు వ్యవహరింపఁబడుచున్నవి.

వ్యక్తిని శాశ్వతముగా సమాజమున కధీన మొనర్చుటవలనను, నిర్బంధపూర్వక శిక్షా సంప్రదాయముల మూలమునఁ గలుగు స్వార్థత్యాగమువలనను బ్రాప్తించుఫల మునకు మన మాతృభూమి దివ్యనిదర్శనము. ఈ దేశమున శాస్త్రవిధుల ననుసరించియే జనులు సంతానముఁ గను చుందురు, యావజ్జీవము శాస్త్రవిధినిషేధముల ననుస రించియే వారి భోజన పానములు జరుగుచుండును, వివాహాది సంస్కారములును నట్టివే; తుదకు వారు మరణించుటయు శాస్త్రవిధి ననుసరించియే. ఇందుఁ గల యొక గొప్ప సుగు ణము వినా యీ కఠిన శిక్షణమంతయు దోషయుక్తము. సుగుణ మేమనఁ, దరతరములనుండియుఁ బ్రబలిదిన మత్స్యర్త్సమై

యుండుటచే నల్పప్రయత్నముతోడనే చాల చక్కఁగా నేయొకటి రెండుపనులో జనులు చేయఁగలుగుచుందురు. మూఁడు మట్టిగడ్డలయొక్కయుఁ గొన్ని పుడకలయొక్కయు సాయమున నీదేశమందలి వంటవాఁడుకాని, వంటకత్తెగాని సిద్ధము చేయఁగలుగు రుచ్యమగు నన్నమును గూరయు భూతలమున మఱియెచ్చటను లభింపవు. ఇత్యాదులనాఁటి సాధన సామగ్రియగు నొక్కరూపాయి విలువగల మగ్గముతో, చిన్న గోతిలో నుంచఁబడిన కాళ్లతో, గజ మిరువదిరూపాయిలు ఖరీదుచేయు సన్నని జరీబట్టలను నేయుట యీ దేశమున మాత్రమే సాధ్యము. చినిఁగిపోయిన యొక చాప, ప్రమిదలోఁ బెట్టఁబడిన యాముదపుదీపము ఇటువంటి సాధన సంపదచేఁ బండితప్రకాండు లుత్పన్నమగుచుండుట యీ దేశముననే. అంగవైకల్యపు టందవికారపుఁ బెండ్లాము నెడ నఖండ క్షమాశీలమగు ననురాగమును, అభాగ్యపు టవక తవక వ్యక్తియైన మగనియెడ నా జన్మాంతమగు పతిభక్తియు సాధ్యమగుచుండుట యీ దేశముననే. ఇంత వఱకే సులక్షణములు.

కాని యివియన్నియుఁ గేవల నిర్జీవయంత్రములవలె నడుచు జనులచే నొనర్పఁబడుచున్నవి, మనోవ్యాపారదక్షత లేదు, హృదయవికాసములేదు, జీవచైతన్యములేదు, ఆశా ప్రసారములేదు, ఇచ్ఛాప్రకోపములేదు, ఆనందోత్కర్ష లేదు, తీవ్రదుఃఖానుభూతియు లేదు; నిర్మాణ ప్రతిభాసంచలనము లేదు, నూతనతత్త్వ జిజ్ఞాసలేదు, నూతనవిషయ గుణగ్రహ

గానే లేదు. ఇట్టి మానసమునుండి మబ్బులెన్నఁడును తొలఁగవు. ఉదయభాను సందీప్తి పవిత్ర మీ హృదయమును రంజింపఁ జేయఁజాలదు. ఇంతకంటె నున్నతస్థితి కలదా, లేదా యను విషయమే మనస్సునకుఁ దట్టదు; తట్టినో, నమ్మకము కలుగదు; కలిగినో, ప్రయత్నము కొఱవడును: ఒకవేళ ప్రయత్నము నబ్బెనో, ఉత్సాహాలోపము దానిని నాశనము చేయును.

నియమానుసారము నడుటవలన మాత్రమే యౌన్నత్యము గలుగుచో, వంశానుగతాచార సంప్రదాయములను 'తు, చ' తప్పకుండఁ బరిపాలించు టొక్కటియే సుగుణ మగుచో, నొక చెట్టుకంటె విశేష సుగుణసంపన్నుఁ డెవ్వఁడో, ఒక రైలుబండికంటె విశేషభక్తుఁడును విశేష మహానీయుఁడును నెవ్వఁడో, చెప్పుఁడు. ఈయి ప్రకృతి నియమము నుల్లంఘించు టెవ్వరైనను నెన్నఁడైనను జూచిరా! పశువులు పాపము చేయు టెవ్వరైనను నెఱిఁగుదురా!

పెద్ద స్టీమరు, బ్రహ్మాండమైన రైల్వేఇంజను నడచును, తిరుగును, పరుగెత్తును; కాని వానికిఁ దెలివిలేదు. అదిగో, ఆ రైలుపట్టానుండి ప్రాణరక్షణార్థము కదలిపోయిన యా పురుగున్నదే,—అది యేల తెలివి కలది! యంత్రమున నిచ్ఛాశక్తి లేదు, యంత్ర మెన్నఁడును నియమోల్లంఘనము చేయఁగోరదు; పురుగో, నియమము నతిక్రమింపఁగోరును, నియమమున కెదురుగాఁ బోవును—జయాపజయముల విష

యము వేయుమాట—కావున నది తెలిపికగలది. ఈ యిచ్ఛ యెంత జయప్రదముగాఁ బ్రకటింపఁగలుగునో జీవి యంత యున్నతవర్గములోనిది, తదీయసౌఖ్యమును నంతటి విశేషము. పరమేశ్వరేచ్ఛ సంపూర్ణ ఫలప్రదము కావున పరమేశ్వరుఁడు పురుషోత్తముఁడు.

విద్యయనఁగా నేమి? పుస్తక పాండిత్యమా? కాదు. వివిధశాస్త్రజ్ఞానమా? అదియుఁ గాదు. ఇచ్ఛావాహినియొక్క వ్యక్తీకరణమును నే శిక్షవలన స్వాధీనమై ఫలప్రదమగునో యదియే విద్య, అదియే విద్యాభ్యాసము. దేనివలనఁ దరతరములనుండియు నిరంతర బలాత్కారముచే నిచ్ఛాశక్తి స్తబ్ధమై, నేఁ డించుమించుగా వినాశముపాలైనదో, దేని ప్రభావమున నూతనభావముల మాట యటుండ, పూర్వభావములును నొకటొకటిగా నంతర్ధానమగుచున్నవో, అదియా విద్యాభ్యాసము? ఎయ్యది మానవుని మెల్లఁగా యంత్రముగా మార్చివేయుచున్నదో, అదియా విద్యాభ్యాసము? ఆలోచింపుఁడు. యంత్రప్రాయముగా సజ్జనులమైయుండుటకంటె స్వతంత్రేచ్ఛాజ్ఞానప్రేరితులమై తప్పు చేయుటయైనను దివ్యమని నా యభిప్రాయము. మట్టిముద్దల వంటి, నిర్జీవయంత్రములవంటి, గులకరాళ్ళకుప్పవంటివారి వలన నేర్పడిన కూటమును సమాజ మనఁదగునా? అట్టి సమాజము బాగుపడు టెట్లు? అభ్యుదయమనునది దాని వలన సాధ్యమైనచో శతాబ్దములకొలఁది మనము బానిసలమై యుండుటకుబదులు ప్రపంచమున మహోత్తమజాతియై

యుండును. నిరక్షరాస్యులతోడను మూఢులతోడను నిండి యుండుటకు బదు లీ భారతభూమి శాశ్వత విద్యాలయమై దీపించెడిది.

అగుచో, స్వార్థత్యాగము సుగుణము కాదా! బహుజన హితార్థము, బహుజన సుఖార్థము, ఒక్కని హితమును సుఖమును త్యజించుట మహోత్తమ ధర్మము కాదా? నిశ్చయముగా; కాని (వంగదేశమున) సామ్యము చెప్పునట్లు, "తోముకొనుటచే సౌందర్యము తెచ్చుకోఁగలమా?" "బలాత్కరించుటచేఁ బ్రేమ పుట్టింపఁగలమా?" "అభావే విరక్తి" యనునట్లు బిచ్చగాని వైరాగ్యమున ఘనత యేమున్నది? నపుంసకుని బ్రహ్మచర్యవ్రతమున సుగుణమేమున్నది! అదేవిధమున త్యాగాశయమే లేని, ఔదార్యమే లేని, సదాశయమే లేని, సమాజమనఁగా నేమో తెలియనివాని స్వార్థత్యాగమనఁగా నర్థమేమి? వితంతువును సహగమనము చేయుమని బలాత్కరించుటలో నేమి పతిభక్తి ప్రకాశితమగుచున్నది; వెఱ్ఱి నమ్మకములను మూఢవిశ్వాసములను బోధించి జనులచే సత్కార్యములను చేయింప నేల? జనులను స్వతంత్రులనుచేయుఁడు, వారి సంకెలలను విదళింపుఁడు—అనియే నేను ఘోషింతును. బురదచే బురదను కడుగఁగలమా? దాస్యముచే దాస్యమును బాఱఁద్రోలఁగలమా? ఏది?—ఒక్క నిదర్శనముఁ జూపుఁడు. సమాజము నిమిత్తము సర్వ సుఖేచ్ఛలను త్యజింపఁ గలిగిననాఁడు నీవు బుద్ధుఁడవై ప్రకాశింతువు,

ముక్తుఁడవై వెల్గొందుదువు; కాని యది యెప్పటిమాట? మఱియు నొరులను పీడించుటచే నది సాధ్యమగుననియా నీ యభిప్రాయము? "ఓహో! మా హితంబువు లెట్టి స్వార్థత్యాగాదర్శమూర్తులు! ఆహా! బాల్యవివాహ మెంత మనోహరము! ఇట్టి దివ్యాచారము మఱియొకటి యుండుట సాధ్యమా! బాల్యవివాహమున భార్యాభర్తల కన్యోన్య ప్రేమానురాగములకంటె మఱియొకటి యుండునా?"—ఈ రోజులలో దేశమున నెల్లెడలను మనము వినఁబడుచున్న యఱపు లివి! కాని సర్వాధికారులగు పురుషుల మాటయో? —స్వార్థత్యాగము వారి కవసరము లేదు! ఒరులను సేవించుటకంటె నుత్తమధర్మము కలదా? కాని బ్రాహ్మణుల కీ నియమ మన్వయింపదు—ఇతరులు మీరందఱును నవలంబింపుఁడు! యథార్థమేమన, సమాజముతో నెల్లో రాజీపడి స్వలాభమును జూచుకొనుటకు—కేవల స్వప్రయోజనార్థము—ఈ దేశమునఁ దల్లిదండ్రులును బంధుగులును గనికరమను నది లేక, తమబిడ్డలయొక్కయు నితరుల యొక్కయు బాగోగుల నీసడించివేయఁగలుగుచున్నారు; పరంపరానుగతమైన దుర్బోధవలన మనస్సు మొండిదేలి పోవుటచే వారి కిది బహుసులభమై పోయినది. ధీరుఁడగు వాఁడే స్వార్థమును తృణీకరింపఁగలఁడు. దండమును జూచి పిఱికిపంద భయపడి, యొకచేతితోఁ గన్నులు తుడుచు కొనుచు, రెండవచేతితో నిచ్చును. అట్టి దానమువలన నేమి ప్రయోజనము? సర్వజనులను బ్రేమించుటనునది కల లోని వార్త. లేఁత మొక్కచుట్టును గంచెవేసి సంరక్షింప

వలయును. ఒక్కరిని స్వార్థరహితముగాఁ బ్రేమింప నేర్వఁ గలిగినచోఁ గ్రమముగా విశ్వమానవప్రేమ నాశింపవచ్చును. ప్రత్యేకముగ నిష్ట దేవతయందు భక్తిని బడయఁగలిగినచో విరాడ్రూపమున భక్తి క్రమముగా సాధ్యమగును.

కావున నొక వ్యక్తినిమిత్తము స్వార్థమును విడనాడఁ గలిగినప్పుడే స్వార్థత్యాగమునుగూర్చి మాటాడవలయును, అంతకుముందు కాదు. సకామకర్మమే నిష్కామకర్మమునకు సాధనము. "కామిగాక మోక్షకామి గాఁడు" అనునట్లు మొదట రాగమనునది లేనిచో వైరాగ్యము కలుగదు. చీకటి యనునది లేనిచో వెలుతురనుమాట కర్థమేమి?

కోరికతో, రాగముతో, నుపాసన ప్రారంభమగును. అల్పతత్త్వోపాసన మొదలిడుము, ఉత్తమ తత్త్వోపాసన దానంతటదియే వచ్చును.

అమ్మా, ఆందోళన పడకు. మహావృక్షమునకే తుపాను. "ఊఁదిన నిప్పు రగుల్కొనును;" "తోఁక త్రొక్కిన త్రాఁచు లేచును;" విషయ మిట్టిది. హృదయ వేదన కలిగినప్పుడు, వికాసము కలుగునను నాస లంతరింపఁ బరితాపమను ప్రళయవాయువులు వీచునపుడు, ధైర్యభానుఁ డించుమించుగా నదృశ్యమై పోయినపుడు ప్రచండమైన యీ గాలివాన నడుమనే యంతర్గత బ్రహ్మతేజము భాసిం చును. అగర్భశ్రీమంతులై భోగములతోఁ బుట్టి పెరిగి, పూలపాన్పులపై శయనించుచుఁ బరితాపమన నెట్టిదో యెఱుఁగక, కన్నీటికణమైనను నెన్నఁడును రాల్పక, అమ్మా,

మెవ రంతర్గతబ్రహ్మవికాసము నొందిరో చెప్పుము? విలపించుటకు నీకు భయమెందులకు? విలపింపుము! విలాపము దృష్టిని నిర్మలమొనర్చి, యాత్మవికాసమును జేకూర్చును. అపుడు భేదదృష్టి పశుమానవ వృక్షాదులందు భేదభావము —క్రమముగాఁ దొలఁగిపోవ, సర్వత్ర, సర్వకాల సర్వావస్థలందును నఖండబ్రహ్మ దర్శనము నొందు నవకాశము లభించును. అపుడు,

శ్లో. సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్,
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్.
(భగవద్గీత, 13. 28.)

—"ఎల్ల ప్రాణులయందును నొకే పరమాత్మ నెలయుచుండుటఁ గాంచునట్టివాఁడు తనయందంతర్గతమైన పరమాత్మను హింసింపఁడు కావున నుత్కృష్టమగు మోక్షమును బొందుచున్నాఁడు."—సదా నీ శ్రేయోభిలాషి, వివేకానందుఁడు.

**144**

బేలూరుమఠము, 26 12 1900.

స్నేహాస్పదురాలగు ...రహస్యానుగూర్చి ప్రాజ్ఞుఁడగు మన మిత్రుఁడు చెప్పునదే నా యభిప్రాయమును. ఇక నీ విషయమునఁ బర్యాలోచింపఁదగిన యొక చిక్కున్నది—హిందూజాతి రహస్యజాతిగా మారుట యెన్నఁడైనను సంభవమా?...ప్రణామములు,—వివేకానందుఁడు.

## 145

బేలూరుమఠము, 7 9 1901.

స్నేహాస్పద ,...ఇంక వానలసంగతి చెప్పెదను—

స్వేచ్ఛగా ప్రారంభమై ప్రళయము వచ్చిన ట్లహర్నిశము సంతతధారగా నిపుడు వానలు కురియుచున్నవి. గట్లుదాఁటి నది విజృంభించుచున్నది, చెఱువులును దొరువులును బొరలి పాఱుచున్నవి. మఠావరణమునుండి నీటిని పాఱఁగించు లోఁతైన జలధారి త్రవ్వుటకుఁ (సోదరులకు) దోడ్పడి నే నిప్పుడే వచ్చినాను. వాననీరు పలుతావులందుఁ గొన్ని యడుగుల యెత్తున నిలిచియున్నది. నా పెద్దకొంగయు బాతులును బ్రహ్మానందపడుచున్నవి. నా పెంపుడు జింక మఠమునుండి పాఱిపోయి దన్నుఁ దిరిగి పట్టుకొనుటకుఁగాను గొన్ని దినములపాటు మాకాందుర్దా కలుగఁజేసినది. నా పొట్టి బాతులలో నొకటి, పాపము నిన్న చనిపోయినది. వారము దినములపా టది యెగయూపిరివిడిచినది. ఇది యంతయుఁ గని, హాస్యప్రియుఁడగు మా వృద్ధసన్న్యాసి యొకఁ డిట్లనుచుండును "అయ్యో, చెమ్మచే, వానచే, బాతులకు జలుబుచేయునటువంటి కప్పలు తుమ్మునటువంటి యీ కలియుగమున జీవించుటవలన లాభములేదు!"

ఒక బాతున కీఁకలు రాలిపో నారంభింపఁగా, నుపాయాంతరముఁగానక, పలుచని 'కార్బాలిక్' ద్రావకముతోఁ గూడిన యొక తొట్టిలో, (ఆ ద్రావకము దానిని జంపినను రక్షించినను సరియే యని) కొన్ని నిముసములపాటుంచినాను —ఇపుడాబాతు తేఱుకొనినది. మీ వివేకానందుఁడు.

146

వారణాసి, 9 2 1902.

సహృదయ—, ...బౌద్ధవాఙ్మయమున వేదాంతమతమును సూచించు ఘట్టములు గలవు, బౌద్ధమతమందలి మహాయాన సంప్రదాయము తప్పక అద్వైతపరముగా నున్నది. బౌద్ధుఁడను నమరసింహుఁడు బుద్ధనామావళిలో 'అద్వయ వాది' యను నామము నేల చెప్పవలయును?

బౌద్ధసంప్రదాయములు రెంటియందును మహాయానము * విశేష ప్రాచీనమని నా మతము.

ఋక్సంహిత యెంత ప్రాచీనమో మాయావాదమును నంతటి ప్రాచీనమైనది. మాయాభావన ప్రకృతిభావనముండియే వెలువడినది. మాయ యను పదము శ్వేతాశ్వతరోపనిషత్తునఁ గలదు. ఈ యుపనిషత్తును నే నధమపక్షము బౌద్ధమతముకంటె ప్రాచీనమని భావింతును.

బౌద్ధమతమునుగూర్చి యిటీవల నా కనేక నూతన విషయములు ద్యోతకమైనవి; ఈ క్రింది విషయములను నిరూపింప సంసిద్ధుఁడనై యున్నాను:

(1) వివిధరూపములను బొందిన శివపూజ బౌద్ధులకుఁ బూర్వముండినదే. బౌద్ధులు శైవ పుణ్యక్షేత్రములను వశపఱచుకొనఁ బ్రయత్నించిరి, కాని విఫలులై తత్సమీపమున సారనాథమువంటి నూతన స్థానములను నిర్మించిరి.

---

* రెండవది హీనయానము.

(2) డాక్టర్ రాజేంద్రలాల్ వచించు రీతినిఁగాక, యగ్నిపురాణమందలి గయాసురుని గూర్చినగాథ బుద్ధునికి సంబంధించినది కానేకాదు, అది యంతకు పూర్వపు గాథయే.

(3) బుద్ధుఁడు గయాశీర్ష పర్వతమున నివసింప నేఁగె నను విషయము తత్ప్రదేశము పూర్వమే యుండెనను సంగతిని నిరూపించుచున్నది.

(4) గయ యిదివఱకే పితృదేవతాపూజకుఁ దావలమై యుండెను; పాదముద్రాపూజను బౌద్ధులు హిందువులను జూచి నేర్చుకొనిరి.

(5) వారణాసినిగూర్చి యతిప్రాచీనగ్రంథములు సైతమది శివపూజానిలయమని నిరూపించుచున్నవి ఇత్యాది విషయములు.

బుద్ధగయయందును బౌద్ధవాఙ్మయమునుండియు నేను గ్రహించిన నూతన విషయము లనేకములు కలవు....

ఆధునిక హిందూమతమునకును బౌద్ధమతమునకును గల సంబంధమునుగూర్చి నా భావములు పూర్తిగామారినవి. దిఙ్మాత్రముగా నాకుఁగలిగిన యభిప్రాయముల నివృత్తముగను సవిస్తరముగను బ్రకటించునంతవఱకు నేను జీవింపకపోవచ్చును, కాని యే మార్గమున పరిశోధన సాగింపవలెనో సూచించివిడుతును, నీవును సోదరులును దానిని కొనసాగింపవలసియుండును, ఆశీర్వాదములు. ఆప్తుఁడు, వివేకానందుఁడు.

## 147

వారణాసి, 12 2 1902.

సర్వశక్తిసామర్థ్యములును నీకుఁ గలుగుఁ గాక! స్వయముగా జగన్మాతయే నీ హృదయమును హస్తములునై వెలయుఁ గాక! అఖండము, అప్రతిహతము నగు శక్తితో ననంత శాంతి సాధ్యమగుచో లభించుఁగాక!

శ్రీరామకృష్ణునియం దేమైనను యథార్థమునునది యున్నచో, నా కాతఁ డేవిధముగా మార్గదర్శకుఁ డయ్యెనో, అదేవిధముగా, కాదు, సహస్రగుణాధికముగా, నీకును మార్గదర్శకుఁడై వెలయుఁగాక!

## 148

### ఒక పాశ్చాత్య నారీమణికి

బేలూరుమఠము, జూన్, 1902.

అమ్మా—ఏ జాతిదైనను బరిపూర్ణమైన సంయమమున్న బ్రహ్మచర్య వ్రతాదర్శమును బ్రాపింపఁ గలుగుటకు ముందు వివాహము పావనసంస్కారమనియు తన్నియమము లనుల్లంఘనీయములనియు గ్రహించి, మాతృత్వము నెడ మహాగౌరవభావము నలవఱచుకొనవలయునని నా యభిప్రాయము. రోమన్ క్యాతలిక్కులును హిందువులును వివాహమును పవిత్రము, ననుల్లంఘనీయమునగు సంస్కారముగాఁ బరిగణించియున్న కారణమున నఖండశక్తిమంతులగు స్త్రీలను బురుషులను వెలువడఁజేసియున్నారు. అరబ్బులకు వివాహ మిచ్ఛానుసారము రద్దుచేసికొనఁదగిన యొండబడిక,

లేదా, బలప్రయోగముచేఁ బొందఁబడిన 'హార్కు', అంత
పవిత్ర కన్యాజీవనాశయముగాని, బ్రహ్మచర్యజీవనాశయము
గాని వికాసము నొందినట్లు కానరాదు. అధునిక బౌద్ధ
మతము వివాహ పరిణామదశ నొందని జాతుల వశమై
సన్న్యాసమును బరిహాసాస్పదము చేసివేసినది. కావున
(పరస్పర ప్రేమాకర్షణవిషయము నటుంచి) వివాహమును
గూర్చి జపాన్ దేశమున మహాపవిత్రాదర్శము పెంపొందిననే
కాని మహనీయులగు సన్న్యాసులును సన్న్యాసినులును
నెట్లు వెలువడఁగలరో నాకుఁ దెలియకున్నది. జీవనౌన్న
త్యము బ్రహ్మచర్యమున నిమిడియున్నదని నీ కవగతమైన
రీతిని సమాజమున నఖండశక్తిమంతులగు కొలఁది మంది
నైష్ఠిక బ్రహ్మచారులును బ్రహ్మచారిణులును వెలువడ
వలయునని, పాతివ్రత్యము, ఏకపత్నీ వ్రతము నను పావన
నియమములు జనబాహుళ్యమున కత్యావశ్యకములని
నాకను తోఁచుచున్నది....—వివేకానందుఁడు.

ఓం తత్ సత్

శ్రీరామకృష్ణార్పణమస్తు!

# అనుక్రమణిక

# లేఖాసంఖ్యా నిరూపణము

ఇందలి లేఖాసంఖ్యలను, వాని కెదురుగా (ఆంగ్ల) మూలము మూడవకూర్పునందలి లేఖాసంఖ్యలను ఈ దిగువఁ బొందుపరచు చున్నాము. మూలమందలి మొదటి కూర్పునకును మూడవ కూర్పునకును సంఖ్యాక్రమమున నించుక వ్యత్యాసముండుటచేతను, మొదటికూర్పునే మే మనుసరించియుండుటచేతను ఆ వ్యత్యాస మిందుఁ గాన్పించును. 65, 66 వ పుటలందలి "...సింహాబల...ధన్యుఁడై తిరుగు," అను భాగము మూలము, మూడవ కూర్పు, 166 వ లేఖయందలి భాగము.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 105 | 20 | 124 | 39 | 150 | 58 | 179 |
| 2 | 106 | 21 | 125 | 40 | 151 | 59 | 180 |
| 3 | 107 | 22 | 126 | 41 | 154 | 60 | 181 |
| 4 | 108 | 23 | 128 | 42 | 156 | 61 | 182 |
| 5 | 109 | 24 | 129 | 43 | 157 | 62 | 185 |
| 6 | 110 | 25 | 130 | 44 | 162 | 63 | 186 |
| 7 | 111 | 26 | 132 | 45 | 163 | 64 | 187 |
| 8 | 112 | 27 | 133 | 46 | 165 | 65 | 189 |
| 9 | 113 | 28 | 134 | 47 | 166 | 66 | 191 |
| 10 | 114 | 29 | 135 | 48 | 158 | 67 | 195 |
| 11 | 115 | 30 | 136 | 49 | 155 | 68 | 196 |
| 12 | 116 | 31 | 140 | 50 | 167 | 69 | 197 |
| 13 | 117 | 32 | 141 | 51 | 168 | 70 | 198 |
| 14 | 118 | 33 | 142 | 52 | 169 | 71 | 199 |
| 15 | 119 | 34 | 143 | 53 | 171 | 72 | 203 |
| 16 | 120 | 35 | 144 | 54 | 172 | 73 | 204 |
| 17 | 121 | 36 | 145 | 55 | 174 | 74 | 206 |
| 18 | 122 | 37 | 146 | 56 | 176 | 75 | 207 |
| 19 | 123 | 38 | 149 | 57 | 178 | 76 | 211 |

| | | | |
|---|---|---|---|
| 77 : 214 | 95 : 235 | 113 : 257 | 131 : 278 |
| 78 : 216 | 96 : 236 | 114 : 259 | 132 : 279 |
| 79 : 218 | 97 : 237 | 115 : 261 | 133 : 280 |
| 80 : 219 | 98 : 238 | 116 : 262 | 134 : 281 |
| 81 : 202 | 99 : 239 | 117 : 263 | 135 : 282 |
| 82 : 205 | 100 : 240 | 118 : 264 | 136 : 283 |
| 83 : 220 | 101 : 242 | 119 : 265 | 137 : 284 |
| 84 : 222 | 102 : 244 | 120 : 266 | 138 : 286 |
| 85 : 223 | 103 : 245 | 121 : 267 | 139 : 288 |
| 86 : 224 | 104 : 246 | 122 : 269 | 140 : 290 |
| 87 : 225 | 105 : 247 | 123 : 270 | 141 : 291 |
| 88 : 226 | 106 : 248 | 124 : 271 | 142 : 293 |
| 89 : 227 | 107 : 249 | 125 : 272 | 143 : 295 |
| 90 : 230 | 108 : 250 | 126 : 273 | 144 : 296 |
| 91 : 231 | 109 : 251 | 127 : 274 | 145 : 299 |
| 92 : 232 | 110 : 252 | 128 : 275 | 146 : 301 |
| 93 : 233 | 111 : 255 | 129 : 276 | 147 : 302 |
| 94 : 234 | 112 : 256 | 130 : 277 | 148 : 303 |



# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

| | వెల: |
|---|---|
| శ్రీ రామకృష్ణ సూక్తిసుధ | 7-50 |
| శ్రీ రామకృష్ణ లీలామృతము | 5-00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 3-50 |
| శ్రీ శారదాదేవి చరిత్ర | 2-00 |
| శ్రీ శారదా ప్రసంగములు | 2-50 |
| శ్రీ వివేకానంద జీవితచరిత్ర (సాదా) | 3-00 |
| ,, అట్ట బైండు | 3-50 |
| స్వామి శిష్య సంవాదములు | 5-00 |
| పారమార్థిక సంభాషణలు | 3-00 |
| నారద భక్తి సూత్రములు | 3-00 |
| జ్ఞానయోగము | 3-25 |
| రాజయోగము | 2-50 |
| కర్మయోగము | 1-50 |
| భక్తియోగము | 1-50 |
| సందేశ తరంగిణి, | |
| మొదటి భాగము | 3-00 |
| ,, రెండవ భాగము | 3-00 |
| ప్రబోధ రత్నాకరము | 2-25 |
| భారత యువజనులారా | 2-00 |
| పరతత్త్వ ప్రసంగము | 2-00 |
| దేవీమాహాత్మ్యము | 2-00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 1-25 |

| | వెల, |
|---|---|
| శ్రీ దొడ్డ భాగవతము (మొ.సం.) | 6-50 |
| ,, (రెండవ సంపుటము) | 5-50 |
| ,, (మూడవ సంపుటము) | 7-50 |
| శ్రీ మద్భగవద్గీత | 4-00 |
| నాగమహాశయుని జీవిత చరిత్ర | 1-25 |
| హిందూమతము | 1-25 |
| అనుష్ఠాన వేదాంతము | 1-25 |
| పారాయణ గీత | 1-25 |
| వివేక సూర్యోదయము | 1-00 |
| భారత దేశము | 1-00 |
| భారతీయ మహిళ | 1-00 |
| శ్రీరామకృష్ణ పరమహంస నీతికథారత్నములు | 0-75 |
| చికాగో సగరోపన్యాసములు | 0-50 |
| గురూపదేశములు | 0-50 |
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-37 |
| బుద్ధ ఉవాచ | 0-37 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-37 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0-37 |
| నామసంకీర్తన యుద్ధవిధానము | 0-37 |
| నా గురుదేవుడు | 0-37 |
| నవీన భారత దేశము | 0-25 |
| శ్రీరామకృష్ణ జీవిత సంగ్రహము | 0-25 |

సవివరముగు మాపూర్తికేటలాగు ఉచితము.

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

